ఫోన్ : 4406

టెలిగ్రామ్: హిందీసంఘ

సంచిక 5

సంపుటి 3

# స్రవంతి

సాహిత్య మాసపత్రిక

ఆగష్టు 1956

★

సంపాదకులు

వేమూరి ఆంజనేయశర్మ

సి. నారాయణరెడ్డి

★

హైద్రాబాదు హిందీ ప్రచార సంఘము

327, రెసిడెన్సీ రోడ్డు — హైద్రాబాదు.

సంవత్సర చందా
రు 6-0-0

ప్రత్యేక సంచిక
రు 0-8-0

Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide Proceedings Dis No 30/55 dated 6th January 1955

# ఈ సంచికలో



*సంపాదకీయం :*

# హిందీ ప్రచార సమ్మేళనము

భారత రాజ్యాంగ విధానంలో హిందీ రాజభాషగా అంగీకరింపబడి, హిందీ కమీషన్ గూడా నియమింపబడ్డది జులై చివరి వారంలో ఆ కమీషన్ వారు రాష్ట్రపతికి తమ నివేదికను అందజేసి యున్నారు భారత దేశం భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన ప్రణాళిక ననుసరించి భాషా ప్రాతిపదికమీద వేరు వేరు రాష్ట్రాలుగా విభజింపబడనున్నది భారతీయ భాష లన్నింటికి ఈ విభజనతో కొత్త వికాసం రానున్నది. హైదరాబాదు రాష్ట్రంగూడా ఆ ప్రణాళిక ననుసరించి పరిసర ప్రాంతాలలో లీనం కానున్నది ఇట్టి స్థితిలో హిందీ ప్రచార సమ్మేళనం హైదరాబాదు నగరంలో జరగడం ప్రతేక ప్రాముఖ్యతను సంపాదించుకొన్నది సమ్మేళనాన్ని రాష్ట్రపతి ప్రారంభించారు శ్రీ మోటూరి సత్యనారాయణగారు సమ్మేళనానికి అధ్యక్షత వహించారు. ఈ సమ్మేళనం ఆంధ్ర, హైదరాబాదు హిందీ ప్రచారసంఘములు రెండింటియొక్క సంయుక్త యాజమాన్యాన జరిగింది ఈ రెండు సంస్థలు దక్షిణ భారత హిందీ ప్రచారసభకు ప్రాంతీయ శాఖలుగా పనిచేస్తున్నవి హైదరాబాదు రాష్ట్ర విభజన జరుగనున్నది గనుక తెలంగాణా, ఆంధ్రప్రాంతాలు రెండూకలిసి నిర్మాణ కార్యక్రమా లన్నింటిలో అధికమైన అభివృద్ధిని సాధించవలసి యున్నవి ఆ దృష్టితో గూడా ఈ సమ్మేళనానికి ప్రత్యేక ప్రాముఖ్యత ఏర్పడింది ఆంధ్ర, హైదరాబాదు రాష్ట్రాలనుండి పలువురు ప్రతినిధులు ఈ సమ్మేళనంలో పాల్గొన్నారు ఉత్సాహపూరిత వాతావరణంలో సమ్మేళనం జయప్రదంగా జరిగింది

భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన కారణంగా మనదేశంలో కొన్ని విచిత్ర పరిస్థితులు ఏర్పడి ఉన్నవి భాషా విభేదం హద్దులను మించి వెర్రి తలలు వేసిన సంఘటనలు అనేకం మన ముందున్నవి. బొంబాయిలోనూ, తదితర ప్రాంతాలలోనూ జరిగిన దుర్ఘటనలు భాషావాదం వలన ఎంత పిచ్చితనం దేశంలో వ్యాప్తి

వుండగలదో నిరూపిస్తున్నవి. ప్రజల భాషలో ప్రభుత్వ నిర్వహణ జరగడమనే మూలసూత్రమే భాషా ప్రయుక్త రాష్ట్ర విభజనకు ప్రాతిపదికగాని, భాషపేరుతో అనైక్యతను పెంపొందించడం - తల బ్రద్దలు కొట్టుకొనడం - కాదు. దురదృష్టవశంవలన మనదేశంలో ఏర్పడిన వాతావరణం దేశానికి ఎంత ప్రమాదకరమో ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ చెన్నారెడ్డిగారు తమ ఉపన్యాసంలో వివరించారు. అట్టి కలుషిత వాతావరణాన్ని మాపించేసి పరస్పర భాషా ప్రేమను పెంపొందించవలసిన బాధ్యత హిందీ ప్రచారకులది. హిందీ సంస్థలమీద ఎక్కువగా ఉన్నది. వివిధ భాషా ప్రాంతాలను హిందీ ద్వారా ఏకంచేసి సాహిత్య సృష్టితో సాంస్కృతిక రంగంలో భారతీయుల నందరిని ఒక్కచోటికి చేర్చవలసిన బాధ్యత హిందీ కార్యకర్తలపై ఎక్కువగా ఉన్నది. ఈ ధావావాదం హిందీ ప్రాంతం వారిలోగూడా మరీ దురదృష్టకరమైన విషయము హిందీ ప్రాంతీయులు సంఖ్యాబలాన్ని ఆధారం చేసుకొని, తమ భాషకు ఏదో ప్రత్యేక ప్రాధాన్యత ఏర్పడినట్లు భావించి దూరదృష్టి లేకుండా వ్యవహరిస్తున్నారు. వారు చేస్తున్న పిడివాదం వలన అహిందీ ప్రాంతీయులలో హిందీమీద వైమనస్యభావం పెరుగుతున్నది. సమ్మేళనాధ్యక్షులు శ్రీ సత్యనారాయణగారు తమ ఉపన్యాసంలో "హిందీకి ఇద్దరు ప్రబల శత్రువులు బయలుదేరారు. ఒకరు ఈ హిందీ పిడివాదులు. రెండవవారు హిందీపేరుతో జాతీయ జెండాను దిగువడతామనే అతివాదులు. ఈ ఇద్దరు శత్రువులు కారణంగా హిందీ ప్రచారోద్యమానికి ముప్పు వాటిల్లుతున్నది. ప్రజలందరి సానుభూతితోనే హిందీ వ్యాప్తి జరుగగలదుగాని హిందీ బలవంతంగా నెత్తిన రుద్దబడుతున్నదనిగానీ - ఉద్యమం తప్పు దోవలలో నడుస్తున్నదనిగానీ - సందేహం కలిగితే ప్రజల సహకారం - ఈ ధ్యేయానికి లభించడం దుర్లభం కాగలదు" అన్నారు. రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్‌గారు తమ ప్రారంభోపన్యాసంలో ఈ విషయాన్ని ఎంతోస్పష్టంగా వివరించి ఉన్నారు. అహిందీ ప్రాంతీయుల మనస్సుకు బాధకలిగే విధంగా మాట్లాడవద్దనీ, ఈ విషయం జాగరూకత వహించవలసిన దనీ, రాష్ట్రపతి హిందీ వారిని హెచ్చరించారు. ఈ హెచ్చరికను హిందీ ప్రాంతాలవారు గమనించడం చాలా అవసరం

ఈ సమస్యలన్నీ దృష్టిలో పెట్టుకొనిచూస్తే హిందీ ప్రచార సమ్మేళనం అన్ని విధాలా తన లక్ష్యాన్ని సాధించ గలిగిన దని చెప్పవచ్చును ఈ సమ్మేళన సందర్భంలో జరిగిన కార్యక్రమాలు హిందీ ప్రచారోద్యమ మూలతత్వాన్ని ప్రజలముందు "చేతలలో" పెట్ట గలిగినవి హైదరాబాదులోని ప్రముఖ భాషలు ఐదింటికీ ఈ సమ్మేళనకార్యక్రమంలో స్థానం కల్పించబడ్డది హిందీ భాషావ్యాప్తి - ప్రాంతీయ భాషల సహకారం లభిస్తేనేగాని జరుగ దనేది పరమసత్యము సమ్మేళ నాధ్యక్షులు సెలవిచ్చినట్లు అసలు హిందీ ఉద్యమం ప్రాంతీయ భాషల పునరుద్ధానానికి సంబంధించిన ఉద్యమం, ఆ ఉద్యమ స్వరూపమే అది హిందీ ఉన్నతికి పాటుపడుతున్నా మంటే ప్రాంతీయభాష లన్నింటి ఉన్నతికి పాటుపడుతున్నా మన్నమాట ఆ విధానంలోనే హిందీ ఉద్యమ స్వరూపము తీర్చి దిద్దబడి ఉండాలి సమ్మేళన సందర్భంలో ఐదు భాషలలో సాహితీ సమ్మేళనము, కవి సమ్మేళనము, సాహిత్య చిత్రకళా ప్రదర్శనము, ఏకాంక నాటికల ప్రదర్శ నోత్సవము జయప్రదంగా జరిగినవి ఏకాంక నాటికల ఉత్సవంలో భాస విరచితమైన సంస్కృతనాటిక మధ్యమ వ్యాయోగం గూడా ప్రదర్శించబడ్డది హైదరాబాదు రాష్ట్రంలో సంస్కృతంలో నాటకాలు ప్రదర్శించడం ఇదే ప్రథమం

సాహిత్య చిత్రకళా ప్రదర్శనాన్ని ప్రారంభిస్తూ శ్రీ రామకృష్ణరావుగారు ఒక ముఖ్యమైన విషయాన్ని సెలవిచ్చారు "హైదరాబాదు సమ్మిశ్రిత సంస్కృతికి ఎంత కాలంనుండో కేంద్రంగా ఉన్నది ఆంధ్రరాజ్యం ఏర్పడిన తరువాత గూడా ఈ పట్టణానికిగల ఆ స్వరూపం మారిపోదు మారిపోగూడదు" అన్నారు ఈ విషయంలో హైదరాబాదు పౌరులు ప్రత్యేక శ్రద్ధను వహించవలసి యున్నది వినోబాజీ అన్నట్లు హైదరాబాదు సంక్షిప్త భారతదేశ స్వరూపం ఆ స్వరూపాన్ని కాపాడ వలసిన అవసరం ఈ నాడు ఎంతైనా ఉన్నది

హైదరాబాదులో రాష్ట్రపతి నిలయం స్థాపించబడ్డది. ప్రతి సంవత్సరం రాష్ట్రపతి కొంతకాలం హైదరాబాదులో ఉండగలరు దక్షిణ దేశానికి దాదాపు

హైదరాబాదు సాంస్కృతిక రాజధాని అయినట్లే ఈ రాజధానీ నగరంలో ప్రతి సంవత్సరము రాష్ట్రపతి దయచేసినప్పుడు దక్షిణ దేశంలో కళలకూ, సంస్కృతికీ, భాషలకూ ప్రోత్సాహం జరిగేపద్ధతిలో సాంస్కృతి కోత్సవాలు జరగాలి. అటువంటి సాంస్కృతిక కేంద్రం హైదరాబాదులో ఏర్పడాలి ఈ విషయాన్ని గుర్తించుకొని హిందీ ప్రచార సమ్మేళనంవారు చేసిన తీర్మానం ప్రత్యేకంగా ప్రశంసించ దగియున్నది ఆ తీర్మానాన్ని అమలులోనికి తీసుకొని రావడానికి ఒక ఉపసంఘంగూడా ఏర్పడినది ఉపసంఘంవారు తొందరలోనే ఒక ప్రణాళికను తయారుచేయగలరని ఆశిస్తున్నాము సమ్మేళనంలో జరిగిన ఐదు తీర్మానాలూ హిందీ వ్యాప్తికి దోహదం కలుగచేసేవిగా ఉన్నవి దేశప్రజల సహకారంతో హిందీ ఉద్యమం పెంపొంద గల దని విశ్వసిస్తున్నాము



# భావమంజరీ

డా. బూర్గుల రామకృష్ణరావుగారు
హైదరాబాదు ముఖ్యమంత్రి

శరదిందుముఖి! త్రివిష్టపే
నహిదృశ్యం తవ; కిం గమిష్యసి?
జగతాం రమణీయ దర్శనం తే
వదనాంబుజ మేకమేవ యత్.

నయనాత్ కువలయమస్యసి;
వదనాదుత్ఫుల్లపంకజాతాని;
రదనచ్ఛల కుంద ధారిణి!
స్పృహణీయం తవ పుష్పితాననం.

యత్ర యత్ర తవ పాదపంకజం
తత్ర తత్ర కమలాయతే ధరా.
యత్ర యత్ర తవ మంద సుస్మితం
తత్ర తత్ర శరదిందుచంద్రికా

అధరోష్ఠం యది చాల్యతే సకృత్
వదనాబ్జం సురభీకరోతి గాం,
కమనీయ కటాక్ష ఏక ఏవ
జగదేతత్ మదనీకరోతి తే

మందం నిక్షిప పాదౌ భూమౌ
నైషా క్షితితలకేవల కణికా
కశ్చిద్యోషా గండతిలోవా,
చందన పంకిల దేహరజోవా

శుద్ధాంతకేళీనిలయాశ్చ రమ్యాః
క్రీడాంగణాన్యేవహి రాసభానాం;
రాజన్య చూడామణి చుంబిపాద
రాజీవధన్యోఽపిహి విస్మమాధిః.

*

# హిందీ ప్రచార సమ్మేళనము, హైద్రాబాదు

## అధ్యక్షోపన్యాసము

శ్రీ మోటూరి సత్యనారాయణ

బృహదాంధ్రదేశానికి సంబంధించిన ఈ హిందీ ప్రచార సమ్మేళనానికి అధ్యక్షునిగా ఎన్నుకొని నన్ను ఎంతగానో గౌరవించిన మీకు నేను ఎంతయు కృతజ్ఞుడను ఈ సమ్మేళనానికి అధ్యక్షత వహించగలిగిన యోగ్యత నాలో ఎంతమాత్రము లేదనే విషయాన్ని నేను బాగా ఎరుగుదును నా యెడల మీకుగల అభిమానం తప్ప నన్ను అధ్యక్షునిగా ఎన్నుకొనుటకు ఇంకొక కారణ మేమీ లేదు హిందీ ప్రచార క్షేత్రంలో చిరకాలంనుండి పనిచేస్తూన్న కార్యకర్తను నేను హిందీ ప్రచార క్షేత్రానికి సంబంధించిన వివిధ సమస్యలను కొంతవరకు నేను ఎరుగుదునుగూడా అయినా ఈ పదవికి తగిన పాండిత్యముగాని, యోగ్యతగాని నాలో లేదనే విషయాన్ని గుర్తించిగూడా మీ ఆజ్ఞను శిరసావహించినాను ఈ నాడు ఈ సమ్మేళనమును పూజ్యులైన శ్రీ రాజేంద్ర ప్రసాదుగారు ప్రారంభించినారు. ఇది చాల సంతోషకరమైన విషయము రాజేంద్ర బాబుగారు గడచిన నాలుగు దశాబ్దములనుండి దేశోపయోగకరములైన కార్యక్షేత్రము లన్నింటిలో కార్యకర్తలకు ఆదర్శరూపంగా ఉన్నారు వారి ప్రోత్సాహము, వారి సహాయము హిందీక్షేత్రంలో పనిచేస్తూఉన్న కార్యకర్తలకు సదా లభిస్తూనే ఉన్నది వారు మహాత్మాజీ నిర్యాణానంతరం మహాత్ముడు నిర్వహించిన కార్యము లన్నింటి భారాన్నీ తమ భుజములపైకి తీసుకొన్నారు

ఈ సమ్మేళనానికి ప్రత్యేక ప్రాముఖ్యత ఉన్నది ఈ ప్రాముఖ్యతకు అనేక కారణము లున్నవి తెలుగుభాష మాట్లాడేవారి చరిత్రలో అఖిలాంధ్రంలో ఉండే ప్రతినిధు లందరూ కలసి నడుపుతున్న మొదటి సమావేశమిది అంతేగాక భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన సిద్ధాంతమునను సరించి ఆంధ్రదేశమునకు రాజధాని కానున్న హైదరాబాదు నగరంలో ఈ సమావేశం జరుగుతున్నది ఈ ప్రదేశానికి నామకరణంగూడా కొద్ది రోజుల్లో జరుగనున్నది హైదరాబాదునగరం ఐతిహాసికంగా, సాంస్కృతికంగా, భౌగోళికంగాగూడా ప్రత్యేకప్రాముఖ్యత కలిగి ఉన్నది ఈ పట్టణం కృష్ణా గోదావరి నదుల మధ్యనున్న భూభాగంలో ఉన్నది. ఈ పట్టణం వందలాది సంవత్సరాలవరకు దక్షిణ దేశానికి రాజ్యస్థానమై దక్షిణ భారత దేశ చరిత్రలోని పుటలను నింపివేసినది ఆర్యావర్తమునుండి వింధ్యాచలాన్ని దాటి దక్షిణ దేశాన్ని పరిపాలించవలెనని కలలుగన్నవారి కిది కేంద్రంగా ఉండిపోయినది అందుతోబాటు, ఈ పట్టణం సమన్వయాత్మకము, సమ్మిశ్రితమును నైన భారతీయ సంస్కృతికి ప్రధానకేంద్రంగా గూడా ఉన్నది ప్రజాసత్తాకమైన, స్వాయత్తపూర్ణమైన గణరాజ్యము భారతదేశంలో స్థాపించబడిన తరువాత మన ఆలోచనా విధానములను, పారంపర్యంగా మనకు లభించిన సంపదను భవిష్యదాకాంక్షలతో జోడించుకొని చరమలక్ష్యం వైపుకు సాగిపోవు మార్గంలో ఉన్న ముఖ్యకేంద్రాలలో హైదరాబాదుకు ప్రముఖస్థాన మున్నది.

రాజ్య పునర్నిర్మాణ ప్రణాళిక ననుసరించి తెలుగు మాట్లాడేవారికి, తెలుగుభాషాప్రదేశ
నివాసులకు ఒక రాజ్యం ఏర్పడగలదు ఈ రాజ్యం ఉత్తరదిశలో ప్రాణహితనుండి పాలారు
నది వరకు, తూర్పున బరంపురం నుండి పశ్చిమదిశలో బళ్లారివరకు వ్యాపించి ఉంటుంది
సుమారు 115 వేల మైళ్ల విస్తీర్ణం కలిగిన ఈదేశం సుమారు మూడుకోట్ల ఇరవైఐదులక్షల
మందికి కర్మక్షేత్రం కాగలదు ఈ రాజ్యంలో నివసించేవారు తెలుగుభాషను సాధనంగా
స్వీకరించి, భారతీయ సంస్కృతి వికాసానికి అనేకమైన ఉత్తమ కార్యకలాపములను చేయ
గలరు. సాహిత్యము, సంస్కృతి, సంగీతము, శిల్పము, చిత్రకళ మొదలగు అనేక రంగా
లలో అభివృద్ధిని సాధించడానికి ఈ ప్రాంతీయులకు ఎక్కువ అవకాశము లభించగలదు.
రాష్ట్ర పునర్నిర్మాణ పథకమునసుసరించి ఏర్పడనున్న పదహారురాష్ట్రాలలో ఈప్రాంతమునకు
నాలుగవ స్థానము, జనసంఖ్య ననుసరించి మూడవస్థానము లభించగలదు లభించిన సాధ
నములను బట్టి చూస్తే సాంస్కృతిక వికాసరంగంలో ఈ ప్రాంతము తప్పక అభివృద్ధిని
సాధించగలదని నిస్సంశయంగా చెప్పవచ్చును

విస్తారంలో పెద్దది గావడంతో బాటు బాధ్యతను నిర్వహించడంలో గూడా ఆంధ్ర
రాజ్యం మిగతా రాజ్యాలకంటె ఎక్కువ ప్రాముఖ్యతను వహించవలసిఉన్నది రాష్ట్ర
పునర్నిర్మాణ పథకానికి భాష ఆధారరూపంలో అంగీకరించబడ్డది ఆంధ్రరాష్ట్రంలో ప్రధాన
భాష తెలుగు అని అందరికీ తెలుసును ఈ రాష్ట్రంలో ఎక్కువ సంఖ్యలో ఇతర భాషలు
మాట్లాడేవారు ఉన్నా వారందరు తెలుగుభాషను తెలుసుకోనడం తప్పనిసరి అయిఉంటుంది,
ఇరుగు పొరుగు భాషల సంఖ్య దృష్టితో చూస్తే ఎక్కువ సంఖ్యలో పొరుగుభాషలు కలిగినది
తెలుగుభాష ఒక్కటే తూర్పున ఒరియా, ఉత్తరంలో హిందీ, ఉత్తర పశ్చిమంలో మరాఠీ,
పశ్చిమంలో కన్నడము, దక్షిణంలో తమిళము తెలుగు భాషకు ఇరుగు పొరుగు భాషలు
మొత్తం ఆంధ్రప్రాంతానికి ఇరుగు పొరుగు భాషలు ఐదు ఈ భాష లన్నింటితో స్నేహము
సంపాదించి, సార్వదేశిక దృష్టితో అంతర్భారతీయ సంస్కృతిని పెంపొందించడం ఆంధ్ర
ప్రాంతం యొక్క కర్తవ్యం కాగలదు ఈ కర్తవ్యం ఎంత బాధ్యతతో కూడుకొన్నదో అంత
అదృష్టకరమైనది ఎందువల్లనంటే ఈ ఐదుభాషల సంస్కృతీ వాహినులు ఎల్లప్పుడు
ఆంధ్రరాజ్యం లోనికి ప్రవహిస్తూ ఉండగలవు ఈ వాహినుల ద్వారా బలాన్ని సంపాదించు
కొని, వాటిని తనలో కలుపుకొని భారతీయ సంస్కృతి స్వరూపాన్ని తీర్చిదిద్దడంలో
ప్రధాన స్థానాన్నివహించే అదృష్టం ఆంధ్రరాష్ట్రానికి లభించగలదు ఈ ఐదు పొరుగుభాషల
తోనూ, సంస్కృతం తోనూ తెలుగుకు మొదటి నుండి మంచి సంబంధం ఏర్పడిఉన్నది
గోదావరి తీరస్థమైన పుణ్యభూమి సంస్కృత పండితులకూ, కృష్ణానదీ తీరము ప్రాకృత
భాషా పండితులకూ ఆలవాలముగా ఉండేవి క్రీస్తుకు పూర్వం మూడవ శతాబ్దానికి ముందూ,
తరువాత గూడా కృష్ణానదీతీరం ప్రాకృతభాషలకు కేంద్రంగా ఉండేది శాతవాహనరాజులు
మొదటిసారి మగధరాజులతో పోరాడి, రాజకీయంగా దక్షిణదేశాన్ని స్వతంత్రం చేశారు. ఈ
కాలంలోనే బౌద్ధధర్మం విరివిగా వ్యాపించింది ఆంధ్రదేశం బౌద్ధ ధర్మానికి ముఖ్య కేంద్ర
మైనది. శాతవాహన రాజులు ప్రాకృతభాషలను పోషించారు ఆ సమయంలోనే వ్రాయబడిన

'గాథా సప్తశతి' ఆంధ్ర, మహారాష్ట్రు లిద్దరి సంయుక్త సంపత్తిగా భావించబడుచున్నది శాత వాహనులు బీహారులోని మగధరాజులను జయించి హిమాలయం వరకు తమ కీర్తిని వ్యాపింప జేశారు. క్రీస్తుకు పూర్వం ఆరవ శతాబ్దం నుండి క్రీస్తుశకం పదకొండో శతాబ్దం వరకు కృష్ణా గోదావరి మధ్యస్థమైన భూమి సాంస్కృతిక క్షేత్రంగా ఉండిపోయింది ఈ శతాబ్దాలలోనే భారతీయ సంస్కృతి తన వికసితమైన నిజస్వరూపాన్ని గుర్తించే ప్రయత్నం చేసింది ఈ కాలంలోనే వైదిక ధర్మానికీ, బౌద్ధ ధర్మానికీ మధ్య గొప్ప సంఘర్షణ జరిగింది ప్రాకృత భాషలకు సంస్కృతమునకు మధ్య జరిగిన సంఘర్షణ గూడా సామాన్యమైనది కాదు ఇదే యుగంలో బౌద్ధ ధర్మంలో మహాయాన సంప్రదాయం బయలుదేరింది విశ్వమందంతటా ప్రచలితమైన మహాయాన సంప్రదాయము కృష్ణానదీ తీరంలోనే బయలువెడలిందని ప్రతీతి బౌద్ధ ధర్మాచార్యులు నాగార్జునుడు కృష్ణానదీ తటంలో ఈ సంప్రదాయాన్ని ప్రారంభించడానికి విశేషంగా తపస్సును చేశాడు మహాయాన శాఖ భక్తి ధర్మానికి మాతృక అని గూడా అంటుంటారు ఈనాడు యావద్భారత దేశంలో పూజింపబడుతున్న సంస్కృత మహాభాగవతం గూడా కృష్ణా గోదావరీ మధ్యభాగంలోనే రచింపబడ్డది ఆంధ్రదేశంలో ఇంటింట పూజింప బడుతున్న తెలుగు మహాభాగవతం గూడా ఈ భూభాగంలోనే రచింపబడ్డది భక్త కవిశిరోమణి పోతన్న భాగవతాన్ని రచించాడు

పదకొండవ శతాబ్దానికి పూర్వం తెలుగు దేశంలో వికసించిన సంస్కృతి తన ప్రాదేశిక భూరేఖల వరకే సీమితం గాక నదీముఖాల ద్వారా సముద్రాలను దాటి ప్రాచ్య దేశాలకు గూడా వ్యాపించింది క్రీస్తుకు పూర్వం రెండవ శతాబ్దానికి పూర్వం ఈభూభాగంలో మహాయాన సంప్రదాయ ప్రభావంవలన సృష్టింపబడిన ఉత్కృష్ట కళాఖండాలు కళాప్రపంచంలో సాటిలేనివి ఈ హైదరాబాదు పట్టణానికి చుట్టుపట్ల నూటఏభై, రెండువందల మైళ్లలోపల కళాభిజ్ఞులు, చరిత్రకారులు పర్యటనం చేస్తే వివిధ విషయాలను వారు తెలుసుకొనగలరు.

ఆనాటి శిల్పులు రాళ్లలో కవిత్వాన్ని నింపివేశారు అమరావతి, నాగార్జునకొండ, భట్టిప్రోలు మొదలగు స్థలాలలో లభించిన కళాఖండాలతో పరిపోల్చదగినవి వేవి? బౌద్ధ ధర్మంతో బాటు వైదిక ధర్మం గూడా ఈ స్థానంలో ఉత్కృష్ట దశ నందుకొన్నది ఈ భూభాగం విఖ్యాత ధర్మాచార్యులను, మహా సంస్కృత పండితులను ఉద్భవింపజేసినది పవిత్ర గోదావరీ నదీతీరంలో నున్న రాజమహేంద్రవర పట్టణంలో వర్తమాన తెలుగు భాషా స్వరూపానికి రేఖలు గీయబడినవి ఈ పని కొన్ని శతాబ్దాల వరకు జరుగుతూ వచ్చింది. తత్పరిణామస్వరూపంలో 1022 లో నన్నయభట్టు మహాభారత రచనను ప్రారంభించాడు ఆనాటి ప్రామాణికము, ప్రచలితమునైన భాషలో మహాభారత రచన సాగింది తెలుగు మహాభారతంలోని గద్యపద్యములు తొమ్మిది వందల సంవత్సరాలకు పూర్వమే రచింపబడ్డా వాటిని ఆంధ్రదేశంలోని యావన్మంది ప్రజలూ ఈనాడు గూడా తేలికగా అర్థంజేసుకొన గలుగు తున్నారు భారతదేశం లోని ఆచార్య చతుష్టయంలో కనిష్ఠాచార్యులు మహాప్రభువు వల్లభా చార్యులు జనసామాన్యం మాట్లాడే భాషను కావ్యభాషగా స్వీకరించి, దానిని సంస్కృత శబ్ద సమన్వితంచేసి, ప్రామాణిక భాషగా తయారుచేశాడు. మహాభారతం ఉత్తమోత్తమమైన

ఒక ధర్మగ్రంథమే గాక అది ఒక సాంఘిక జ్ఞానకోశముగూడాను ఆంధ్రదేశంలో నివసించే ప్రజలు సంస్కృత నిష్ఠమైన శైలితో సుపరిచితులు ఈనాడు తెలుగు మీద సంస్కృతభాష ప్రభావం ఎంతగా పడిఉన్నదంటే భాషా శాస్త్రజ్ఞులు తెలుగు ద్రావిడ భాషాజన్యమా, లేక ఆర్యభాషాజన్యమా అనే విషయాన్ని నిర్ధారణ చేయలేకపోతున్నారు. వాస్తవానికి భారతదేశం యొక్క సమగ్రమూ, సమన్వయాత్మకమూ అయిన సంస్కృతికి ఆంధ్రదేశం ప్రయోగ క్షేత్రంగా ఉన్నదని చెప్పవచ్చును వింధ్యను దాటి ఔత్తరీయ సంస్కృతి మొట్టమొదటి సారి ఈ ప్రదేశంలోనే అడుగుబెట్టింది పూర్వభారతం నుండి బౌద్ధసంస్కృతి ప్రాకృతభాషలద్వారా ముందుకు సాగి ఈ ప్రాంతంలో నుండియే ముందుకు వెళ్లగలిగింది ప్రాచీనకాలం నుండి దక్షిణదేశంలో నివసించిన ద్రావిడజాతుల సంస్కృతి ఇక్కడ ఉండనే ఉన్నది గోదావరీతీరం నుండి బయలుదేరిన సంస్కృత భాషాజన్యమైన సంస్కృతీ, కృష్ణానదీతీరం నుండి బయలు దేరిన ప్రాకృత భాషాజన్యమైన సంస్కృతీ దాక్షిణాత్య సంస్కృతిలో సమ్మిళితములైనవి ఈ సమ్మేళనం పదోశతాబ్దం వరకు జరుగుతూవుండి చివరకు ఈనాడున్న సమ్మిళితసంస్కృతి ఏర్పడ్డది

ఒక కాలంలో ఆంధ్రదేశంలోని పూర్వభాగం కళింగమని పిలువబడుతూ ఉండేది. ఆ ప్రదేశం ఉత్తర కళింగము, మధ్య కళింగము, దక్షిణ కళింగ మని విభజింపబడి ఉండేది ఈ కళింగముల నుండియే బౌద్ధ ధర్మము ఆంధ్రదేశంలోనికి ప్రవేశించినది మూడు భాగము లుగా విభజింపబడిన ఈ ప్రదేశము గోదావరీతటం వరకు వ్యాపించియుండెను ఈప్రదేశాన్ని త్రికళింగమని అంటుంటారు త్రిలింగం త్రికళింగ శబ్దానికి పర్యాయవాచక శబ్దమవునో కాదో చెప్పడం కష్టం ద్రాక్షారామము, శ్రీశైలము, కాళహస్తి ఈ మూడు శైవక్షేత్రములను బట్టి ఈ దేశమునకు త్రిలింగ మను పేరు వచ్చినదని చాలా మంది చెప్పుతున్నారు కాని 11 వ శతాబ్దం వరకు ఈ ప్రదేశంలోని పూర్వభాగానికి కళింగమనే పేరు ఉండేది ఆంధ్రదేశంలో పశ్చిమభాగాన్ని ఆంధ్రమనేవారు. ఈ భూభాగంలో ఈనాటి మహారాష్ట్ర కిన్నడ ప్రాంతము లకు ఎక్కువ సంబంధం ఉండేది ఈ దేశానికి దక్షిణంగా తమిళదేశం ఉన్నది ఈ మూడు ప్రాంతాల నుండి వచ్చిన భిన్న భిన్న సంస్కృతిప్రవంతులు కృష్ణా గోదావరీ భూభాగంలో సమ్మి ళితమైనవి ఈ రెండు సంస్కృతులు కృష్ణా గోదావరీ నదులవలె అతి ప్రాచీనములైనవే గాక శక్తివంతము లయినవి బహూశా అందువల్లనే కాబోలు ఇంతవరకు ఈ ప్రదేశంపేరు ఆంధ్రమా, తెలంగాణయా, లేక ఆంధ్ర-తెలంగాణయా నిర్ధారణ కాలేదు ఎందువల్లనంటే ఈప్రదేశంలో ఉండేవారికి ఈ రెండు శబ్దములూ ప్రియమైనవి ఇదే విధంగా ఈ ప్రదేశంలో సంస్కృతి త్రివేణి, సాహిత్య త్రివేణి, భాషా త్రివేణి ఈ మూడు ప్రవహించినవి

గడచిన మూడు నాలుగు వందల సంవత్సరాల నుండి ఉత్తరదేశ సంస్కృతి దక్షిణ దేశంలోనికి ప్రవహిస్తూ ఉండిపోయింది అది ఒక కొత్తరూపాన్ని ధరించి వచ్చింది. ఈ రూప పరివర్తనానికి కారణం భారతదేశంలోనికి ఇస్లాము మతం ప్రవేశించడమే. అది గూడా తనను తాను అభివ్యక్తించేసుకొనడానికి కొత్తమార్గాలను వెదకుకొన్నది అది పంజాబులోని ఐదు నదులను, ఉత్తరప్రదేశ్‌లోని త్రివేణిని దాటి వింధ్య హిమాచలముల మధ్య నున్న

భూభాగం మీద తన ప్రభుత్వాన్ని స్థాపించుకొన్నది కాని తనను తాను అభివ్యక్తం చేసుకొన దానికి తగిన సాధనాన్ని మన ఈ భూభాగంలోనే తయారుచేసుకున్నది ప్రస్తుతమున్న ఉర్దూభాష ఇక్కడనే జన్మించినదనేవిషయాన్ని చాలామంది మరిచిపోతూఉంటారు ఉర్దూ సుమారు మూడువందల సంవత్సరాల వరకు అరబ్బీ ఫార్సీభాషల సమ్మేళనంతో దేశంలో ఏకచ్ఛత్రాధిపత్యాన్ని సంపాదించింది ఈ భాషను మొదట దక్కినీ అనేవారు ఈ భాషలో గద్య పద్యాత్మకమైన రచనలు ఎన్నో జరిగినవి అది నెమ్మది నెమ్మదిగా ఉత్తరదేశంవైపుకు వ్యాపించి తన రూపాన్ని మార్చుకొని ఉర్దూ అనే పేరుతో అఖిలభారతీయ రూపాన్ని సంపాదించుకున్నది రాజ్యాంగ విధానంలోని పదునాలుగు భాషలలో స్థానాన్ని సంపాదించుకొన్నది

అతి ప్రాచీనకాలం నుండి హిందూదేశం రెండుభాగాలుగా విభక్తమై ఉన్నది ఉత్తర భాగానికి ఆర్యావర్తమనీ, దక్షిణదేశానికి దక్షిణాపథమనీ పేరు దానికి కారణం హిందూదేశం లోని భూగోళమే వింధ్య పర్వత ఉత్తుంగశిఖరాలు ఆర్యావర్తంలోని ప్రజలను దక్షిణాపథం లోనికి రానివ్వలేదు అగస్త్యుడు దక్షిణాపథంలోనికి రానివ్వవలసినదని వింధ్యేశ్వరుని ప్రార్థించినాడట వింధ్యేశ్వరుడు అందుకు అంగీకరించినాడు ఆ తరువాత ఉత్తరదేశస్థులు దక్షిణాపథంలోనికి రావడానికి మార్గం ఏర్పడింది అగస్త్యుడు దక్షిణదేశపుభాషలను నేర్చుకొని వ్యాకరణంగూడా రచించాడు ఈనాడు గూడా తమిళ వ్యాకరణాన్ని "అగస్త్య"మని అంటారు ఒకప్పుడు దక్షిణాపథమంతటా ఒకే భాష మాట్లాడబడుతూ ఉండేది కొన్ని రూప భేదాలలో కన్యాకుమారి నుండి వింధ్యవరకు అది ఒకేరూపంలో ఉండేది దాని మూలరూపం హిందూస్థానమంతటా వ్యాపించి ఉండేదని భాషాశాస్త్రజ్ఞులు చెప్పుతున్నారు ఈనాడు గూడా దాని ఆదిరూపం "బ్రాహ్మి" అనే పేరుతో బెలూచిస్థానంలో లభిస్తున్నది ఈ ద్రావిడభాషారూపములు హిమాలయ ప్రాంత భూములలో, వింధ్యకు దక్షిణంగా ఉన్న నిబిడారణ్యాలలో, పడమర తూర్పు కనుమలలోని అడవులలో కనపడుతున్నవి దక్షిణాపథంలోని భూగోళం అనుకూలంగా ఉండి ఉన్నట్లయితే ఏకభాషా ప్రచార ప్రయత్నం సఫలమయ్యేది

కన్యాకుమారి నుండి ఉత్తరదిశలో సాత్‌పురావరకు పెద్దగోడవలె అడ్డంగా ఉన్న దక్షిణదేశపు ఒక పర్వతమాల దక్షిణాపథాన్ని రెండు భాగాలుగా విభజించింది ఈ పర్వత మాలను పడమర కనుమలని అంటుంటారు ఈ గోడ తనకు తూర్పుగా ఉన్న భాగమును ఆంధ్ర తమిళనాడులనీ, పశ్చిమభాగాన్ని కేరళ కర్ణాటకములనీ విభజించింది ఇదే విధంగా శేషాచల పర్వతాలు తమిళ ఆంధ్రదేశములను వేరుచేసినవి నీలగిరి పర్వతాలు పశ్చిమదిశ లోనూ, కొడైకెనాల్ పర్వతాలు తూర్పునా ఉండి కేరళ కర్నాటకములను వేరుపరచినవి భూగోళమునకు సంబంధించిన ఈ సౌకర్యాలు, అసౌకర్యాలు దక్షిణాపథపు రాజకీయచరిత్రకు రూపుగట్టినవి నదులు పర్వతపంక్తులు గూడా ఈ దేశపు చరిత్రను, భాషాస్వరూపమును నిర్ణయించుటకు తోడ్పడినవి నాగరికత, సంస్కృతి ప్రవేశించినచోట వల్లా ప్రామాణికము లైన భాషలు ప్రచారంలోనికి వచ్చినవి అడవులు, పర్వతమాలలతో నిండిన ప్రదేశాలలో ఈనాడు గూడా సమన్వయాత్మకమైన శక్తులకు దూరంగానున్న భాషలు ప్రచలితంగా ఉన్నవి ఆ ప్రదేశాలు ఈ దేశంలోని మూలజాతులకు, మూలభాషలకు కేంద్రములు భూగోళము,

చరిత్ర ఈ రెండూ దక్షిణాపథాన్ని నాలుగు భాగాలుగా విభజించినవి ఆ భాగాలనే తమిళ, కేరళ, కర్ణాటక, తెలుగు భాగాలని మన మంటున్నాము ఈనాడు ఈ నాలుగు ప్రాంతాలకూ వేరువేరు భాషలూ, వేరు వేరు సాహిత్యమూ ఉన్నవి ఈ భాషలలోని సాహిత్యంలో ప్రవహిస్తున్న అంతర్ధార సమానంగానే ఉన్నా వాటి బాహ్యరూపములూ, గతివిధులూ ఒకదానికొకటి వేరుగా ఉన్నవి కాలమూ, రచయితల ప్రతిభా కలసి ఈ భాషలను ఒకదానికొకటి వేరుగా చేసినవి ఇది సంక్షేపంలో దక్షిణాపథం చరిత్ర దాదాపు ఆర్యావర్తంలోని భాషల చరిత్ర గూడా ఇటువంటిదే

రాజస్థానం నుండి దర్భంగా వరకు హిమాలయం నుండి వింధ్య వరకు వ్యాపించిన భూమి దాదాపు సమతలమైనది భారతదేశపు ఉత్తర పశ్చిమదిశ నుండి విదేశస్థులు దండయాత్ర చేసి వచ్చినప్పుడల్లా తమతో బాటు తమ సంస్కృతినీ, సాహిత్యమునూ తీసుకొని వచ్చారు విదేశస్థులు ఈ భూమిని తమ తమ శక్తిప్రయోగాలకు క్రీడాస్థలంగా చేసివేశారు. ఈ భూభాగమందంతటా ఒక సామాన్య భాషను ప్రచారంచేయవలెనని ప్రయత్నించింది ఆప్రయత్నం కొంతవరకు సఫలమయింది కాని ఆ ప్రయత్నం జనసామాన్యాన్ని ఆధారంగా చేసుకొని గాక దేశ నాయకులను ఆధారంగా చేసుకొని సాగింది సంస్కృతము, పార్సీ, ఉర్దూ భాషలు రాజులు, రాజసేవకులు, రాజ్యాలకు సంబంధించిన భాషలుగా పనిచేసినవి ఈభాషలను అభివృద్ధిపరచుటకు జనసామాన్యం ఉపయోగించే భాషలుగూడా సహకరించినవి. కాని ఈ భాషలు జనసామాన్యపు భాషలను తనవిగా చేసుకొనలేకపోయినవి జనసామాన్యపు భాషలకు రాజాశ్రయం లభించనేలేదు ఈనాడు గూడా ఉత్తరదేశంలో రాజస్థానీ, బ్రజభాష, అవధీ, భోజపురీ, మైథిలీ మొదలగునవి క్రింది భాగంలో మాలవీ, మాగధీ, ఛత్తీస్‌గఢ్ మొదలగునవీ తమ తమ ప్రదేశాలలోని జనసామాన్యంతో కలసియే ఉన్నవి

పశ్చిమ భారతము, పూర్వ భారతములోని భాషా ప్రదేశాలకూ భూగోళానికి గూడా గంభీరమైన సంబంధమున్నది గుజరాత్ మహారాష్ట్రములు పంచ ద్రావిడములలో కలసి ఉన్నా ఆ ప్రదేశాలలో అంతర్వాహినిగా ప్రవహిస్తున్న సంస్కృతితో ద్రావిడ సంస్కృతికి దగ్గటి సంబంధమున్నది అయినా ఆ భాషలు ఆర్య కులానికి చెందినవని భావింపబడుతున్నది. గుజరాతు మహారాష్ట్రములకు ఆంధ్ర దేశమునకు సన్నిహిత సంబంధమున్నదని చరిత్ర తెలియజేస్తున్నది గోదావరీ తీరంలో ప్రతిష్ఠానపురంలో స్థాపించబడిన మొదటి ఆంధ్ర సామ్రాజ్యం వర్తమాన ఆంధ్ర మహారాష్ట్రముల సంయుక్త రాజ్యమని కూడా చరిత్ర తెలియజేస్తున్నది భౌగోళికంగా ఏర్పడిన అవరోధాలు భాషాదృష్టితో తిరిగి ఈ రెండు ప్రాంతాలనూ వేరు చేసినవి పూర్వ భారతంలో ముఖ్యప్రదేశములైన అసాము, బెంగాలు, ఒరిస్సా ప్రాంతాలతో అభిన్నమైన సంబంధముండేది చరిత్ర, భూగోళము రెండూ ఈ మూడు ప్రాంతాలను ఒకదానితో ఇంకొకదానిని కలిపి ఉంచినవి మనదేశంలో బయలుదేరిన భాషాప్రయుక్త రాష్ట్రముల ఆధునిక ప్రాదేశిక భాషల ఉద్యమమునకూ దేశంలోని భౌగోళిక పరిస్థితులకూ పరస్పర సంబంధమున్నది ఇంకొక విధంగా చెప్పవలెనంటే మన దేశంలోని భాషా ప్రదేశాలను రెండు విభాగాలుగా విభజింపవచ్చును భారతరాజ్యాంగ చట్టంలో పదునాలుగుభాషలు పొందు

పరచబడి ఉన్నవి వాటిలో ఎనిమిది సాగరీయ భాషలు మూడు పార్వతీయభాషలు రెండు సార్వదేశిక భాషలు మనదేశపు పశ్చిమ సముద్రతీరంలో గుజరాతీ, మరాఠీ, కన్నడము, మళయాళము నాలుగు భాషలున్నవి పూర్వ సముద్రతీరంలో బెంగాలీ, ఒరియా, తెలుగు, తమిళ భాషలున్నవి ఆసామీ, కాశ్మీరీ, పంజాబీ మూడు పార్వతీయ భాషలు. హిందీ మధ్య దేశంలోని భాష సంస్కృతము ఉర్దూ రెండూ సార్వదేశిక భాషలు ఈ భాషలను మాట్లాడే వారి జనసంఖ్య 1951 నాటి జనాభా లెక్కలను బట్టి ఈ క్రింది విధంగా ఉన్నది

| | |
|---|---|
| **పశ్చిమ సాగరీయ భాషలు** | |
| గుజరాతీ | 1,63,10,771 |
| మరాఠీ | 2,70,49,522 |
| కన్నడము | 1,44,71,764 |
| మళయాళము | 1,33,80,109 |
| **పూర్వ సాగరీయ భాషలు** | |
| బెంగాలీ | 2,51,21,674 |
| ఒరియా | 1,31,53,909 |
| తెలుగు | 3,29,99,916 |
| తమిళము | 2,65,46,764 |
| **పార్వతీయ భాషలు** | |
| ఆసామీ | 49,88,286 |
| కాశ్మీరీ | 51,086 |
| **మధ్యదేశపు భాషలు** | |
| హిందీ (పంజాబీ ఉర్దులతో) కలిసి | 14,99,44,311 |
| **సార్వదేశిక భాష** | |
| సంస్కృతము | 555 |
| | 32,39,72,607 |
| ఆదిమజాతుల భాషలు, తదితరములు | 3,29,06,787 |
| మొత్తం | 35,68,79,394 |

భారతదేశం విభిన్న భాషాప్రాంతాలుగా విభజింపబడినపుడు ఆయా ప్రాంతాల విస్తీర్ణం, ఆయా ప్రాంతాలలో నివసించే జనసంఖ్య ఈ విధంగా ఉంటుంది

| భాషపేరు | చదరపు మైళ్ళు | జనసంఖ్య (లక్షలలో) |
|---|---|---|
| గుజరాతీ | 71,456 | 161 |
| మరాఠీ (బొంబాయిని కలుపుకొని) | 1,16,484 | 317 |
| కన్నడము | 72,730 | 190 |
| మళయాళము | 14,980 | 136 |
| బెంగాలీ | 34,590 | 265 |

| | | |
|---|---|---|
| ఒరియా | 80,140 | 146 |
| తెలుగు | 1,12,500 | 322 |
| తమిళము | 50,170 | 300 |
| హిందీ-ఉర్దూ (పంజాబీతో గూడా) | 5,41,570 | 1610 |
| అసామీ | 89,040 | 97 |
| కాశ్మీరి | 92,780 | 44 |

పైనున్న అంకెలను బట్టి చూస్తే రాష్ట్ర పునర్నిర్మాణం జరిగిన తరువాత స్థానికమైన చిన్నచిన్న భాషలకు ప్రాముఖ్యత ఉండదనీ, ప్రామాణికమైన భాషలకుమాత్రమే ప్రాముఖ్యత ఉండగలదనీ విస్పంశయంగా తెలియగలదు ప్రామాణికభాషలు ఎక్కువ అభివృద్ధిచెందగలవనీ అవి తగినంతగా అభివృద్ధిని పొందగలవని గూడా తెలియగలదు జనసామాన్యం సర్వతో ముఖంగా ఉన్నతిని పొందుటకు ఇవి మూలభూతములు కాగలవు పైనున్న అంకెలను బట్టి చూస్తే విస్తృతిలోనూ, సంఖ్యలోనూ గూడా మన దేశంలోని ఏ ప్రాంతీయ భాషా స్వయం పోషక దృష్టిలో వెనుకబడి ఉండదని స్పష్టంగా మనకు బోధపడగలదు ప్రపంచంలోని ఇతర భాషల చరిత్ర దృష్టితో చూచినా మన భాషలు సర్వ శక్తివంతములుగ కనపడగలవు యూరపులోని అనేక భాషలతో మన భాషలు శక్తిలో సరిసమానంగా తూగగలవు తరచుగా జనులు భారతదేశాన్ని రష్యాతో పోల్చి చూస్తుంటారు రష్యాలో రెండువందల భాషలు, ఉప భాషలు ఉన్నవని ప్రతీతి. వాటిలో చాలా భాషలు అవికసితాలు, అర్ధవికసితాలుగా ఉన్నవి కనుక రష్యా గూడా పదహారు భాషలను ప్రాంతీయ భాషలుగా స్వీకరించింది రష్యాలోని పద్దెనిమిది కోట్ల జనాభాలో సుమారు పదికోట్ల మంది రష్యా భాషను తమ మాతృ భాషగా అంగీకరిస్తున్నారు

తరువాత సంఖ్యలో ఉక్రేనియన్ భాష పెద్దది ఆ భాషను 365 లక్షల మంది మాట్లాడు తున్నారు. తరువాత బీలోరూమియా, ఆ భాష మాట్లాడేవారి సంఖ్య 57 లక్షలు ఉజ్‌బెక్ భాష మాట్లాడేవారి సంఖ్య 43 లక్షలు మిగతా భాషలు మాట్లాడేవారి సంఖ్య మరీ తక్కువ. అయినా రష్యా ప్రభుత్వము ఆ భాషల నన్నింటినీ అధికారికంగా అంగీకరించినది జనులు మాట్లాడే ఏ భాషకూ ప్రాముఖ్యత ఉండక తప్పదు

ఒకప్పుడు భాష ప్రయోజనం సీమితంగా ఉండేది సాహిత్య సృష్టి, దృష్టితో అది తరచు రాజుల దర్బార్లలోనో, పండితుల వివాద స్థలాలలోనో బంధింపబడి ఉండేది ప్రస్తుతం భాషలన్నీ రాజాశ్రయాన్ని వదలి జనాశ్రయాన్ని పొందినవి రాజులు పోయినారు ఆ వాతా వరణం మారిపోయింది. జనసామాన్యాన్నీ, రాజ్యాన్నీ సేవించడానికి భాషలు సాధనాలుగా ఉపయోగించబడనున్నవి ఈనాడు భాషలకు ప్రాధాన్యత హెచ్చినది భాష ఎవరిచేతిలోనో బొమ్మగానో, పండితుల బుద్ధి ప్రాగల్భ్యానికి సంబంధించిన వస్తువుగానో ఉండనేరదు జన జాగృతి కారణంగా ప్రజాతంత్రాత్మకమైన ప్రభుత్వ వ్యవస్థ ఏర్పడినందువలన భాష రాజ్య తంత్ర నిర్వహణకు ప్రబల సాధనంగా రూపొందినది ఆలోచనలు, ప్రచారవిధానాలు, విద్యా

పద్ధతులు మారినందున అది ప్రాకారాల నన్నింటినీ దాటి హద్దులు లేనిదైనది భాష ఈనాడు సామాన్యుని అవసరాలను తీర్చడంతో బాటు రాజ్య వ్యవహారాలను గూడా నడుపుటకు తగిన శక్తిని సంపాదించవలసి ఉన్నది విద్వాంసుల జిహ్వాగ్రములపై తాండవమాడి వారు చేసిన కల్పనల ద్వారా మార్గాన్ని ఏర్పర్చుకొని సామాన్య మనుష్యుని హృదయపీఠంమీద ఆసీనం కావలసి ఉన్నది ఉత్తమ కావ్యరూపంలో వెలువడి సాహిత్య మంజూషలలో భద్రపరచబడడమే భాష లక్ష్యం కాదు విశ్వమందంతటా వ్యాపించిన జ్ఞానవిజ్ఞానవారిధులనుండి అమృతాన్ని వెలువరచి ఆ అమృతాన్ని సామాన్యునికి అందించే చిన్న కాలువల రూపంలో భాషలు పని చేయవలసి ఉన్నవి వాటి వ్యాపకత్వం పెరిగినకొద్దీ వాటి పరిధులు గూడా పెంగగలవు భాష కావ్యవస్తువుగానే గాక న్యాయశాస్త్రాది సర్వవిషయములను సామాన్యునికి బోధించు సాధనముగా రూపొందవలసి ఉన్నది భౌతిక శాస్త్రమును, సాంఘిక శాస్త్రమును వ్యక్తీకరించు సాధనం గూడా అది కావాలి ప్రపంచంలోని ఏ భాషనైనా ఈనాడు మనం ప్రశంసిస్తున్నామంటే ఆధునిక యుగంలోని అవసరాల పూర్తికి అది ఏ విధంగా ఉపయోగపడుతున్నదనే విషయాన్ని ఎల్లప్పుడూ దృష్టిముందు పెట్టుకొంటున్నాము

భారతదేశంలోని భాషలన్నీ దాదాపు ప్రస్తుతం ఒకే స్థితిలో ఉన్నవి ఆధ్యాత్మిక జ్ఞాన సంపద దృష్టితో, సాహిత్య దృష్టితో మనభాషలు వికసితావస్థలో ఉన్నవి ఇరవైయ్యోశతాబ్దం లోని అవసరాలను తీర్చడానికి భాషలు సమర్థవంతంగా లేవు మనభాషలు ఎంత బలహీనంగా ఉన్నవో ప్రతిదినము ఆ విషయాన్ని మనం గుర్తిస్తూనేఉన్నాము అందుకు ప్రధానకారణం శక్తివంతమైన ఇంగ్లీషు భారతదేశంలో వ్యాప్తిలో ఉండడమే ఇంగ్లీషు ప్రభావం మనదేశం లోని ఉపాధ్యాయులు, శిక్షణ శాస్త్ర వేత్తలు మొదలగు వారందరిమీద అమితంగా హత్తుకొని ఉన్నది దానిని వదలిపెడితే ప్రమాదం సంభవిస్తుందని గూడా మనదేశంలోని పెద్దలు భావిస్తున్నారు స్వాతంత్ర్య ప్రాప్తికి ముందు మనదేశంలో ఇంగ్లీషుకు ఎంత ప్రాముఖ్యత ఉండేదో ఆ ప్రాముఖ్యత స్వాతంత్ర్యం లభించిన తరువాత గూడా తగ్గలేదు దానికి కారణమేమంటే మనదేశానికి స్వాతంత్ర్యాన్ని ప్రసాదింపజేసిన నాయకులు ఇంగ్లీషునే సేవాసాధనంగా స్వీకరించిఉన్నారు. ఈనాడు భారతదేశంలోని 31 విశ్వవిద్యాలయాలలో విద్యా మాధ్యమం ఇంగ్లీషు పరీక్షా మాధ్యమంగూడా ఇంగ్లీషే న్యాయపాలనకు, రాజ్యవ్యవహార నిర్వహణకు మాధ్యమం ఇంగ్లీషే ప్రభుత్వ కచ్చేరీలనుండి వార్తాపత్రికా కార్యాలయాల వరకు ఇంగ్లీషు ప్రముఖ స్థానాన్ని వహించి ఉన్నది. మనదేశ వ్యాపారం ఇంగ్లీషు లేనిది నడిచేటట్లు లేదు. జిల్లా బోర్డ్లలోనూ, శాసనసభలలోనూ, పార్లమెంటులోనూ ఇంగ్లీషుదే పైచెయ్యి ఈ ఇంగ్లీషు ప్రాధాన్యతను - ప్రభుత్వాన్ని - నిలబెట్టేవారు ఎంతమంది? వారు అసంఖ్యాకంగా ఉన్నారని కొంతమంది భ్రమ ఇంగ్లీషు తెలిసినవారు 38 లక్షలని చెప్పితే మీరు ఆశ్చర్యపడతారు ఈ ఉత్తీర్ణులు 38 లక్షలైనా ఎటువంటివారో తెలుసునా? యస్ యస్ యల్ సి లేక దానితో సమానమైన జ్ఞానమో కలవారే;; 36 కోట్ల జనాభాలో 38 లక్షలంటే 1 6% అన్నమాట భారతదేశంలో చదువుకొన్నవారి సంఖ్య ఆరుకోట్లు ఈ విచిత్ర పరిస్థితి చాలా రోజులవరకు ఉండడానికి అవకాశమున్నదా? అదిగూడా ఎలాంటి సమయంలో? ప్రణాళికలమీద ప్రణా

శికలను మనం తయారు చేస్తున్నాము దేశంలో అక్షరాస్యుల సంఖ్య రోజురోజుకు పెరిగి పోతున్నది రాజ్యాంగ విధానంలో 14 సంవత్సరాల లోపు వయస్సు గలిగిన పిల్లలందరికీ ఉచితంగా విద్య నేర్పబడుతుందని నిర్ణయించబడి ఉన్నది దేశంలోని నవయువకులందరికీ ఇంగ్లీషు మాధ్యమంలో చదువు నేర్పించడం సంభవమేనా? ఇంగ్లీషుద్వారా విద్యను నేర్పించి మనం మనదేశంలోని వారినందరినీ శిక్షితులం చేయగలమా? ఇంగ్లీషు నేర్చుకొన్న వారి చేతుల్లోనే రాజ్య వ్యవహారమంతా వదలడం ఉచితమేనా? భారతీయ భాషలు ఈనాటి అవస రాలను తీర్చలేవని అంగీకరిద్దామా? అంతర్రాష్ట్రీయ వ్యవహార నిర్వహణకు, భౌతికశాస్త్ర పరిచయ ప్రాప్తికి ఇంగ్లీషును ఎదలడం ప్రమాదకరమా? ఇంగ్లీషు కారణంగా మనకు లభిం చిన నేతృత్వం ఇంగ్లీషును వదలిపెడితే మనకు లభించకుండా పోతుందా? ఇంగ్లీషు వలన ముద్రాలేఖనము, విద్యుల్లేఖనము, శీఘ్రలేఖనము లాంటివి ఎన్నో వసతులు లభించినవి. ఇంగ్లీషును వదలిపెడితే అవి అన్నీ అదృశ్యమయిపోవా? ఈ ప్రశ్నలకు లభించే జవాబుల మీదనే భారతీయ భాషల భవిష్యత్తు ఆధారపడి ఉన్నది

అందరికంటె ముందు మహాత్మాగాంధీజీ ఈ భాషా సమస్యపై తమ అభిప్రాయాన్ని వెలువరించారు. 1909 సంవత్సరంలో హింద్ స్వరాజ్య అనే పుస్తకంలో ప్రశ్నోత్తరాల రూపంలో గాంధీజీ ఈ విధంగా వ్రాశారు

ప్రశ్న మనదేశ నివాసులకు ఎటువంటి విద్యను నేర్పించాలి?

జవా మన దేశభాషలను అభివృద్ధిపరచడం అవసరము తమ భాషలో ఏ ఏ విషయా లను నేర్పవలెననే చర్చకు అవసరమే లేదు ఇంగ్లీషులో లభించే విలువగల విషయాల నన్నింటినీ దేశభాషలలోనికి అనువదింపచేయాలి వేరు వేరు విజ్ఞానాలను అధ్యయనం చేయ వలెననెడి మిషను మనం వదలివేయాలి ముందు మనం నైతిక శిక్షణను, ధార్మిక శిక్షణను పొందాలి నాగరికత గలిగిన ప్రతి భారతీయుడు తన ప్రాంతీయ భాషతోబాటు—హిందువైతే సంస్కృతాన్ని, మహమ్మదీయుడైతే అరబ్బీని, ఈరానీ అయితే పార్సీని తప్పక అభ్యసిం చాలి కాని హిందీని అందరూ తప్పక నేర్చుకోవాలి కొంతమంది హిందువులు అరబ్బీ, పార్సీని, కొంతమంది మహమ్మదీయులు పార్సీ సంస్కృతాలనూ తప్పక నేర్చుకోవాలి ఉత్తర పశ్చిమ భారతదేశాలలో ఉండేవారు ఎక్కువగా తమిళాన్ని నేర్చుకొనడం అవసరం. హిందూదేశపు సామాన్యభాష హిందీ కాగలదు హిందూ ముస్లిమ్ ఐక్యతకొరకు రెండు లిపులను—ఉర్దూ నాగరీ లిపులను—నేర్చుకోడం గూడా అవసరమే మనం ఈ మాత్రం చేస్తే ఇంగ్లీషు హిందూదేశంలో నుండి తొందరగా వెళ్లిపోగలదు ఇంగ్లీషు భాషా దాసులు ఈ పనిని తప్పక చేయాలి ఎందువల్లనంటే వారు తమ దాస్యం ద్వారా దేశాన్నంతా గూడా దాస్యంలో పడవేశారు మనం విముక్తులమైతే దేశం గూడా విముక్తమవుతుంది

మహాత్మాజీ ఈ వాక్యాలను వ్రాసి ఇప్పటికి 47 సంవత్సరాలు అయిపోయింది. ఆయన వ్రాసి అంతటితో సంతృప్తిపడి ఊరుకుండేవారా? ఇది వ్రాసిన తరువాత తొమ్మిది సంవత్సరాలకు ఇందోర్ సాహిత్యసమ్మేళనానికి అధ్యక్షతవహించే అవకాశం వారికి లభించింది ఆయన హిందీభాష స్వరూపాన్ని గురించి చేసిన స్పష్టీకరణ ఈ క్రింది విధంగా ఉన్నది

"ఉత్తర దేశంలోని హిందువులు, మహమ్మదీయులు మాట్లాడేదీ, నాగరీ ఫార్సీ రెండు లిపులలో వ్రాయబడేదీ హిందీ అని నేను చెప్పుతూ వస్తున్నాను హిందీ సంస్కృత శబ్దమయం గానీ ఫార్సీ శబ్దమయంగానీ కాకూడదు సామాన్యులు మాట్లాడే హిందీలో గల తీపి లఖనవీ ముసల్మానుల ఉర్దూలో గానీ, ప్రయాగ పండితుల హిందీలో గానీ లభించదు. తేలికగా జనసామాన్యం అర్థం చేసుకొనగలిగేదీ, మాట్లాడగలిగేదీ మాత్రమే మంచి భాష కాగలదు అట్టి హిందీని అందరూ తెలుసుకొనగలుగుదురు ఇటువంటి హిందీ అనే ఊటబావి జనతా హిమాలయంలో ఉన్నది హిమాలయంలో నుండి బయలుదేరెడి గంగా ప్రవాహం ఎప్పుడూ ఆగిపోదు జన సామాన్యంలో నుండి బయలుదేరెడి హిందీ గూడా అంతే రాతిలోనుండి వెలువడే సెలయేటి ప్రవాహంవలె సంస్కృత ఫార్సీమయమైన హిందీ తొందరలోనే ఎండిపోతుంది"

మహాత్మాగాంధీజీ 1918 లో చెప్పిన వాక్యాలే ఈనాటికీ దేశానికి లాభదాయకంగా కనపడుతున్నవి ఆయన 1918 లోనే వింధ్యకు ఉత్తరభాగంలోనున్న హిందీని దక్షిణాపథానికి తీసుకొనివచ్చారు 1918 లో మొట్టమొదటిసారిగా హిందీ ప్రచారకార్యం మద్రాసులో ప్రారంభమైనది తరువాత హిందీ ప్రచారం ఏవిధంగా అభివృద్ధినొందిందో దాదాపు అందరికీ తెలుసును

హిందీ ప్రచార కార్యం భారతీయ భాషల పునరుత్థానానికి చిహ్నము ఇంగ్లీషు మన దేశంలో అంతర్ ప్రాంతీయ భాషగా ఉండడం తద్వారా దేశైక్యతను సాధించడానికి ప్రయత్నం జరగడం జరిగింది ఆ ఇంగ్లీషు భాషను తొలగించడానికి ప్రయత్నం జరుగుతున్నది ఇంగ్లీషు తొలగిపోతేనే గాని భారతీయభాషల వికాసానికి అవకాశంలేదు. ప్రాంతీయ భాషలపైన ఉన్న ఇంగ్లీషు భారాన్ని తీసివేయడానికి సాధనంగా ఉపయోగించగలిగిన అఖిల భారతీయభాష మనకవసరం అందుకే మనం హిందీని స్వీకరించాము హిందీ భారతదేశంలోని 14 ప్రాంతీయ భాషలలో ఒకటి అందుతో బాటు సార్వదేశిక భాషగూడా హిందీ ప్రచారోద్యమంలో నాలుగు దశలు గడచినవి ప్రారంభమైనప్పుడు అది రాష్ట్రభాషా ఉద్యమం రాష్ట్ర భాషా శబ్దాన్ని నిర్వచించవలసి వచ్చినప్పుడు మహాత్మాజీ హిందూస్తానీ అని దానికి నామకరణం చేశారు 1918 నుండి 1941 వరకు రాష్ట్రభాషా ఉద్యమమనే పేరుతో పని జరుగుతూఉండేది 1941 నుండి 1950 వరకు హిందుస్తానీ అనే పేరుతో భాషా ప్రచారం జరిగింది దేశం స్వతంత్రమైన తరువాత సంవిధానసభ ఏర్పడి ఒక సంవిధానం ఏర్పడింది ఆ సభలో భారతీయ భాషలకు సంబంధించి వివరంగా చర్చలు జరిగినవి ఆ చర్చల ఫలితంగా 343 నుండి 351 వరకు సూత్రాలు ఏర్పడ్డవి 351 సూత్రము

"హిందీ భాష యొక్క విస్తృతిని పెంపొందించుటయు, ఇండియా యొక్క మిశ్రిత సంస్కృతికి చెందిన అన్ని అంశములకు భావప్రకటనాసాధనముగ ఉపకరించునట్లు దానిని అభివృద్ధిచేయుటయు, మరియు దాని ఆత్మీయతకు భంగము కలుగకుండ హిందుస్తానీలోను ఎనిమిదవ అనుసూచియందు నిర్దిష్టమైయుండు ఇండియాలోని ఇతరభాషలలోను ప్రయోగింపబడు రూపములను, శైలిని, పదికారములను స్వీకరించియు మరియు అవసరమైనప్పుడు

లేక వాంఛనీయమైనప్పుడు దాని పదజాలమునకుగాను ప్రధానముగ సంస్కృతమునుండియు ఆపైన ఇతరభాషలనుండియు పదములను సేకరించియు దాని వికాసమును చేకూర్చుటయును సంఘము యొక్క కర్తవ్యమై యుండవలెను "

ఈ అనుచ్ఛేదం వలన స్పష్టంగా తెలుస్తున్న దేమంటే హిందీ ఒక ప్రాంతీయభాషకాదు. ఆ భాషను పెంపొందించే బాధ్యత ఏ ఒక్కప్రాంతం మీద పెట్టబడలేదు హిందీని అభివృద్ధి పరచే పూర్తి బాధ్యత యూనియన్ ప్రభుత్వానికి అప్పగించబడింది భారతదేశంలోని సామాజిక (సమ్మిశ్రిత) సంస్కృతి భాషద్వారా వ్యక్తంకావలెనని గూడా నిర్ణయించబడ్డది. అట్టి భాషాస్వరూపాన్ని రూపొందించుటకు అవసరమైన శబ్దసంపదను పెంపొందించడంలో హిందుస్తానీ మరియు 8 వ అనుసూచీలో ఉల్లేఖింపబడిన 14 భాషలు సహకరించగలవు. అవసరాన్ని బట్టి ముఖ్యంగా సంస్కృతం నుండి గౌణంగా ఇతర భాషలలో నుండి హిందీ శబ్దాలను స్వీకరిస్తుంది ఇంత స్పష్టంగా నిర్వచనం జరిగినతరువాత ఇది ఏదో ఒక ప్రాంతం వారి భాష అనిగానీ, ఒక సమాజంవారి సంపద అని గానీ అనుకొనుటకు ఏమాత్రమూ అవకాశంలేదు భారత రాజ్యాంగచట్టము ననుసరించి హిందీ యావత్తు దేశానికి సంబంధించిన భాష ఒకప్పుడు సంస్కృతానికి ఆ స్థానముండేది.

రాష్ట్రభాషా ఉద్యమం ద్వారా మనం జాతీయతాభావాన్ని వ్యాప్తిలోనికి తేవడానికి ప్రయత్నించాము హిందుస్తానీ ఉద్యమం ద్వారా హిందూ మహమ్మదీయ ఐక్యతకు కృషి చేశాము హిందీ ద్వారా భారతీయ భాషల పునరుత్థానానికి, సమన్వయానికి, పరస్పర సహకారానికి కృషిచేయాలి మన ఉద్యమానికి సంబంధించిన ఈ మూడు రూపాలూ ఒకదాని కింకొకటి వ్యతిరేకమైనవి కావు ఇవి పరస్పర సహాయకములు హిందీ ఉద్యమం ద్వారా ఇంకొక కొత్తరూపములో దేశం ముందుకు వస్తున్నది అది రాజభాషాస్వరూపము, ఇంగ్లీషుకున్న ఆధిపత్యాన్ని తొలగించుటానికి ఈ మన ఉద్యమం చతుర్ముఖాల నాలుగుదిక్కులలో వ్యాపిస్తుంది ఈ నాలుగు దశలలో ఏ దశను వదలివేసినా, ఏ ఒక్కదశకు ప్రాముఖ్యత నిచ్చినా ఆ ఉద్యమము యొక్క సమగ్రస్వరూపం వ్యక్తంకానేరదు భారతీయ భాషల పునరుద్ధరణకు కృషి చేస్తున్న హిందీ ఉద్యమానికి ఇద్దరు ప్రబల శత్రువులున్నారు వెంటనే ఇంగ్లీషును తొలగించి వేసి ఆ స్థానంలో వెంటనే హిందీని కూర్చోబెట్టుమనే వారొకరు వారు ఏకచ్ఛత్రాధిపత్యాన్ని కోరేవారిలోనే జమ ఇంగ్లీషుభాష మనదేశంలో ఉన్నంతమాత్రం చేతనే మనలో జాతీయత నశించిపోతున్నదని వీరు భావిస్తున్నారు జబర్దస్తీగా—అస్వాభావికంగా—ఇంగ్లీషు స్థానాన్ని హిందీకి అప్పగించవలెనని వారు ఉద్దేశపడుతున్నారు. దేశంలో ఉండేవారందరూ ఏకగ్రీవంగా అంగీకరించి తమ సర్వశక్తులనూ వినియోగిస్తేనే గాని ఏ పని అయినా జాతీయతా రూపాన్ని ధరించదనే విషయాన్ని వారు మరచిపోతున్నారు పరిస్థితులు అనుకూలంగా లేనిది-పక్వంగానిది- ఏపనీ సఫలంకాదు ఈ విషయాన్ని వారు మరచిపోతున్నారు సగం పండిన పండు బాగా పండిన పండువలె రుచికరంగా ఉండనేరదు. ఈ సత్యాన్ని గూడా తొందరతనం వల్ల వారు గ్రహించలేకపోతున్నారు వాద వివాదములు, అధికార దుర్వినియోగము, సంఖ్యాబలము మొదలగువాని మీద ఆధారపడడం వలన దేశానికి ఎంత అపకారం జరుగుతున్నదో,

ఎన్ని పనులు పాడైపోతున్నవో తెలుసుకొనుటకు ప్రపంచంలో ఎన్నో ఉదాహరణ లున్నవి పరిస్థితులను గమనించి వ్యవహరించడంలోనే మేలున్నది హిందీ విరోధులలో రెండవ వర్గం వారు తమిళ దేశంలో ఎక్కువగా ఉన్నారు హిందీకి ఏమాత్రం స్థానం కల్పించినా ప్రాంతీయ భాషలు నష్టపడిపోతవని వారు వాదిస్తున్నారు ఉత్తరదేశపు సంస్కృతి వేరు, దక్షిణదేశపు సంస్కృతి వేరని వారు అంటున్నారు ఉత్తరదేశంతో ఎటువంటి సంబంధమూ పనికిరాదని వారి అభిప్రాయము అదృష్టవశం వలన వారి సంఖ్య తక్కువగానే ఉన్నది అయినా ఈ వ్యతిరేకత తగ్గడంలేదు రోజురోజుకు హెచ్చుతున్నది రాజకీయంగా గానీ, చారిత్రకంగాగానీ చూస్తే ఉత్తరదేశం దక్షిణదేశంమీద ఏనాడూ రాజ్యం చేయలేదు దక్షిణ భారతదేశ చరిత్రను పరిశీలించి చూస్తే దక్షిణదేశం ముఖ్యంగా తమిళప్రాంతం బ్రిటిషువారు వచ్చేవరకు స్వతంత్రం గానే ఉన్నది మరి వారు ఏ ఆధారాన్ని పురస్కరించుకొని ఉత్తరదేశం దక్షిణదేశం మీద ఆధిపత్యం చలాయిస్తుందని భయపడుతున్నారో తెలియడంలేదు

హిందీ వ్యతిరేకోద్యమం ఆంధ్ర, కేరళ, కర్ణాటక ప్రాంతాలలో లేదు. దక్షిణ భారత దేశమంతా ఒక్కటిఅని భావిస్తే తమిళదేశం దానిలో ఐదవభాగం దక్షిణదేశంలో తమిళ భూభాగం 20 వ వంతు ఉన్నది తమిళం మాట్లాడేవారి సంఖ్య 25 వంతులు అట్టి స్థితిలో ఉత్తరదేశం తమిళప్రదేశానికి పొరుగు ఆంధ్ర కేరళ కర్ణాటకప్రాంతాల సహాయంలేకుండా తమిళ ప్రాంతాన్ని అణచివేయగలదా ? ఉత్తరదేశస్థులంటే హిందీమాట్లాడేవారే అయితే భారతదేశంలో వారి సంఖ్య 40 వంతులే గదా। తమిళప్రాంతంవారికి తమ మాతృభాషఅంటే ఎంత ప్రేమఉన్నదో మిగతావారికి అంత ప్రేమలేదా ? నిజంగా తమిళానికి ప్రమాదమే జరిగితే మిగతా ప్రాంతాలవారు సహాయం చేయరా ? కనుక ఈ సందేహానికి కారణమేమీ కనపడడంలేదు హిందీ వ్యతిరేకత అనవసరమైనది ఈ వ్యతిరేకతను పోగొట్టడానికి ఉదారనీతిని అవలంబించడం అవసరం నిజానికి ఈనాడు తమిళదేశంలో ప్రజలు ఎంత ఉత్సాహంగా హిందీని నేర్చుకొంటున్నారో చూస్తే తమిళనాడులోని వ్యతిరేకోద్యమము హిందీ ఉన్నతికి బాధాకరంగాదని స్పష్టపడగలదు భారతీయ భాషల కన్నింటికీ రాజ్యాంగచట్టం పూర్తిరక్షణను కల్పించిఉన్నది తమ తమభాషలను అభివృద్ధిచేసుకొనుటకు అన్ని ప్రాంతాలకూ సంపూర్ణమైన అధికారం లభించిఉన్నది ప్రాంతీయ భాషలు అభివృద్ధిపొందడానికి ఇదివరకటి కంటే ప్రస్తుతం వసతులు ఎక్కువ ఏర్పడనున్నవి గనుక భయపడవలసిన అవసరమేమీలేదు భాషలన్నీ స్వయం పూర్ణములు, స్వయంపోషకములు కాకతప్పదు

భాషాప్రయుక్త రాష్ట్ర విభజన జరిగి స్వయంపూర్ణములైన ప్రాంతీయభాషలు ఏర్పడు తున్న ఈ రోజుల్లో ప్రాంతీయ భాషలను ప్రోత్సహించడం వలన దేశైక్యతకు భంగం వాటి ల్లదా అని కొంతమందికి సందేహం కలగడం సంభవమే భాషల నాధారంగా గ్రహించడం వలన మనదేశం యూరపువలె ముక్కలుముక్కలైపోదా ? ఇంగ్లీషు వలన ఏర్పడిన ఐక్య తను మనం ఛిన్నాభిన్నం చేయబోవడం లేదా ? భారత రాజ్యాంగ చట్టంలో ప్రాంతాల కివ్వ బడిన స్వాతంత్ర్యాన్ని గమనిస్తే దానిలో దేశైక్యతకు భంగకరమైన బీజాలు దాగిలేవా ? ప్రస్తుతమున్న నాయకత్వం దేశైక్యతను సాధించగలిగినా తరువాత వచ్చేవారు దేశాన్ని

ముక్కలుముక్కలు చేసివేయరా ? ఈ ప్రశ్నలకు జవాబు యివ్వవలసిన బాధ్యత మన ముందుతరాల వారిమీద ఉన్నది మనదేశంలో మనం అనుసరించే విద్యావిధానం మీదగూడా ఈ ప్రశ్నలకు జవాబు ఆధారపడి ఉన్నది

ఇంగ్లీషు విద్యావిధానం వలన మనకు కలిగిన నష్టాలను - దుష్పరిణామాలను - మనం గుర్తించియే ఉన్నాము మాతృభాష లేక ప్రాంతీయ భాషలనే పాఠశాలల్లో మాధ్యమంగా స్వీకరించవలెనని ఏభై సంవత్సరాలుగా చెప్పుతూ అంటూ వస్తున్నాము ప్రస్తుతం భారత దేశంలో పనిచేస్తున్న 31 విశ్వవిద్యాలయాలలో ఏ విశ్వవిద్యాలయమూ ఇంగ్లీషును వదలివేయ లేదు దాదాపు అన్ని విశ్వవిద్యాలయాలలోనూ ఇంగ్లీషే మాధ్యమంగా అమలులో ఉన్నది. విశ్వవిద్యాలయాలు కొన్ని విషయాలలో మాత్రం మాధ్యమం మార్చడానికి ప్రయత్నిస్తున్నవి. కొన్నివిశ్వవిద్యాలయాలు కనీసం సాంఘిక శాస్త్రాలకు సంబంధించినంతవరకైనా ప్రాంతీయ భాషలలో శిక్షణ నివ్వించగలవని విశ్వసిద్దాము విశ్వవిద్యాలయాలు తమతమ ప్రాంతీయభాషల వికాసానికి తోడ్పడగలవని ఆశిద్దాము అట్టి స్థితిలో హిందీకి లభించవలసిన స్థానమేది ? ఇంగ్లీషుకుండే స్థానమేది ? రాజభాష కావడంవల్లనే భారత దేశంలో ఇంగ్లీషు ప్రాధాన్యాన్ని వహించిన దనడం సర్వ విదితమే ఇకముందు సంఘశాసనంలో హిందీకి, ప్రాంతాలలో ప్రాంతీయ భాషలకు రాజభాష స్థానం లభించగలదు దానినిబట్టి మన విద్యావిధానం గూడా మారగలదు విశ్వవిద్యాలయాలు ప్రాదేశిక భాషలను మాధ్యమంగా స్వీకరించక తప్పదు ప్రాంతీయ భాషలకు ప్రాముఖ్యత ఏర్పడక తప్పదు అహిందీ ప్రాంతాలలోని విద్యావిధానంలో అప్పుడు హిందీకి ఉండే స్థానమేమిటి ? సమయమే ఆ సమస్యను పరిష్కరించ గలదు ఉదారంగానూ ఉత్సాహంగానూ ఆలోచించే పెద్దల సహకారం హిందీకి లభిస్తే అహిందీ ప్రాంతాలలో హిందీ మహావిద్యాలయాలు కొన్ని ఏర్పడగలవు కనుక భాషాగత వైషమ్యాలకు స్థానముండదు కొంతమంది విశ్వవిద్యాలయాలలో మాధ్యమం హిందీ స్వీక రించబడవలెనని అంటున్నారు

ఒక మంచి ఉద్దేశ్యంతోనే వారు ఆ విధంగా అంటున్నారు హిందూస్థానంలో రాజకీయంగా ఐక్యత, సాంస్కృతిక సమన్వయభావన వృద్ధిపొందుతున్నది కాని నా ఉద్దేశ్యంలో ఈ విధానం దూరదృష్టి కలది కాదు దానిలో ప్రమాదం గూడా లేకపోలేదు మన శాసన సభలలో ప్రాంతీయ భాషలు ఉపయోగింపబడుతున్నవి ఏక భాషా ప్రాంతాలలో 90 వంతులు ప్రాంతీయభాషలలోనూ, పదివంతులు ఇంగ్లీషులోనూ ఉపన్యాసాలుజరుగుతున్నవి ప్రజాతంత్ర విధానంలో న్యాయపాలన, కార్యనిర్వహణ, శాసన నిర్మాణాదుల భాష వేరూ, శిక్షాచార్యుల, నాయకుల భాష వేరూ కానేరదు నాయకులను, శిక్షాచార్యులను తయారుచేసే విశ్వవిద్యాలయాల భాష ఏదో రెండవ భాష కావడం అస్వాభావికము ప్రపంచంలోని నలు మూలలనుండి జ్ఞానామృతాన్ని తెచ్చి పంచిపెట్టడానికి తగిన ఏర్పాట్లను విశ్వవిద్యాలయాలు చేయవచ్చును

రాజ్యాంగ విధానంలోని 351 వ సూత్రాన్ని అనుసరించి హిందీ ప్రచారాన్ని చేసే బాధ్యత హిందీని అభివృద్ధిపరచే భాధ్యత సంఘ ప్రభుత్వానికి అప్పగించబడినది ఆ పనిని విద్యాశాఖ ద్వారా సంఘ ప్రభుత్వం నడుపుతున్నది ఇంతవరకు జరిగిన పనిని బట్టి చూస్తే

1965 లో ఇంగ్లీషును వదలి హిందీని ప్రభుత్వ వ్యవహారాలలో మనం అమలులోనికి తేగలమని తోచడంలేదు. అందుకు ఇంకా తీవ్రంగా పని జరుగవలసి ఉన్నది. లక్షల ప్రజలకు హిందీని నేర్పినంతమాత్రం చేతనే ప్రచారకార్యం పూర్తి కాదు హిందీని నేర్పుతూ ప్రజా హృదయాన్ని అందుకు అనుకూలం చేయాలి. ప్రజలలో హిందీ ఆవసరాన్ని గురించి ఎక్కువగా ప్రచారం చేయాలి ఈ పనిని ప్రభుత్వేతర సంస్థలే బాగా చేయగలవు సంస్థల ద్వారా ఏ విధంగా పని చేయించవలెననేది నిర్ణయించడమే ఈ సమ్మేళనము పని

దక్షిణభారత హిందీ ప్రచారసభ గడచిన 38 సంవత్సరాలనుండి చేసిన పనిని దాదాపు దేశంలో ఉండే నాయకులంతా కొనియాడి ఉన్నారు ఈ సంస్థ మహాత్మాజీచే స్థాపించబడిన పురాతన సంస్థ ఈ సంస్థ సంఘటన దృష్టిలో విశాలమై, అనుభవం దృష్టిలో పరిపక్వమై అంతర్ ప్రాంతీయ స్వరూపంకలది కావడం వలన సంఘప్రభుత్వంచేత అంగీకరింపబడిఉన్నది

సోదరులారా ! నేను సంక్షేపంగా ఈ మహత్కార్యం వెనుకనున్న సిద్ధాంతములనూ, వస్తుస్థితినీ, ఇందుకు సంబంధించిన సమస్యలను తెలియజేయడానికి ప్రయత్నం చేశాను దక్షిణదేశంలోని పలువురు పండితులు ఈ సమ్మేళనంలో పాల్గొని ఉన్నారు రాష్ట్రపతి రాజేంద్రబాబుగారు స్వయంగా ఈ సమ్మేళనాన్ని ప్రారంభించారు నేను రాష్ట్రపతికి, ఆహ్వాన సంఘం వారికి, ప్రతినిధులకు హృదయపూర్వకమైన ధన్యవాదములను సమర్పిస్తున్నాను



*గేయం :*

# పాడుకో

శ్రీ పల్లా దుర్గయ్య

పాడుకో గొంతెత్తి
పాడుకో ఓ కవీ
భావాలు పొంగేటి
మనసులోపలి పాట॥

కంటిపాపల వోలె
కదలేటి భావాలు
మెరుపు తీగెలవోలె
మెరిసేటి భావాలు ,
భావాలు పొంగేటి
మనసులోపలి పాట॥
పాడుకో॥

కదలికకు కుదురైన
ఎదలోన నుదయించి
కదల మెదలగలేని
పదములకు పదువిచ్చి,
ఎదలోని గదిత్రోవ
మెదడునిచ్చెన నెక్కి
గిదగిదన పరుగెత్తి
గిలిగింత లిడియేటి
భావాలు పొంగేటి
మనసులోపలి పాట॥
పాడుకో॥

ముద్దుబిడ్డను గుండె
కద్దుకొని ముద్దులిడి
మురిసిపోయే తల్లి
మురిపెంపు భావాలు,
చంటిపాపను పయట
సందులో దాచుకొని
పాలుకుడిపే తల్లి
మనసులో పరువులిడు
భావాలు పొంగేటి
మనసులోపలి పాట॥
పాడుకో॥

తల్లి ఒడిలోన కను
దమ్మలను ముకుళించి
కలికి నిద్దురలోన
కమ్మగా నవ్వేటి,
బాలబుగ్గలమీద
పరవళ్ల త్రొక్కేటి
పాలవాసన గుప్పు
బాలభావాలు,
భావాలు పొంగేటి
మనసులోపలి పాట॥
పాడుకో॥

పొటమరించిన వయసు
పొడుచుకొని పొంగార
చిటుకుపొటుకులు నడక
చిన్నెలయ చెలువార,
ఓరచూపులలోన
దోరనవ్వులలోన
కోరకించే మధుర
గోష్టినీ భావాలు
భావాలు పొంగేటి
మనసులోపలి పాట॥
పాడుకో॥

*ప్రణయ కావ్యరథ్య 1.*

# కృష్ణశాస్త్రి

*— శ్రీ సంపత్కుమార*

> ప్రణయ కావ్యరథ్య అను శీర్షికతో శ్రీ సంపత్కుమార్ 1. కృష్ణశాస్త్రి, 2. రాయప్రోలు, 3 నాయని, 4 వేదుల, 5 విశ్వనాథలను గురించి ఐదు వ్యాసాలు వ్రాశారు. స్రవంతిలో మిగతా వ్యాసాలు గూడా వరుసగా ప్రకటించబడ గలవు
>
> *— సంపాదకులు*

ఆత్మాశ్రయ కవిత స్తోత్రాదులలోదప్ప మరి కనుపించదు కావ్యరచనా సందర్భంలో పూర్వకవులు ఆలంబన విభావాన్ని కొత్తదాన్ని కల్పించి తద్వారా ఆత్మ భావాలను బాహిరింపించటం చేస్తూండేవారు కులపతి కాళిదాసు 'మేఘసందేశం' లో ఈ విధంగానే చేసినాడని అభిజ్ఞోక్తి ఆత్మాశ్రయ-ఆత్మ నాయకాశ్రయ-కవితలో రసభంగం ఆలంకారికులచే ఊహించబడుచుండెడిది తత్కారణంగా ఆత్మాశ్రయకవిత కాస్కారం లేకుండా పోయింది కాని-నేరుగా జీవన ప్రతిబింబం అన్యాశ్రయ కవితలో మనం సామాన్యంగా చూడలేమనటానికి కారణం ఇల్లా ఊహిస్తాను అంతరాపతన్నిర్దిష్టపాత్రౌచిత్యాది ప్రత్యేక విషయాలు 'నేరుగా జీవన ప్రతిబింబా' నికి అడ్డమవుతున్నాయని ప్రత్యేక పాత్ర లేకుండా ఆత్మానుభవవ్యక్తీకరణమే ఆత్మాశ్రయంలో ఉండటం కారణంగా నేరుగా జీవనం ప్రతిబింబిస్తుంది దీనిలో రసభంగాన్ని తర్కించటం కూడా అంత సమంజసంగా కనుపించదు విభావానుభావాలతో రసం వ్యంజకమవుతుంది ఆలంబనవిభావం తాను ప్రేయసి అయినంతలో రసభంగం కానక్కరలేదు ఉద్దీపక విభావాలూ, సంచారి వ్యభిచారి భావాలు సరిగ్గా అమరితే రసం వ్యంజింపనేబడుతుంది ఈదృశమైన ఆత్మాశ్రయ కవితలో ఒక మార్గమునకు నేత వంటివాడు దేవులపల్లి కృష్ణశాస్త్రి

జీవితమున సుఖమున్నది 'సుఖము కూడా ఉన్నది' 'కూడా' అనే పదంతో విషాదం వివక్షితమౌతోంది ప్రతి జీవి ఒక వేదనాపరిధిలో జీవితాన్ని గడుపుతుంది తద్వేదనా విహీనమైతే బ్రతుకు లేనట్లు తద్వేదన తత్తజ్జీవులందు బహుధావిధాలుగా భాసిస్తుంది తథా భాసిత వేదనను ఎప్పుడునూ బాహిరించ టానికే ప్రయత్నిస్తాడు. కవి కవితను తత్కృతికి సాధనంగా సంగ్రహించటం జరుగుతుంది ఆ సాధనంతో తన వేదన ఇతరులయందు ప్రతిఫలింప జేస్తాడు అంటే-తనతో సామీచీన్యం గల ఇతర జీవుల వేదనను తానుగా బాహిరిస్తాడన్న మాట అది సర్వులదిగా పరిణమిస్తుంది అందుకే కృష్ణశాస్త్రి "నా హృదయ మందు విశ్వవీణారవమ్ము ఘోరుఘోరున నీనాడు మ్రోతవెట్టు" అన్నాడు

కృష్ణశాస్త్రి తన భావాన్ని వ్యక్తీకరించటంలో త్రొక్కిన రథ్యలు బహుధా ప్రవృత్తాలు భావస్ఫూర్తికి నైకవిధ పదవాక్యాలంకారాదులను నూత్న విధాలుగా ప్రయుక్తాలు చేసినాడు ఏ ఖండిక కూడా భావాన్ని పిండు తుంది ఈ శక్తి ఆయన అక్షర విన్యాసంలో-వాక్యనిర్మాణంలో-అలంకార ప్రయోగాల్లో ఉంది తానెంచికొన్న వృత్తము (పద్యవిశేషము) గీతము. దానిలో అంతా ఉన్నది గీతం అంటే— గానం చేయబడింది అని తన వేద నను—లేదా— రోదనను గానంగా మార్చి విశ్వానికి అప్పనబెట్టినాడు విన్న జీవు లేడ్చినవి ఏడ్పులలోని మాధుర్యాన్ని సంగ్రహించినవి మననం చేసినవి మురల ప్రవృత్తాలుగా చేసినవి కాని అవి కృష్ణశాస్త్రి ఏడ్పులవలె అంతమనోజ్ఞ మయినవీ— మనోదఘ్నమయినవీ కాలేకపోయినవి

తెనుగులో గీత మొక విచిత్రమైన పద్యవిశేషం ఏ రసానికీ ఇది ఒదుగు తుంది రౌద్రానికి శార్దూల స్రగ్ధరాదులే కావాలనీ - సుకుమార భావాలకు ఉత్పల చంపకాదులే కావాలనీ అనటం అక్కరలేదు గీతం అన్నిటినీ తీరు పోకుండానడిపించగల శక్తికలదిగా సారస్వతంలో ఎన్నోఉదాహరణలు కుప్పలు తిప్పలుగా ఉన్నాయి లోని భావాలను -వేదనలను వెలిబుచ్చటానికి గీతం కన్న మరో అనువైనది దొరకటం దుర్లభం అనటం సాహసం కాబోదు కృష్ణశాస్త్రి గీతాన్ని గ్రహించినాడు.

సిద్ధహస్తుడైన కవి చేతిలో వృత్తం ఎన్ని ఒదుగులు పోగలదో అన్ని ఒదుగులు పోతుంది. వివక్షితాన్ని అనుసరించి వివిధ చమత్కారాల రూపాలను ధరిస్తుంది అనవుత్తుడు వృత్తం కొలుకుగా భావాన్ని మార్చుకోవటంలో సం

కోచం పొందవడని అభిజన ఎచస్సు సమర్థుని భావానికి వృత్తం ఒదుగవలెను ఒదుగుతుంది కూడా కృష్ణశాస్త్రి గీతానికి బహు విచిత్రగమనాలను నేర్పినాడు

'ఓ నిశాంతవియోగినీ! ఓ నిశీధి
నీ! ఘోరప్రణయశాలినీ! క్షమింపు'

ఇది గీతంలో పూర్వార్థము దీనిలో మొదటిపాదంలో ఒక సంబోధన యత్యక్షరాన్ని విడచి ఆగుతుంది మరో సంబోధన రెండవ పాదంలో దూచ్చి ఏకాక్షరాన్ని గ్రహించి ఆగుతుంది మూడవ సంబోధన రెండవ పాదంలో యత్యక్షరాన్నికూడా గ్రహించి మాత్రమే ఆగుతుంది ఈ మూడు సంబోధనల చివర 'ఈ' కారాన్తమైన నకారం ఉండటం ముఖ్యంగా గ్రహించదగింది మరోవిశేషం-రెండుపాదాల చివరా జగణాలు(నగణం లేదని చెప్పటం ఉద్దేశ్యం) ఉన్నయి. ఈదృశమైన రచన వల్ల - నడకవల్ల - భావంలో పోను బోను నొక్కుళ్లు చాలా ఎక్కువ అవుతున్నవి భావం ఆగి, ఆగి ప్రవృత్తమయినట్లు కూడా అనిపిస్తుంది చివర ప్రయుక్తాలైన జగణాల (నిజానికి జగణాలుకావు) వల్ల ఒక గమ్మత్తయిన నడక సాధింపబడింది ఈ విధంగా అనేక గీతాలు చూపించవచ్చు

'ఈ ప్రవాసయాత్రారతి నిలిచె నేను
కలిపోవుగు నానావకాశములను
ఒక్క నిట్టూర్పు పోలిక- ఒక్క మౌన
బాష్పకణము - ఒక గాఢవాంఛ పగిది.'

పూర్వార్థం నడకలో సాఫీదనం ఉంది ఉత్తరార్థంలో నొక్కుళ్లు ఎక్కువైనవి రెంటినడకకు విస్పష్టమైన తేడా కనుపిస్తూనేఉంది భావం ఎల్లా వివృద్ధమయిందో ఎల్లా ప్రవృత్తమయిందో, ఈ నడక భాసింపచేస్తుంది అక్కడక్కడ గీతం స్వ స్వరూపాన్ని కోలుపోయి వచనరూపాన్ని స్వీకరిస్తుంది భావోద్వేగం వల్ల ఇల్లాంటివి కాక, వచన గతమైన విరుపులు అక్కడ గోచరిస్తాయన్నమాట 'వాలు నీ కనురెప్పల జాలి చూపు, లల్ల దిగజారి దిగజారి అమరనాధ, కంఠ మాలా సుమదళాలు గాగ గగన, వాహినీ నీరజాళినీ పక్షనీల, నాట్యములుగ తారా తోరణములు గాగ, నింగి నీడల మెట్లుగా నీలిమొయిలు, జిలుగు విరు పులుగా, పులుగులుగ, నలరు లుగ...' ఈ రకంగా సాగుతుంది ఒకొకచోట గీతపద్యంతో మొదలెట్టి, గేయంలోకి దూకి, మళ్లీ చివరకు హఠాత్తుగా గీతం

లోకి మారుతాడు ఒకప్పుడు గేయంతోటే మొదలెట్టి గీతంలోకి దూకుతాడు. దీనివల్ల భావం ఎల్లా ఒక్కసారి ఉద్వేగస్థాయిలో గోచరిస్తుందో- అది భాసిస్తుంది

'నీ కుంతలములలో నాకై శిరసులెత్తి
నను బోల్చుకొన్నవో! నను పిల్చుకొన్నవో!
నటియించు ఆ చూపు లెటు నవ్వుచున్నవో!
తురిమి విసరుము వాని నెరుగనేరని దూర
దూరాలకో, రహస్తీరాలకో, చెలీ!
గప్పికొందున కనులు! కప్పగలనా ఎడద?
నా సఖి! నా సఖి! నే సైపగాలేను
ఓ నితాంతవియోగినీ! ఓ నిశీధి
నీ! కరోరప్రణయశాలినీ! ఉమింపు
చాలు, నా సఖి! నీ ప్రేమ శాప, మీ య
పూర్వ నారకయాతనాఖర్వతపన

గేయంలోంచి గీతంలోకి దూకటంతో మనం చదవటంలో కూడా కటిక్కిన మార్పు- బిగింపు రావటం - దీనివల్ల భావోద్వేగం భాసించటం - జరుగుతుంది ఉపర్యుక్తవివిధచమత్కారాల వలన కవితలో మాధుర్యగుణం విశేషంగా భాసిస్తుంది మాధుర్యం కొరకు బహువచన ప్రత్యయం 'లు' పరమైనప్పుడు శబ్దాన్తగమైన 'ము' వర్ణానికి లోపం, తత్పూర్వస్వరానికి దీర్ఘం (దూరాలు, తీరాలు) చేసి ప్రయోగించటంకూడా బహుళంగా జరిగింది (ఈ 'బహుళ' పదం సాంకేతికం కాదు.)

జీవితంలో సుఖం ఉన్నది అయితే కృష్ణశాస్త్రిని విందాము. 'మోయ లేను లోకాల తీయదనము' — 'తీయదనము' సుఖ పర్యాయవాచి సుఖం శాశ్వతం కానిది దీన్ని మించి ఆనందమన్నది ఒకటిఉన్నది జీవితంలో అందుకని వెంటనే 'ఆకళింతు నానంద తేజోఽంబు నిధుల' అన్నాడు. ఇక్కడ కవి సుఖానికీ - ఆనందానికీ ఉన్న విభేదాన్ని విస్ఫురింప జేస్తున్నా డన్నమాట

నిజానికి కృష్ణశాస్త్రి దుఃఖజీవి. ఆయన ఎక్కడ కూడా దుఃఖాన్నే పిండుకొంటాడు ఆనందంలో కూడా దుఃఖాన్నే సాక్షాత్కరించుకొంటాడు. 'అమల మోహన సంగీతమందు, హృదయ- దళన దారుణ రోదనధ్వనులువిందు' గళళమే తిందు కళుషార ఔటిగి ఘొబిగి-ఆవల ద్రోతు చేతులార నమృతరసము-

......చిత్ర చిత్రగతుల మార్పు 'జీవితంబు' అని అంటాడు తన కేమాత్రము సుఖము గల్గినా ఓర్చుకోలేడు 'ఈ మహానంద వీచికా స్తోమడోలి, కాగ్రముల నింక నే నాట్యమాడలేను నేను చిరునవ్వు పెదవుల నిలుపలేను. ఏ విరామ మేనీ లేని ఈ శుభోత్సవ ప్రణయ కేళికా వేగాద భారమింక. ఏను వహియింపలేను. జీవింపలేను' అన్నాడు సుఖమును ధరించలేడు సరిగదా ఆనందాన్ని కూడా స్వీకరించలేని స్థితి ఇప్పుడు పట్టింది అందుకని తన దృష్టిని వానివైపు కాక వేనివైపో త్రిప్పుకొన్నాడు ఆ త్రిప్పుకొన్న సందర్భంలో —

'నా కనుల త్రాగుచీకట్లు ప్రాకుచోట
లేగు నెత్తావి - మధుగాని లేదు - లేదు
ప్రాణ-మొక్క లావణ్య లవమ్ములేదు
ఏను రుజనైతి-జరనైతి-మృత్యువైతి' అన్నాడు కాబట్టి

కూడా—

నన్నుగని ఏరు జాలి చెందంగవలదు—
నాకు నిశ్వాస తాళవృంతాలు గలవు
నాకు కన్నీటి సరుల దొంతరలుగలవు
నా కపూర్వ మమూల్య మానంద మొసగు
నిరుపమనితాంతదుఃఖంపు నిధులుకలవు' అన్నాడు

దీనిలో ఒక విచిత్రమున్నది 'అపూర్వమానందము' అన్నది ఇంతకు పూర్వ మేదైన ఆనందము (ఉండేఉండవలె) ఉన్నట్లయితే—అది ఇంత గొప్పది కాదని—నిజమైన ఆనంద మనిపించదనీ భావం యదృచ్ఛాపతిత సుఖం ఆనందరూపంగా భాసించింది ఆత్మ ఎరిగిన ఆనందాక వచ్చేటప్పటికి మనోగృహీతాలన్నీ ఆభాస లవుతున్నవి అచ్చమయిన ఆనందాన్ని ఎవడు సహించగల్గుతాడు ? దుఃఖయుక్తమైతేనే 'సమపాళ్లయి' అనుభావ్యం అవుతుంది ఇది లోకా సంపూర్ణతకు ఒక నిరూపకం

అయితే పై నుదాహరించిన వాటిలో చూస్తే కృష్ణశాస్త్రి యొక్క వాక్యప్రయోగంలో గల సత్తువ గోచరిస్తుంది. 'నన్నుగని ఏరు...' అన్న దానిలో మువ్పాదాలూ భావాన్ని తమవరకే పూర్తి చేసుకున్నయి. నాల్గవ పాదం భావాన్ని తన చివర విరిచి తరువాతిపాదంలోకి పంపిస్తుంది. మొదటి మూడు వాక్యాలు చిన్నవి నాల్గవది పెద్ద వాక్యంగా ఉపయోగించటం వల్ల దానిలోని భావానికి ప్రాముఖ్యం ఇస్తున్నట్లుగా ఆభాసిస్తుంది. 'నా కనుల

క్రాగు...' అన్నదానిలో నాల్గుపాదాలూ శక్తివంతమైన వాక్యాలను పొదివి కొని ఉన్నాయి నాల్గవపాదం మరీ శక్తియుతమైంది ఇది (4 వ పాదం) మూడు వాక్యాలుగా విరిగింది మూడింటికీ క్రియలున్నాయి అల్లాకాకుండా —అంటే— ఆ మూడు వాక్యాలు కలిసి ఒకే క్రియ గల పెద్దవాక్యంగా కూడా చేయవచ్చు కాని ఆ వాక్యం శక్తియుతం కాకుంటుంది కర్త చివరి రెండు వాక్యాల్లోకి అధ్యాహార్యం కావటం— మూడు వాక్యాల చివరా ఒకే క్రియా ఉండటం గమనించదగింది దీనివల్ల భావంమీద ఒక విధమైనవత్తిడి రావటాన్ని మనం సంగ్రహించ గలుగుతాము. మరో ఖండికలో

'కన్నీటి కెరటాల వెన్నెలేలా ?
నిట్టూర్పు గాడ్పులో నెత్తావి ఏలా ?
ప్రళయకాల మహోగ్రభయదజీమూతోరు
గళఘోర గంభీర ఫళఫళార్భటులలో—
మెఱ పేలా ?—'

మొదటి రెండు పాదాలు పూర్తి నాల్గేసి పదాలుగా విడగొట్టబడినవి తరువాతి రెండు పాదాలూ కలిసి ఒకే గంభీరభయదదీర్ఘసమాసము తరువాతి పాదము ఆరు మాత్రలూ, రెండు పదాలూగల 'బహు చిన్నది' ఈ చివరిపాదం 'బహు చిన్నది' గా ఉండటం, పూర్వోక్త (పూర్వసమాసవ్యంజిత) భయంకర స్థితిలో మెఱపు యొక్క దయనీయస్థితి గోచరమవుతుంది అర్థవ్యక్తకన్న ముందే భావస్ఫూర్తి మనకు దీనివలన కలగటం సంభవిస్తుంది

వేదనాపరాకాష్ఠ కృష్ణశాస్త్రి ఎన్ని ఖండికల్లోనో చూపించినాడు ఈయన ఏ పదాన్ని పట్టితే అదే దుఃఖం పిండుతుంది ఆత్మమూర్తికి రూపకల్పన చేసిన ఖండికలో—

"ఎవ్వ రని ఎంతురో నన్ను—ఏననంత
శోకభీకరతిమిరలోకైకపతిని—
కంటకకిరీటధారినై—కాళరాత్రి
మధ్యవేళల—జీమూతమందిరంపు
కొలువుకూటాల నేకాంతగోష్ఠి దీర్చి
దారుణదివాంధరోదన ధ్వనుల శ్రుతుల
పొంగి యుప్పొంగి యుప్పొంగి పొరలిపోవు

నావిలాపనిబిడగీతి కావళీవి
రావముల నర్థరాత్రగర్భమ్ము, మఱియు
మఱియు క్షీపణకాళి మోన్మత్త గాగ
జేయుతరి—నన్ను మీరు వీక్షింపలేదొ ?"

ఏతద్విధాశోకమూర్తి కల్పన మపూర్వమైనది ఒకానొక వతాకాస్థాయీగిత శోకమూర్తి దర్శకమయిం దీ ఖండిక ఈ గ్రంథములోని ఏ పదం కూడా శోకాన్నే ఓడుస్తుంది నిజంగా తత్కాలంలో—భావనా జగత్తులో ఏతద్విధంగా ఉండిఉంటాడు కృష్ణశాస్త్రి ఆయన ఆంతరిక జగత్తు ఈదృక్కల్పితమై ఉంటుంది తానుగా అనుభవించని మహావేదన గల వ్యక్తి ఇతర జీవులను ఇంతగా కదిలించలేడనేది నిర్వివాద మనుకుంటాను

'నా మరణశయ్య పరచుకొన్నాను నేనె
నేనె నాకు వీడ్కోలుపు విన్పించినాను
నేనె నావయి వ్రాలినా, నేనె జాలి
నెదనెద గదించినాను, రోదించినాను'

ఇల్లాంటి పద్యాలతో సహృదయుల గుండెలు కోస్తాడు కృష్ణశాస్త్రి పై పద్యంలో మొదటి మూడు వాక్యాలలో 'నేనె' అనేవి తప్పనుండా నిలిపాడు మొదటి వాక్యం చివర 'నేనె' చేర్చి రెండవ వాక్యం మొదట కూడా 'నేనె' చేర్చటంవల్ల ఒకేసారి రెండు 'నేనె' లు పలుకవలసివచ్చి ఆవేగం స్ఫురిస్తుంది పద్యం చివర ఒక్కక్రియ మాత్రమే వాక్యంగా ఉపయోగించబడింది ఆ క్రియ కూడా పూర్వక్రియతో బహ్వక్షరసామ్యవంతమై ఉండటం కూడా జరగటం వల్ల ఆవేగ వేగం బాగా స్ఫురిస్తోంది

మింటవెలుగు చుక్కగన్న, మిణుగురున్న
నేను సహియింపలే, నవ్వి ఇరులు చెరుచు
నాకు ప్రాణమే మెరుపులే లేకయున్న
భాద్రపదమాసమున అమావాస్యరాత్రి

ఈ దృగ్విధాగాఢతిమిర విశ్రాంతి కోరుతున్నాడు కృష్ణశాస్త్రి 'చెరుచు' అనే ధాతువు కావాలని కవి ప్రయోగించినా డనిపిస్తుంది దానివల్లనే కవి ఎద పొందే అనుపమేయబాధ భాసిస్తుంది ఇల్లాంటి వాక్యవిన్యాసం—భావోద్వేగ—ఆవేగస్ఫోరకంగా బహుధా కృష్ణశాస్త్రి ఉపయోగించినాడు

'ఏనొ—పాతాళలోకంపు టిరుకుసందు
లందు నెగ్రాక వెరచు గాఢాంధరేఖ'

ఇక్కడ 'పాతాళలోకంపుటిరుకు' అన్నచోట ఒక అక్షరశిల్ప మున్నది అక్కడి సమాసంలో 'లోకము'లోని 'ము' వర్ణకానికి 'పుంపు'లు రావలెను 'పు' వచ్చినా ఛందస్సు చెడదు కాని 'ంపు', ప్రయోగింపబడింది దీనివల్ల అక్కడ 'కంపు' అనే పదం లేకున్నా ఉన్నట్టుగా భాసించి మహా హీనతాద్యోతకం అవుతోంది ఈ రకమైన అక్షర గ్రథనంతో కృష్ణశాస్త్రి బహుస్థలాల్లో ఇష్ట భావోద్బుద్ధి కలిగించినాడు ఒక్కొకచోట పద్యాన్ని పాదంమధ్యలో ఆపి ఉద్వేగాన్ని కల్పిస్తాడు'...కుంచుకొని రివ్వపడి క్రుంగిక్రుంగి అలసి—ఇపుడు నేనొక్క తుదిరేయి ఇరులచాయ—నై నశించుచున్నాను ఈ చివరి పాదాన్ని పూర్తిచేయటం కష్టంగాదు భావంతో పరుగెత్తే పాఠకుణ్ణి గుండెమీద చేయి వేసి ఒక్కసారిగా ఆపి ఆవేగాన్ని కల్గించటమే ఇక్కడ కావలసింది...' ఎదో ఏదొ ప్రాకె—నిపుడు ప్రళయమే?—' ఈ విధంగా మాధుర్య గుణానికి కావలసినవి కొల్లలు కొల్లలు

విప్రలంభశృంగారం భావకవులకు కావ్యాలంబనమైంది ప్రణయపథంలో సంభోగి శృంగారం కంటె విప్రలంభశృంగారానికే విశేషత్వం ఉన్నట్టు తెలుసుకుంటున్నాం విప్రలంభం ప్రేమను శాశ్వతం చేయటానికి తోడుపడుతుంది కృష్ణశాస్త్రి తరం చాలావరకూ దీన్నే తీసికొని విస్తృతం చేసింది కృష్ణశాస్త్రి యొక్క ఊహాప్రేయసి ఊర్వశి ప్రేయసి, ఊర్వశి- ఈ రెండు శబ్దాలూ దిగ్గరివిలా తోచటం గమనీయం) ఊర్వశి కావ్యంలో ప్రతిఖండికా మనల్ని పడిపిస్తుందనవచ్చును అంటే తత్ఖండికాగత వేదనాభావనాస్పందితహృత్కులం మన మౌతామన్నమాట. ఆ ఊర్వశి తన దగ్గరికి రావటాన్ని ఒక ప్రసూనం వచ్చినట్టుగా చెప్పినాడు అది ఒక మధురానుభూతి కాని ఆ అనుభూతి, వచ్చినంత సేపు- వచ్చుననుకొన్నంతసేపు లేదు అనుభవాద్యదశలోనే తన స్థితి గుర్తుకువస్తుంది సహజాతమైన వేదనే పురులుగొంటుంది 'ఇమ్మహా విశ్వమల్లలాడించు నీదు బొమముడి కషాయనీ క్షణస్ఫూర్తిమించు, బురదలో గ్రుళ్లి పొరలాడు పురుగునెత్తి, కాంత! చేర్పకుమోయి! నీ కౌగిలింత' అని ప్రభుని గూర్చి కృష్ణపక్షంలో ప్రార్థించినాడు ఆవిధంగానే ఇక్కడ కూడా — 'ఇట వడకు కేల దీని స్పృశింపలేను, వెరగు కనురెప్ప రేకుల విరియలేను, ఎటులదిమి కొందు నాౖమోడు టెడద నెటుల, చెరగి నెరసిన చింపిరికురుల దాల్తు'అంటాడు

ఊర్వశియొక్క స్థితి- తన స్థితి మరీ విమార్గంగా ఉన్నాయి ఒకదాని కొకదాని పొంతనే లేదు పూర్తి విరుద్ధాలు సమానం చేయటాని కసాధ్యములు

త్రిజగతీపతి కోటీర దివ్యరత్న
రాజినేలు వజ్రాల తురాయి వీవు ——
ఏనొ —— పాతాళలోకంపు టిరుకుసందు
లందు నెగబ్రాక వెరచు గాఢాంధ రేఖ

ఆమె దేవేశ్వరుని తలమీద ఉన్నది తానేమో పాతాళలోకంలో- ఇరుకు సందుల్లో- పైకెగబ్రాకటానికే భయపడుతూఉన్నాడు ఇద్దరికి సంకలనం ఎల్లా జరుగుతుంది మరి ? జరగటానికి వీలులేదు

'తారకా పూర్ణచంద్ర మార్తాండ బింబ
మండితమ్ము మహాకాశ మంటపమ్ము
నందె కాదె పాణిగ్రహణమ్ము దొరకు
పతిత వెల్లాదు ? నేనెట్లు పతినౌదు ?' అంటాడు

ఆ పాణిగ్రహణం మధ్యమస్థాయిలో దొరకగలది దానికై రెండుపనులూ జరగ వలసినవే ఆమె 'పతిత' కావటం- తాను 'పతి' కావటం కాని ఈ రెండూ అసంభావ్యాలూ, అసంభవాలూఅయిన కార్యాలు మరి ఇవి ఏవిధంగా జరుగు తాయి ? అంటే జరుగనే జరుగవన్నమాట

ఈ సందర్భంలో 'పతిత' అన్న శబ్దం చాలా జాగ్రత్తగా ఉపయోగింప బడింది ఆమె అంత ఉన్నతస్థాయిలో ఉంటేనే ఏన్నుద్ధరించుటకు యోగ్య అనే ఆశాబంధంతో జీవనస్థితిని కల్పించుకోవచ్చు ఆమె కూడా క్రిబడితే మరి తనకం దరువెల్లా అవుతుంది ? అదిగాక పతిత-భ్రష్ట- తన జీవితస్థాయి నుండి దిగజారినది అనిగదా తానాకాశమున ఉండవగినది - ఉన్నది అటువంటప్పుడు ఆత్మస్థాయీ భ్రష్ట ఎవరికి గౌరవపాత్ర అవుతుంది? తా పతితఅయి మరిఒకరికి ఎల్లా ఉద్ధారక అవుతుంది ? — మరొకటి, ఊర్వశి దేవ వేశ్య ఆమెకు పతనోత్పతనాలుఉండవు- ఉండరానివి కూడా కాని ఒకనారి ఒక భూపునితో సంబంధం - అదైనా శాప వశంగా—కల్గించుకుంది తా తక్కువస్థాయికివచ్చింది ఆ రావటం అసంభావ్యం, అసంబద్ధమూను అందువల్ల తద్రీతిగా ఇప్పుడు నీవు పతితవు కావద్దు ఎల్లా పతితవౌతావు? అంటే కావనేగద అర్థం కాగూడదనిగూడా భావం మరొకటి— ఊర్వశి కృష్ణశాస్త్రిలోని ఒక ఊహకు ప్రతీక మాత్రమే అనేది గుర్తుంచుకో వలసిన విషయం ఒక ఊహాజీవి తదూహాభ్రష్టతలో జీవితమే వ్యర్థప్రాయంగా

తలుస్తాడు అందువల్ల ఆ ఊహ పతితకారానిది దానిపైన్నే తన జీవితాశ కాని ఒకప్పుడు కృష్ణశాస్త్రికి ఈ ఆశకూడా బాధను కలిగిస్తుంది కలిగించింది కూడా,

వడపడ వడంకిపోదు జీవనపు గొనల
ఎన్నడే నాసకళ తలయెత్తనేని
ఉభయ సంధ్యాంచలాల నెదో వెలుంగు
కలుగ కలవరపోవు ఘూకంబువోలె

ఇక్కడ ఒక చిక్కు ఉన్నట్లుగా ఆభాసిస్తుంది కాని దాన్ని సమన్వయించుకొంటే చిక్కురూపంపోయి శుక్కు కలుగుతుంది ఘూకం ఉదయసంధ్యకే భయపడటం సహజం సాయం సంధ్యకు 'చీకటి వస్తోందిగదా' అని రాబోయే చీకటికి ఈ వెలుగు - బాధాకరమైనా - ప్రతీక కాబట్టి సంతోషం కలగాలి - ఇది లోక సహజమైనది కాని ఒక వేళ సాయంసంధ్యకు కూడా ఘూకం భయపడితే మన మేమనుకోవాలె ? దానికి వెలుగు చీకటి సమానమే అని- అంటే దానికి బ్రతుకులేనట్లు అల్లాంటి ఘూకమే ఇక్కడ ఉపమానంగా ఉపాదేయం లోక సహజంగా ఆశ ఉంటే బ్రతకటం జరుగుతుంది కాని కృష్ణశాస్త్రి ఆశకు లోకం సహజంగా (ఘూకం సాయం సంధ్యకు భయపడటం లాగా) భయపడతాడు అందుకని ఈ ఉపమానం ఈ విధంగాఉంది అలంకారాలు ఉపయోగించటంలో కూడా కృష్ణశాస్త్రి సిద్ధహస్తుడుగా కనిపిస్తాడు 'చెవరునే బెదరి బెదరి చెలియ కురులు జాలిగా నీలమేఘ నిశ్వాసములటు' ఇల్లాంటి ఉపమానాలు అతిలోకంగా ఉంటాయి అంతంత ప్రతిభ గలిగినవ్యక్తి ఈ విధంగా ఉపమించలేడనటం అతిశయోక్తి కాదు. పలుకుబడులు కూడా ఉత్తాలంగా ఉంటాయి 'ఇరుల గుసగుసలు' 'నెత్తావి గుసగుసలు' 'గృహనేత్ర వాతాయనములు' మొదలైనవి మనసు పరస్సీమకు లాక్కోవెళతాయి 'నేడిదేమో - క్షమాజననీ పురాణ - గర్భకుహరమ్ము విదలించు కారుచిచ్చు- ఎరుపుమంట మూలుంగేదో ఏదో ప్రాకె- ఇపుడు ప్రళయమే !......' లోపలినుండి వచ్చే ఊహ- భావం కార్చిచ్చువలె మండిస్తూ ఎర్రగా-మంటగా దుర్భరంగా వస్తోంది కాని తీరా ఆ బాధ వెలిబుచ్చటానికి తగిన పరిసరం కుదరకపోవటం అది మూలుగుగా మారింది పైకి చూస్తే మామూలు మూలుగే గాని లోతు చూస్తే 'ఎరుపుమంట మూలుంగు' అది ఈ విధంగా చాలా లోతులదాకా లాక్కోపోయే అలంకారాలూ, పలుకుబడులు కవి ప్రతిభను ద్యోతకంచేస్తాయి.

సామాన్యలోకి జీవితానికీ కృష్ణశాస్త్రి కల్పిత జీవితానికీ చాలా తేడా ఉంది ఇది అలౌకికమైంది ఈ భావాన్నే సూచిస్తూ—

'నాకు గాదులు లేవు
నా ఉషస్సులు లేవు
నేను హేమంత కృష్ణానంత శర్వరిని'

అని అంటాడు ఇక్కడ కూడా ఒక సందేహం అభాసిస్తుంది 'ఉగాదులు లేవు' అన్నతరువాత 'ఉషస్సులు లేవు' అనటం ఏమిటి? ఎప్పుడూ చీకటే ఉండి ఉగాది ఉషస్సులులేకుండా ఉంటాయా? పైచెప్పింది కృష్ణశాస్త్రి భావనా ప్రపంచానికి సంబంధించింది ఉగాది పండుగగా- ఉషస్సు ఆనందకరంగా- ఉండేవాటికై ప్రతీకలుగా చెప్పబడ్డాయి కృష్ణశాస్త్రి దుఃఖజీవి అని మొదటే మనవి చేసుకున్నాను తనకు సుఖంలేగు కాబట్టి సుఖసూచన ఏమీలేని దుఃఖ ప్రతిపాదక శర్వరినే సంగ్రహించి తానదే అంటాడాయన తానొక్క శర్వరిమాత్రమే కాదు. మరి—

నాకు కాలమొక్కటే
కాదు తాపు - నా
శోకమ్ము వలెనే - నా
బ్రతుకు వలెనే - నా వలెనే.'

అనీ అంటాడు శర్వరి కాలసూచకమైంది కాబట్టి కాలమొక్కటే తన ప్రతీక నాకు (తాను కాలాన్ని పడుతున్నాననే భావం) శోకం ఎల్లా రూపమో అల్లాగే కాలం కూడా తన బ్రతుకెల్లాగో, తానెల్లాగో తన గూపాలు- అలాగే మిగతావి కూడా అంటే- ఒకటి తనకు ప్రస్తుతమున్న రూపం ఇది బ్రతుకుగా- అనుభవంగా- మారుతుంది అప్పుడు [illegible] రూపం వస్తుంది శోకమే నాంతకాలికమై కాలరూపాన్ని ధరిస్తుంది అందువల్ల తన కాలస్థితి - తనస్థితి ప్రత్యేకమైనది. సామాన్య లౌకిక కాలజీవిత నియమాలు తనను పట్టవు అంటాడు కృష్ణశాస్త్రి

'ప్రవాసం'లోని ఉపథా ఖండికలో కూడా తన అలౌకికత్వాన్ని సూచిస్తూ అంటాడు— 'ఇట నశించు, నా కొఱకు చెమ్మగిలు నయనమ్ములేదు. ...అలయు వాతెర ఊర్పుగాలులు కదల్చి- రేపునంతె నా కాష్ఠాల రేగుమంట మును బ్రతుకునట్ల నాదేహమును దహింపు పడదులే ఆర్పగా నొక్క బాష్ప మేని' తనకుతానే-తనకెవరు? తన కొకరై తానెవరికి కాడు అందుకనే 'ఎవరోసఖో—ఎవరోసఖో—ఇపుడా నను పలుకరింతురు?' అని అంటాడు,

ఎవరయినా ఏమని పలుకరిస్తారు? పలుకరించితే ఏమవుతుంది? ఒక భావనాశీలి, గళదఘ్నశోకుడు, పలుకరింపువడి తన్నాపుకోలేడు ఆపుకొనక వెంటనే రోదిస్తాడు. ఎవరయినా ఓదార్చటానికి యత్నిద్దామన్నా వద్దంటాడు 'మీరు మనసారగా ఏడ్వనీరు నన్ను—నన్ను విడువుడు! ఒకసారి నన్ను విడిచినంత నేకాంతయవనికాభ్యంతరమున వెక్కి వెక్కి రోదింతును — విసుపులేక — విరతిలేక — దుర్భరశోక విషమగీతు లేడ్చివైతు, ఎలుంగెత్తి ఏడ్చివైతు' అని అంటాడు శోకమును లో కుంభించు కొన్నందువల్ల మరింతగా బాధపడటం కన్న వేరేమీలేదు లోదానిని వైటకు వెళ్ళగ్రక్కితే కొంతైనా శాంతి లభ్యం కావచ్చు. సున్నితమయిన మనస్సుకలవాళ్ళీ విధంగా తప్పకుండా చేయవలసే ఉంటుంది

> కార్మొయిలు పెదవుల ఖండ ఖండములుగ
> చిదికిపోయిన కౌముదీమృదులకళిక
> గాంచి — ఒకరేయి దుస్సహగాఢదుఃఖ
> మాపుకోలేక ఏడ్చె నా ఆర్ద్రమనము

అన్నాడు ఒకచోట (పూర్వార్థ భావం మన సారస్వతానికే అలంకారప్రాయం) నవ్వును గూర్చి ఎట్లు ఊహించినాడు! 'కార్మొయిలు...' అసలక్కడ వెన్నెల లకే తావులేదు అంచులలో ఒకప్పుడు స్పష్టాస్పష్టంగా ఉండవచ్చును అది చిదికిపోయినట్లు ఉంటుంది మరి చిదికిన ఆవెన్నెల ప్రియాధరవిశ్లథహాస రేఖకను గుర్తువరచి గుండెలు చీల్చింది ఆర్ద్రమనము ఏడ్వక ఏం చేస్తుంది? ఆ వెన్నెల పల్కరింతకు ఇదీ ఫలితం 'దారి తలనెత్తునింత సౌందర్యలవము — వదలిపోలేరు చంపెడు వరకు వీరు...ఏమని ఏడ్తు నేను' అంటాడొకచోట, 'ఏమని ఏడ్తు' అన్నది ఒక జాతీయం దాన్నుపయుక్తంచేసి లౌకికాత్మిక భావాల రెంటిని సమకూర్చినాడు

> 'రేయి కడుపున చీకటి చాయవోలె
> తమసుకెడద దిహాంధగీతము విధాన
> ఘూకరావాన వలవంత రేకరీతి
> నా విషాదమ్ములో దాగినాడ నేనె'

కరుణ ఎంత పతాకాప్రాయంగా చూపించబడింది! కావ్యానికి కరుణ పనికిరాదని ఆలంకారికమతం కావచ్చు కాని కరుణ అంత ఉత్తాలమైన రసం మిగతా రసాలలో లేదనటం అత్యుక్తి కాబోదు శృంగారాదులన్ని వయసా అనుభావ్యా

నమభావ్యాలై శాఖాగ్రాలు మాత్రమే అవుతున్నాయి కరుణ ఒకటే జీవితం యొక్క ఆదినుండి అంతం వరకు ప్రవహిస్తూనే ఉంటుంది. అందువల్లనే మహాకవి భవభూతి ఆలంకారికవిరుద్ధమైనా కరుణను సంగ్రహించి పతాకా ప్రాయనాటకద్రష్ట అయినాడు శాస్త్రభీషులు కొందరు తన్నాటకంలో రసం కరుణ కాదంటానికి కూడా సిద్ధపడ్డారు శ్రీశా కృష్ణశాస్త్రి 'మృదుల కరుణా మధురమూ', 'విషాదభరితమూ' అయిన ఎడద కలవాడు లోకులెవరు దీన్ని —ఈ విషయాన్ని శ్రేష్ఠంగా గ్రహించ గల్గుతారు ? నీటుగా పడ్వడం అనాగరకం అయిన ఈ రోజుల్లో మనసు విప్పుకోలేనివాళ్లు పంచేస్తే పం ? చంపేవరకూ సౌంద ర్యాన్ని వదలలేరట. ఇదె ఎంత దురాకాంక్షాక్తమో ? శానాశించు లోకమే తానుగా ఎరుగవలసిఉంటుంది

ఒకచో తనను వియోగ గీతిగా రూపించుకొని అంటాడు-

'పనోక వియోగశాలి నీ హృదయరాగ
వేదనారేఖ, ఆకలి వేగు నామె
అంగుళీ కిసలయచంచలాంచలముల
విడివడి అనంత విశ్వాన బడిని నాడు'

అని ఈ పద్యంలో ఆకలికి అంగుళీకిసలయాలు వేగిపోతున్నాయనీ- ఇది అసం బద్ధం అనీ- చూచేవరకు అనిపిస్తుంది ఈ 'ఆకలి' ని ఒకచోట 'వలపుటాకలి' అని వివరణాత్మకంగా వచిస్తాడు. అల్లాంటి వలపుటాకలిని పొందినప్పుడు శరీర మంతా విశ్లథమైపోతుంది. అంతా వాడి వత్తలై పోతుంది అయితే వాడిన అంగుళులకు కిసలయాలతో సామ్యం ? అంగుళులు వాడినవన్నప్పుడు ఉపమితా లైన కిసలయాలు కూడా వాడినవే గ్రహింపబడతాయి కిసలయాలను తినిగదా కోయిల పాటపాడేది నవనవలాడు కిసలయాలైతేనే కోకిలచేత పాడేట్టు చేయ గలవు. అంటే వాడిన కిసలయాలకు పాటకైన ఉత్సాహాన్ని- పాటకు శక్తిని కలిగించలేవన్నమాట అందువల్లనే వేగు అంగుళీకిసలయాలనుండి జారిపడ టాన్ని చెప్పాడు ఈ రూపకం ఇక్కడ ఈ విధంగా భావబోధ చేస్తుంది. ఒక భావం ఉద్వేగమైనప్పుడు వాగ్వ్యాపారం ఉండదు ఇక్కడ అదే జరిగిందన్న మాట

అసలా ఊర్వశికి ఒకచోట రూపకల్పన ఎంత రమ్యంగా చేస్తాడు !

నీవు తొలిప్రొద్దు నునుమంచుతీవ సొనవు
నీవు వర్షాశరత్తుల నిబిడసంగ

మమున పొడమిన సంధ్యాకుమారి, వీవు
తిమిర నిశ్వాసముల మాసి కుములు శర్వ
రీవియోగకపోలపాళికవు నీవె—
నీవె నిట్టూర్పు—నీవె కన్నీరు—విశ్వ
వేదనామూల్యభాగ్యమీవె, నిజమ్ము
నే గళమ్మార పాడుకొనిన అభాతి
శోకగీతమ్ములందీవె శోకగీతి
ఊర్వశీ! ప్రేయసీ!—

దీనిలో వాక్య విన్యాసం ముఖ్యంగా గమనించదగ్గది పోను పో పెద్ద వాక్యాలు రాను రా చిన్న వాక్యాలు చివరకు 'సగపాదం'లో ఆపుదల. 'తీవసౌనవు' అంటే 'సౌన' మకరంద ప్రవాహజ్యోతకం చెప్పబడని పుష్పాలు ఊహ్యాలు 'వర్షాశరత్తు. .'వంటి మధురకల్పనలు మనం సారస్వతంలో అరుదుగా చూస్తాం మాధుర్యం వెనువెంటనే వేదన ఇది—ఈస్థితి—ప్రతిచోటా మనకు కనిపిస్తుంది ఏతాదృశంగానే ఆవిడ (ఊర్వశి) కన్నులను గూర్చి చెప్పిన తాపు అద్భుతమైంది

'ఆమె కన్నులలో అనంతాంబరంపు
నీలి నీడలు గలవు—వినిర్మలాంబు
పూరగంభీరశాంతకాసారచిత్రి
హృదయములలోని గాటంపు నిదురచాయ
లందు సెడసెడ గ్రమ్మ......
ఇరుల గుసగుసల్ వానిలో నిపుడు నపుడు
వినబడుచునుండు......
......ఎదియొ అపూర్వ మధుర
రక్తి స్ఫురియించుగాని అర్థమ్ముకాని
భావగీతమ్ములవి—'

ఇది ఒకానొక ఊహకు పరాకాష్ఠ నిజముసె కె కన్నులేవో కావు తనవే— తన ఊహలే శూన్యత్వం, దుఃఖం, అభాససుఖలేశం తన గుండెలు. అనగా తన ఊహలు తన ప్రేయసి ఊహలనుండి విడమరచి రూపకల్పన చేసిన ప్రేయసికి మరల ఊహలతో తాదాత్మ్యం చెప్పటమే ఇది కాని ఈ తాదాత్మ్యం అసంపూర్ణమైంది. అందుకనే తన ఊహలే తనకు దూరమై 'తొలివియోగిని

నేనె— తొలి ప్రేయసిని నేనె' అని తమ ప్రత్యేకతను రూపించుకొంటున్నవి. 'నీవే నేను' అని కనుక అంటే కృష్ణశాస్త్రి కవిత్వంరాయడు రాయలేడు అల్లా అనలేదు కాబట్టే—

ఊర్వశీ! ప్రేయసీ! నేడొ యుష్మదీయ
చరణమసృణారుణోదయసురభికాంతి
పలుకరించున? నోకునా? తళుకు మనున?
ఆరని వెలుంగె నాగీతి కాంతికముల
చేర్చికొని- ఓర్చికొని- భవ చ్ఛ్రీవిలాస
హాసవాసనాలేశము లందికొనగ
రమ్యహివవాలుకాచ్ఛనీరాజనముగ
ఈయనా సఖ!

అన్నాడు ఆమె తనకు దొరకితే 'మూడులోకాల సుఖ మొక్క ముడి నిమిడ్చి, విసరనో- కాలాంతమే వెనుక త్రాక' అంటాడు సుఖము విసిరివేస్తాడట ఎందుకు? ఈ సుఖం తనతో ఉండరానిది- ఉండనిదికూడా అందుకనే తన జీవిత మర్థమర్థంగానే సాగవలసింది

కృష్ణశాస్త్రి కవితలో దోషాలులేవని కాదు కాని వాటన్నిటికిని కప్పి వేయగలిగి హృదయస్పందిభావాలను అందిచ్చే చిక్కని ప్రతిభ - కవితాశక్తి ఉంది కాబట్టే ఈదృశహృదయవిదారణశీల బహుధావిధారచనారథ్యా కుశలుడు కృష్ణశాస్త్రి కరుణారూపుడు అయిన నటరాజును కావ్యాంతంలో స్తుతించటంలో ఔచిత్యం చూపినాడు కూడా కృష్ణశాస్త్రి

'అవధరింతువు ప్రతిదివ సాంతమందు
నిత్యనూతనతాండవనృత్యకేళి
ఓయి నటరాజ! తలలైన నూపలేక
భువనములు దుర్భరానందమున నడంగ
... ... ... ...
ఏ విధాన సౌందర్యరసైకజీవి
నిలువనేరుతు నిట నొక్క నిముసమేని
మామకీన శుష్కమార్గముల త్వ-
దీయపాదమంజీరముల్ మ్రోయకున్న'



కథానిక :

# రాజకీయ బాధితులు

శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి

ఉదయం మసక మసక చీకట్లో పెంటమ్మ రోడ్డును ఊడుస్తూ ముందుకు సాగుతున్నది. పొగమాదిరి కమ్మివేసిన మంచుకు వణకుతు, వెచ్చదనానికి మార్గంతోచక, అప్పుడప్పుడు బొడ్లోఉన్న చుట్టను ఎడమచేతితో తడిమి చూచుకుంది ఇంత నిప్పు సంపాదించి చుట్టను అంటిపెట్టుకోవాలని నిప్పుకోసం మధ్య మధ్య నలువైపుల పరికించి చూచింది

"అగ్గిపుల్ల ఉంటే ఇస్తావన్నా" అదే బాటన పోతున్న ఒక టాంగా పరిచయస్తుణ్ని అడిగింది

"చలిపెడ్తున్నదె?" కొంటెగా అని టాంగావాడు జేబులోచేయివేశాడు "మర్చిన, ఇప్పుడే ఖాలీపెట్టె పారేశిన" అని పరీక్షగా పెంటమ్మను చూశాడు పెంటమ్మ నిరాశతో ముందుకు సాగుతుంటే టాంగావాడు చేతి కొరడాతో గారాబంగా పెంటమ్మను కొట్టి "చుట్టతాగుతె చలిపోతాదె?" అన్నాడు పెంటమ్మ ఏదో గొణుగుకుంటూ వంగి రోడ్డు ఊడ్వసాగింది

"టాంగా కావాలా, టాంగా" దూరంగా చేతి సంచితో షచారు చేస్తున్న వ్యక్తిని కని పెట్టి టాంగావాడు గుర్రాన్ని రెండు చరి చాడు గుర్రం వడిగా ముందడుగులేస్తుంటే, టాంగావాడు పెంటమ్మవైపు శ్రద్ధగా తిరిగి చూస్తూ, చూస్తు గుర్రాన్ని అదిలించాడు "చలిపెట్టుందట, చలి" తనకుతాను గొణుగు కున్నాడు

పెంటమ్మ రోడ్డును ఊడుస్తూ, ఊడుస్తూ ముందుకు సాగి కొంతదూరం పోయింది రోడ్డుకు ఎడమవైపున ఉన్న మోటారు రిపేరింగు దుకాణానికి కొద్దిగా దూరంగా ఒక చిన్న గుడిసె లోంచి మంట కనిపించింది ఊడుస్తూనే గుడిసె వద్దకి సమీపించింది గుడిసె తడకసందుల్లోంచి పరీక్షగా చూచింది బొడ్లొ చుట్టను తడిమి చూచింది

తడకలోపల పొయ్యి ముందట దస్తగీర్ కూర్చొని టీ చేసుకుంటున్నాడు పొయ్యి కాకకు హాయిని అనుభవిస్తు, సిద్ధం కాగానే తాగటానికి ఉవ్విళ్లూరుతున్నాడు ఆనాడు శుక్రవారం క్షౌరం చేయించుకోవాలె, స్నానం చేయాలె, బట్టలు ఉతుక్కోవాలె, నెయ్యి, మసాలతో మాంసం వండుకోవాలె, పెరుగు కొనుక్కోవాలె, నమాజు చదువాలె కులాసాగా సాయంత్రం రోడ్ల వెంట తిరగాలె దస్తగీర్ ఆ రోజు కార్యక్రమం తనలో తానే నిర్ణయించుకుంటున్నాడు లేచి పాల గ్లాసును తెచ్చి బాయి మంటతో పరీక్షించి చూచాడు పాలు గడ్డకట్టినై "బద్మాష్, మంచి పాలు పోయరే." పాలవాణ్ణి తిట్టాడు టీ తాగవీలు కానందుకు నిటూర్పువిడ్చాడు "చెవులు పిండి పైసలు వసూలుచేస్తా "పాలవానికి చేయాల్సిన ప్రాయశ్చిత్త పథకం వేసుకున్నాడు

గుడిసె వెనుక నిలుచుండి నిప్పు అడగటానికి నిశ్చయించుకున్న పెంటమ్మ, దస్తగీర్‌ను ఒంటరిగా చూచి జంకింది కాని చుట్ట

తాగాల్సిన అవసరం ఉంది ఆకలి బాధ పెట్టు న్నది చలి తీవ్రంగా ఉంది మనసు మథన పడుతున్నా. కండ్లుమాత్రం గుడిసె తలుపుకోసం వెతుకుతున్నాయి రెండువైపులా పరికించి చూచింది దోవ కనిపించలేదు చెప్పినట్టు చీపిరితో చప్పుడుచేసి. "ఇంతనిప్పేస్తావన్నా" గుడిసె తడికసందుల్లో కండ్లుపెట్టి అడిగింది

ప్రతిరోజు ఆ సమయానికి రోడ్డు ఊడ్చే చప్పుడు వింటూనే ఉన్నాడు దస్తగీర్ కాని ఊడ్చేదెవరో మాత్రం అతనికి తెలియదు ఆ మసిమసి చీకట్లో ఆడగొంతు ఆ విధంగా చనువుతో అడగటంతో దస్తగీర్‌కు ఆశ్చర్యం కలిగింది క్షణంపాటు ఆలోచించి "ఇట్నుంచి ఎట్లా ఇవ్వాలె? అట్లా చుట్టుతిరిగిరా" అన్నాడు

మోటర్ల రిపేరింగు దుకాణం పక్కన చిన్న సందులోంచి ఆ గుడిసెవద్దకు చేరాలె ఆ దుకాణానికి వచ్చే మోటర్లను కడగటం నీళ్లు పొయ్యటం. చేతికింద అపని ఈపని చేయడంతో నెలకు ఇరవై అయిదు రూపాయలు జీతం పొందుతున్నాడు రాత్రిళ్ల దుకాణానికి కావలాగా ఉండటానికి అక్కడే గుడిసె వేయించి ఉంచాడు దుకాణంవాళ్లు

"దోవ ఎటుందో, ఎటుతిరిగి రావాల్నో" పెంటమ్మ అన్నది "ఎడమచేతిరోడ్డుకు మల్లితే సందుంటది అందుగుండారా" అని దస్తగీర్ గుడిసె బయటకువచ్చి పెంటమ్మకు ఎదురుగా పోయాడు పెంటమ్మ ఎదురుగా వస్తుంటే వింతగాచూస్తూనిలుచున్నాడు రాగానే గుడిసె వద్దకు నడిచాడు పెంటమ్మ బొడ్లోంచి చుట్టను తీసి పొయ్యి కెదురుంగా నిలుచుంది పొయిలోంచి నిప్పునుతెలుకుతు వెనుదిరిగి పెంటమ్మను చూచాడు దస్తగీర్ జారినపైట కాటుక కండ్లు దస్తగీర్‌ను ఆకర్షించాయి పొయ్యిలో మంటతో పెంటమ్మ ముఖం తళ, తళలాడింది. దస్తగీర్‌లో ఉత్సాహం రేకెత్తింది గంటెలో నిప్పుతెచ్చి అందియ్యబోతున్న దస్తగీర్‌కు వెంటనే ఒక ఆలోచన తట్టింది అందిస్తున్న నిప్పుగంటెను వెనక్కు తీసి కొని. "చుట్ట నోట్లో పెట్టుకో. నిప్పు అంటిస్తా" అని వికసించిన ముఖంతో పెంటమ్మను పరీక్షగా చూచాడు "ఎందుకు? వద్దులే" అని పెంటమ్మ గంటెను అందుకుంది పెంటమ్మను మైమరచి చూస్తూ పరధ్యాన్నంలో గంటినందించాడు దస్తగీర్

"చా, తాగుతావు?" ఉప్పొంగి వస్తున్న ఉద్రేకాన్ని అణుచుకుంటూ దస్తగీర్ అడిగాడు

"మొఖం కడగలె" అని పెంటమ్మ నిప్పు గంటెను కిందపెట్టి కిందవేసిన చీపిరి కట్టను చేతబట్టింది

"అట్లయితె మొఖం ఇక్కడే కడుక్కో. ఇప్పుడే పాలుపట్టుకొస్తా" అని ఉల్లాసంతో గ్లాసులోని ఇరిగిన పాలను చిమ్మించి బైట పోసి, వడిగా బయలు దేరాడు వెంటనే వెనుకకుమళ్ళి "అగో! ఆ కుండలో నీళ్ళున్నయి. పొయిలోబూడిదతో ఎండ్లుతోముకో ఇప్పుడేవస్త" అని వెళ్ళిపోయాడు

పెంటమ్మ చుట్టను పీలుస్తూ కూర్చుంది దస్తగీర్ ఆతిధ్యం విషయమై మొదట అంతగా ఆలోచించలేదు. చుట్ట తాగటంలో ఆనందాన్ని అనుభవిస్తున్నది తర్వాత దస్తగీర్ అన్నమాటల విషయమై ఆలోచించ సాగింది చుట్టనలిపి, చల్లార్చి బొడ్లో చెక్కుకుంది ఒక కొత్త మగవాడు ఆవిధంగా చనువుతో మాట్లాడడంతో మొదట కొంచెం జంకే కలిగింది కాని అతనురాందే వెళ్ళిపోవడానికి మనస్కరించలేదు తన స్వగ్రామంలో తెల్లవారు ఝామున తాను, తన భర్త

కోటయ్య పాచిపని, నీళ్ళు తెచ్చుకోవడం ముగించుకొని తాను కూలికై సన్నాహపడటం తన భర్త దొరోరి తోటకు వెళ్ళటం స్మృతికి వచ్చింది ఒక నిట్టూర్పు విడిచింది ఆలోచనా ధోరణిలోనే పరిసరాలు పరికించ సాగింది పొయ్యిమంటలో గుడిసెలోని వస్తువులు స్పష్టంగా కనుపిస్తున్నాయి చివిగిన ఖాకీలాగు, పల్చని నల్లని ఖమీజు ఒకచోట వేలాడుతున్నాయి పొయ్యికి కొద్దిదూరంలో మట్టిచిప్పలు, రెండు రాతెండి గిన్నెలు, ఒక చీనీ ప్లేటు, ఎనామిల్ మగ్గు పడిఉన్నాయి ఓమూలకు పాతపెట్టె మాసిపోయినరంగులు అక్కడక్కడ అజంతా పెయింటింగ్‌లా కనుపిస్తున్నాయి గుడిసె బయట కొద్ది దూరంలో రెండు కుండలు, ఒక పాతరాతి చెంబు, అక్కడే దగ్గరగా గవాక్షం ఉన్నట్టు కన్పించింది అవన్నిటిని పరికిస్తూనే తన గతజీవితాన్ని మననం చేసుకుంటున్నది

దస్తగీర్ వడిగావెళ్ళి హోటల్లోంచి అవా పాలు తీసుకొని వచ్చేవరకు పెంటమ్మ కూర్చొని ఉంది ఆమె కొప్పులో వాడిపోయిన క్రోటన్ పూలు చెల్లాచెదరుగా వేలాడుతున్నాయి. ఆదృశ్యం అతని ఉత్సాహానికి చేయూత నిచ్చింది

"మొఖం కడుక్కున్నావు?" చాలా చనువుతో అడుగుతు గుడిసెలో జొరబడ్డాడు

"కడుక్కోలె పోత ఇంక సానా ఉద్యాలె, చుట్టకుతి బట్టలేక ఇటువస్తి" అని చీపిరి పుల్లలను సరిచేస్తూ లేవబోయింది పెంటమ్మ.

దస్తగీర్ పాలకుపోతూ, వస్తూ ఆనాటి కార్యక్రమం ముఖ్యంగా శుక్రవారం కావటమువల్ల ఉల్లాసంగా జరుపుకోవాలని, అందులో పెంటమ్మ సాహచర్యము కూడా ఉంటే, ఉండే ఆనందాన్ని ఊహించాడు అనుభవించబోయే ఆనందానికి పెంటమ్మ తోడ్పడకపోతాననటంతో దస్తగీర్‌కు విరుత్సాహం కలిగింది ఐనా పట్టుదలసడలలేదు

"ఇంత చా తాగిపో. నీకోసమని పాలు కూడా తెస్తి" పొయ్యిలో కట్టెలను సవరిస్తూ దస్తగీర్ అన్నాడు పొయ్యిలోంచి ఇంత బూడిద పట్టుకొచ్చి చేతిలో వేయవచ్చాడు పెంటమ్మ సందేహిస్తూనే చేయి చాపింది దస్తగీర్ ఉల్లాసపడ్డాడు పెంటమ్మ నీళ్లకుండల వద్దకి వెళ్లి ముఖం కడుగసాగింది

పెంటమ్మ భర్త కోటయ్య రాఘవాపురంలో హరిజన కుటుంబానికి చెందినవాడు ఊళ్లో దొర తోటమాలిగా పనిచేసేవాడు సహజంగా మాటకారి కావటం వల్ల అందరికన్న పై చేయిగా వ్యవహరించేవాడు హరిజనవాడలో ఏర్పడే తగాదాల్లో, హరిజనులకు సంబంధించిన ఊరి తగాదాలల్లో కోటయ్యనే పెద్దమనిషిగా, మధ్యవర్తిగా హరిజనులు ఎన్నుకునేది కొన్నాళ్లకు కమ్యూనిష్టు ప్రభావం పడిన గ్రామాల్లో రాఘవాపురం కూడా ఒకటయింది దాంతో కోటయ్య ప్రథమ కమ్యూనిష్టు కార్యకర్తగా సిద్ధమైనాడు అవూరి దొరబంకుల్లో పనికిరాక పడిఉన్న పాత తుపాకులన్ని పదిలపరచి బాగుచేయించుకొని, ఆయుధం కూడా చేతబట్టాడు మొదటిసారిగా దొరకే తుపాకి పరిపెట్టి తన ప్రావీణ్యాన్ని ధృఢపరచుకొన్నాడు "దున్నేవానిదే భూమి" నినాదానికి "పెంచినవానిదే తోట" నినాదాన్ని జోడించుకొన్నాడు

మొదట రజాకార్లను, తరువాత కాంగ్రెసు వాండ్లను, మిలిటరీని, పోలీసులను వేటాడటంలో పేరు ప్రతిష్ఠలను గడించాడు దొర తోటను తన తోటగా మార్చుకున్నాడు.

కమ్యూనిస్టు పార్టీ పోరాటం మానుకున్నా కోటయ్య మాత్రం వేటాడటం మానుకోలేదు తుదకు పార్టీవాండ్లు కోటయ్యకు పార్టీతో సంబంధం లేదనాల్సి వచ్చింది అప్పుడు కోటయ్య పార్టీ వాండ్లపై కన్నెర్ర జేశాడు. ఏకాకిగా ఎన్నో అవస్థలు పడ్డాడు పెట్టాడు బహుకష్టంగా తుదకు ప్రభుత్వానికి చిక్కాడు అప్పటినుంచి కోటయ్య బాధపోయింది పార్టీ వాండ్లకు, తదితరులకు కాని కోటయ్య బ్రతికింది, చచ్చింది మాత్రం గట్టిగా చెప్పగలవా రెవరూ లేరు భార్య పెంటమ్మ కోటయ్యకు కుడిభుజంగా అన్నివిధాల చేయూతనిచ్చినా పార్టీవాండ్లతో కోటయ్య వేరుగావడం మాత్రం ఆమె ఇష్టపడలేదు చెప్పి ఒప్పించాలని కొన్నాళ్లు ప్రయత్నించింది తుదకు విధిలేక భర్తకు లొంగిపోయి. మనస్సు కుదుటపర్చుకొంది కోటయ్య పట్టుబడ్డాక ఎవరూ సానుభూతి, సహకారం చూపకపోవడం వల్ల కాలుకాలిన పిల్లివలె అటు ఇటు తిరిగి నిరాశపడి. ఊర్లో మనటం సాధ్యపడక కొన్నాళ్లకు హైదరాబాదు చేరుకుంది మున్సిపల్ కార్మికుల్లో చేరింది మున్సిపల్ కార్మికుల సంఘం పెద్దలకుగాని, ఇంకెవ్వరికిగాని తాను కోటయ్య భార్యననే విషయం చెప్పక, లోలోన కుములుతూ, క్రుశిస్తు, కాలంగడుపుతున్నది ముప్పై. ముప్పైఐదు ఏండ్ల వయసులో ఉన్నా సహజంగా స్థూలశరీరం గాబట్టి, నెత్తి వెంట్రుకలు వంకిరలుతిరిగి ఆకర్షకంగా ఉంటాయి కాబట్టి, పెంటమ్మ సాంఘిక స్థాయికి చెందిన, చెందని ఎందరో ఆమెకొరకు తాపత్రయపడ్డారు కాని ఎవరికీ వశంగాక శీలాన్ని కాపాడుకుంటూ వస్తున్నది టాంగావాండ్లు, రిక్షావాండ్లు, కోటి కార్మికుల్లో కొందరు కొంటెగా మాట్లాడినా, అసభ్యంగా ప్రవర్తించినా, తన దీన స్థితికి లోలోన బాధపడుతుంది భర్తను తలచుకొని నిట్టూర్పు విడుస్తుంది అందువల్ల ఆమె విషయం ఆలోచించేవారందరికి ఆమె ఒక సమస్యగా తోస్తుంది ఒక సామాన్యకూలీ ఆవిధంగా ఉండటం కొందరికి ఆశ్చర్య మనిపించింది ఆమెకు అంత బింకం, బిడియం ఉండటం కొందరికి అసహజంగా అనిపించింది కొందరు ఆమె ఆ వైఖరికి కారణ మేమిటో తరచి చూడాలని ప్రయత్నించికూడా విఫలులైనారు. కొందరు ఆమె వ్యక్తిత్వానికి ఈర్ష్యపడి హేళన కూడా చేయసాగారు ఇవన్ని ఆమె విజ్ఞానాభివృద్ధికి దోహదం చేస్తున్నాయి. పురుష ప్రవృత్తిని, స్వార్థాన్ని అర్థంచేసుకోవడానికి అవకాశం కలిగించాయి ఆమెకు కలిగిన అనుభవాలతో, కొందరు ఆడవాండ్లతో చెలిమి చేయడం కూడా ప్రమాదమని తెలిసికొంది వేళకు తన పనిచేసుకోవడం, మిగతాకాలంలో ఏకాంతంగా కూర్చొని, తన జీవితానుభవాలను, భర్త కార్యకలాపాలను, రాజకీయాల్లో అడుగుపెట్టినప్పుడు విన్నవి, తర్వాత కన్నవి, తుదకు అనుభవించినవి, అనుభవిస్తున్నవి నెమరు వేస్తూ కాలం గడుపుతోంది అటువంటి పెంటమ్మ ఆ రోజు దస్తగిర్ ఆతిథ్యంలో పురుషుని స్వార్థంలేదని అనుకోలేదు. కాని, అతడు మాట్లాడే పద్ధతిలో గాని, చేస్తున్న మర్యాదలో గాని పోకిరితనం కనబడలేదు మర్యాదే ద్యోతకమైంది పొల్లుమాటలు లేవు పొందికగా మాట్లాడాడు పరపురుష డంటే సహజంగా ఉత్తమస్త్రీకి కలిగే జంకు పెంటమ్మకు కలిగినా, ఆమెకు గల గుండెనిబ్బరం, అనుభవంతో కాలు నిలదొక్కుకొని, ఆలోచిస్తూనే, దస్తగిర్ పెట్టిన బూడిదను, చేతితో పట్టుకొని, నీళ్లకుండల వద్దకు చేరింది ఆనాటి సంఘటనను తన అనుభవగ్రంథంలో అధ్యా

యంగా చేర్చుకొంటున్నది పండ్లమైలను పరిశుభ్రం చేసుకుంటున్నది

దస్తగీర్ తన గుడిసెలోని నాటి వాతావరణానికి కొత్త అనుభూతిని పొందసాగాడు ఏడేండ్ల క్రితంవరకు గడుపుతూ వచ్చిన పదిహేనేండ్ల దాంపత్యజీవితం భగ్నమైనతర్వాత, తిరిగి నేటికి తనపంచ ఒక స్త్రీ మెలగడంతో అతని కెంతో హాయికలిగింది తన భార్య పుట్టింటినించి వచ్చినప్పుడల్లా దస్తగీర్ స్వయంగా టీ కాచి ఇవ్వడం, ఆమె పచ్చి రావడంతోనే ప్రయాణ బడలికతో నిట్టూర్పు విడుస్తూంటే, ఆప్యాయంగా పరిచర్య చేయడం అతని కలవాటు తనభార్య గతించిన ఏడేండ్ల తరువాత అటువంటి వాతావరణంలో నాడు ఉన్నట్టు ఉల్లాసపడ్డాడు పెంటమ్మ కుండలవద్ద గోడకు ముఖంచేసి ముఖం కడుక్కుంటుంటే, రెండు మూడు సార్లు గుడిసెలోంచి తొంగిచూచి, తన్మయత్వంలో మునిగితేలాడు ఒకసారి శిలా ప్రతిమవలె నిలుచుండి తన్ను తానే మరచి ఆలోచించసాగాడు అకస్మాత్తుగా కండ్లలో నీళ్లు తిరిగాయి ఆ నీళ్ళలో పోలీసు ఏక్షన్ రోజుల్లో పల్లెటూరిలో అతని ఇంటిపై దాడి జరిగి తనభార్య, పిల్లలు హత్యచేయబడడం గురించి,విన్న వివరాల ప్రకారం దృశ్యాలు తాండవించాయి ఆనాడే ఆ సంఘటన జరిగినంత తల్లడిల్లాడు పచ్చిగాయంమీద బలమైన ఇంకొకగాయం తగిలినంత వణికి పోయాడు తాను రజాకారుగాచేసిన హత్యలు గృహదహనాలు, మానభంగాల పాపాన్ని కన్నీటిబొట్లతో కడిగి వేస్తున్నాడు హరిజనుడైన రామయ్య పదిహేను ఏండ్లకింద దస్తగీర్‌గా మారి, అచ్చమైన మహమ్మదీయునిగా అప్పటినుంచి పోలీస్ ఏక్షన్‌వరకు, అహంకారంతో చేసిన అరాచక చర్యలకు, ఆనాడు ప్రాయశ్చిత్తం చేసుకోసాగాడు పిచ్చివానిలా నిలుచుండి పొయ్యిమీద పాలబుడగలను కళ్లు మరచి చూస్తున్నాడు బుస్సునపొంగినపాలను ఆతురతతోపట్టి చేతుల్తోనే కిందికి దింపాడు వేళ్లుకాలినా లెక్కజేయక తిరిగి గుడిసె బయటికి తొంగిచూచాడు పెంటమ్మ పైట కొంగుతో ముఖం తుడుచుకుంటుంటే, మరుగులేని ఆమె వక్షస్థలాన్ని కండ్లారచూచి తల నేలకు వేసుకున్నాడు ఆమె ముఖం తుడుచుకుంటూ గుడిసెవేపు వస్తున్నకొద్దీ అతనిలో బిడియం ఆవరించసాగింది తలఎత్తి ఆమెను చూడడానికే సిగ్గుపడ్డాడు పొయ్యివద్ద కూర్చొని టీని కలిపి రెండుగ్లాసుల్లో పోశాడు.

పెంటమ్మ గుడిసెబయట తూర్పుముఖంగా నిలుచుండి ఎర్రనిరూపు దాలుస్తున్న ఆకాశాన్ని ఆదేపనిగా చూస్తున్నది దస్తగీర్ రెండుచేతుల్తో రెండుగ్లాసులు పట్టుకొని గుడిసె బయటికివచ్చి, పెంటమ్మవైపు మళ్ళేవరకు సూర్యునికాంతితో ఆమెముఖం ఇంద్రధనస్సు రంగులతో మిళితమైనట్టు కనిపించింది ముగ్ధుడై చూస్తూ టీ గ్లాసును "ఇగో, తా" అని అందించాడు

పెంటమ్మ తెప్పరిల్లినట్టు దస్తగీర్ వైపు మళ్ళింది బిడియంతో ముఖం నేలకువంచి గ్లాసును అందుకుంది తలనువంచే టీ గుటక వేస్తుంటే ఆమెను తీక్షణంగా చూస్తూ దస్తగీర్‌కూడా ఆమె గుటకలకు తన గుటకలు మేళవించి టీ తాగాడు

ఏదైనా ప్రసక్తితీసి మాటలు సాగించి పెంటమ్మ మనసును తెలుసుకోవాలని దస్తగీర్ పథకం వేసుకుంటున్నాడు సంభాషణ ఎట్లా మొదలు పెట్టాల్సింది తోచక సతమత పడ్తున్నాడు.

"నిప్పుకోస మొస్తే చా కొరింకిది" అంటూ పెంటమ్మ టీ గ్లాసును కడగడానికి నీళ్ళకుండల వద్దకి వెళ్ళింది ఆ మాటల్లో ఆమె కృతజ్ఞతా వాక్యాలు ధ్వనించాయి దస్తగీరుకు పెంటమ్మ గ్లాసును కడిగి తిరిగి వస్తుంటే "నీ పని అయిపోయినాక బస్సు కిందపడికే రారాదు" గుటకలు మింగుతు, తడబడుతు, దస్తగీరు అన్నాడు

"నాకు పనిఉంది రావటానికి కాదు" కట్టె విరిచినట్టు అని గ్లాసు కిందపెట్టి చిపిరి చేత బట్టి వెనుకకు తిరిగి చూడకుండా వెళ్ళి పోయింది పెంటమ్మ

దస్తగీరు నిరుత్సాహంతో నిలువునా కూలి పోయాడు అనుకోకుండా వచ్చిన అతిథి అనుకోకుండా వేసుకొన్న పథకాలు హటాత్తుగా చేయిజారి పోయినందుకు వేదపడ్డాడు గుడిసెలోకిపోయి తడక సందుల్లోంచి పెంటమ్మను చూడసాగాడు ఆమె నెత్తిన కొంగును వేసుకొని ఊడుస్తూ ముందుకు సాగిపోతోంది దస్తగీరు మనస్సును బట్టలేక రోడ్డు మీదికిచేరి ఆమె ఊడ్వవలసిన రోడ్‌భాగంలో నిలుచున్నాడు ఆమె దగ్గరికి రాగానే "చాగిన్నె తోమిచ్చిపోతావ్" చొరవ చేసుకొని అడిగాడు

పెంటమ్మ వినబడనట్టే ఊడుస్తూ ముందుకు సాగింది దస్తగీరు నిర్విణ్ణుడై కాసేపు నిలుచుండి ఒక నిట్టూర్పు విడిచి తిరిగి గుడిసెలోకి చేరాడు ఆనాడు శుక్రవారం మోటారు రిపేరింగ్ దుకాణం ఉండదు కాబట్టి ఆరోజు అతను చేయాల్సిన పనేమీ లేదు పెంటమ్మ రాకముందు వేసుకున్న శుక్రవారపు కార్యక్రమం గడుపుకోడానికి గూడా మనస్కరించలేదు పిల్లా, జల్లతో కళకళలాడ్తుండిన విందు ఇల్లు నిర్మానుష్యంగా ఉన్నట్టు, తన గుడిసెను బీరుపోయి చూడసాగాడు ఏడేండ్లనుంచి మనసును గట్టి చేసుకొని సాగిస్తున్న జీవితంలో, ఆనాడు పెంటమ్మ చిచ్చుపెట్టి మంటరేపి వెళ్ళి పోయిందని చింతించాడు విచారంతో రోడ్డు ప్రక్క పైపు వద్దకువెళ్ళి స్నానం ముగించు కొని, గుడిసెకు చేరుకొని, మాసినబట్టలు వేసికొన్నాడు చిత్తస్థిమితంలేక రోడ్డువెంట బడ్డాడు అటూ ఇటూ పచారుచేసి, తిరిగి గుడిసెకు చేరుకున్నాడు, నమాజు చేయడం మరచిపోయాడు భార్యా పిల్లలను తలచు కొని, వెక్కివెక్కి ఏడ్వసాగాడు అన్నం వండుకోడానికి కూడా మనస్కరించలేదు పిచ్చివానిలా గుడిసె పైభాగాన్ని చూస్తూ గంటలకొద్ది కాలం గడిపాడు ఆరోజు తిండేలేదు కడుపులో మండినప్పుడు దగ్గరున్న హోటలుకు వెళ్ళి, రెండుమూడుసార్లు టీతాగి వచ్చాడు సాయంత్రం తిరిగి రోడ్డు ఊడ్వడానికి పెంటమ్మ రావచ్చునని రోడ్ మీద పచారు చేయసాగాడు

పెంటమ్మ నిష్కర్షగా దస్తగీరు ఆతిథ్యాన్ని తిరస్కరించినా, హృదయంలో సంచలనంమాత్రం తొలగిపోలేదు ఊడ్పు పని ముగించుకొని, తన ఇంటికి చేరుకొని గంభీరంగా వంట, భోజనం ముగించుకొని, విశ్రాంతి తీసుకోవడానికి నడుము వాల్చింది దస్తగీరు జ్ఞాపకం వచ్చాడు అతడు అందగానిలో లెక్కకాదు పిల్లిగడ్డం, స్ఫోటకపు మచ్చలతో చెదలు పట్టినట్లున్న ముఖం, పట్టుదలతో నమాజు చేస్తున్నందుకు గుర్తుగా నుదుటిమీది రూపాయకంటె పెద్ద నల్లని మచ్చ, పోలీస్ ఆక్షన్ రోజుల్లో మిలటరీ తుపాకి దెబ్బకు ఎగిరిపోగా మిగిలిన చెవ్వు, మిలిటరీ క్యాంపులో తిన్న దెబ్బలకు వంక

రలు తిరిగిన వేళ్ళు మొదలగు దస్తగీరు రూపురేఖలు. ఆమెను ఆకర్షించలేకపోయినా అతనితో గడిపిన ఆ కొద్దికాలం ఆమెలో ఏదో చెప్పరాని ఆమెకే ఊహించ వీలుగాని మార్పు తెచ్చింది స్వగ్రామంలో తోటికులం వాండ్లు సహజంగా చేసే పరిహాసం కూడా ఆమె సహించలేక పోయేది కోటయ్య హరిజనవాడకు ముఖ్యుడుగా వ్యవహరించటం, రాజకీయంగా తర్వాత ప్రాధాన్యత వహించటం వల్ల, ఆమె ఏమాత్రం కొంచెంతనం చూపినా అతని గౌరవానికి లోపం కలుగుతుందని అతని వ్యక్తిత్వం దెబ్బ తింటుందని జాగ్రత్త ఎదేది ఒకసారి ఊళ్ళోకి వచ్చిన దీటు జవాను పళువుగా వ్యవహరించబోతే పెంటమ్మ చేసిన ఆర్భాటం మొత్తం హరిజనవాడతో పాటు గ్రామమంతా పెంటమ్మ శీలాన్ని హర్షించింది పోరాటకాలంలో కోటయ్య దళానికి చెందిన ఒకడు ఒక స్త్రీ విషయంలో దుష్టబుద్ధి కలిగి ఉన్నాడని తెలిసి కోటయ్య అతనికి చేసిన ప్రాయశ్చిత్తానికి పెంటమ్మ ముగ్ధురాలై తన భర్తను దేవతగా భావించింది. అటువంటి పెంటమ్మలో కూడా కదలిక కలిగింది మూడేండ్లనుంచి గడుపుతున్న విస్తబ్ధ జీవితంలో స్పష్టంగా వెలుగు కనిపించినట్టు భావించింది కోటయ్య చచ్చిపోయాడని ఎక్కువగా వింటున్నా, ఎన్నో కారణాలు అతని చావును ధృవ పరుస్తున్నా ఆమె మాత్రం ఇంకా సంధిగ్దావస్థలోనే ఉండిపోయింది "జైలులో లేకుండా, బయట లేకుండా, అదాలతులో మొఖద్దమా లేక ఏమై ఉంటాడు?" హృదయంలో ఒక ప్రశ్న బయలుదేరింది "ఆవిధంగా నామరూపాలు లేకుండా మాయమైనవారు ఎందరు లేరు? వారిలో కోటయ్య కూడా ఎందుకు చేరగూడదు ప్రజల బలంగాని, పార్టీ సానుభూతిగాని లేని కోటయ్యను ఎవరు ఏమి చేసినా అడిగేవారెవరు? ఎవరు లేరు కాబట్టి తప్పకుండా చచ్చి ఉండాలె "ఇన్నాళ్ళకంటె ఒక అడుగు ముందుకువేసి ఆలోచించింది. కాపేపు కన్నీరు కార్చింది నిట్టూర్పు విడిచింది మామూలుగా ప్రతిరోజు వెత్తి దువ్వుకొని, రెండు క్రోటన్‌పూలు నెత్తిన పెట్టుకొని. సాయంత్రం పనికి బయలుదేరుతుండేది కాని ఆరోజు మనస్తిమితంలేక చింతిస్తు చిపిరికట్ట ఎట్టుకొని బయలుదేరింది

దస్తగీర్ దూరం నించే పెంటమ్మను కనిపెట్టాడు అతనిలో ఉలుకు బయలుదేరింది ఆమెవైపు దృష్టినిలిపి చూడలేకపోతున్నాడు అటు ఇటు ముఖంతిప్పుతు ఆమె రాకను కనిపెట్టుతున్నాడు పెంటమ్మ మాత్రం దస్తగీరును కనిపెట్టలేదు ఊడుస్తూ అతని వద్దకు వెళ్లేవంకు కూడా తలపైకెత్తలేదు అతన్ని చూచి తల పైకెత్తి వింతగా గుడ్లనాడించి, బిడియంతో ముందుకు సాగింది దస్తగీరుకు ఎటూ తోచక, ఆమెవైపే చూస్తూ నిలుచున్నాడు పెంటమ్మ యాభైగజాల ముందుకు వెళ్ళి వెనుకకుతిరిగి దస్తగీర్ వైపు చూచింది. దస్తగీరులో ఆశ రేకెత్తింది మెల్లిగా ఆమె వైపు నడవసాగాడు ఆమె ఇంకా కొంత దూరం వెళ్ళి మళ్లా తిరిగిచూచింది అతని నడక వడి ఎక్కువైంది ఆమె ఊడ్పు ముగించి, పార్కులో నీళ్లహౌసు వద్దకి వెళ్ళి, ముఖం, కాళ్లు, చేతులు కడుగసాగింది. దస్తగీరు కూడా హౌసుకు ఇంకోభాగంలో, ఆమె కెదురుగా నిలుచుండి ఆమె వైపు దృష్టిని నిలిపి, లాంఛనంగా చేతులు కడుగసాగాడు ఆమె పార్కులోని క్రోటన్ పువ్వులుతెంపి కొప్పులో చెక్కుకొంది ఇంతలో వేరుసెనగ అమ్మ

తున్న పిల్లవాని కేకలు వినిపించాయి పెంటమ్మ సైగచేసి అమ్ముతున్న పిల్లవాడిని పిలిచి, రెండు అణాలని వేరు వేరుగా రెండుపొట్లాలు కట్టించింది దస్తగిరు కూడా అక్కడికి వచ్చి కొనబోయాడు పెంటమ్మ దస్తగిరును చూచీ చూడనట్టు ముఖం తిప్పి "నీకోసం కూడా కొన్నా" అని ఒక పొట్లం అందించింది ఆ పొట్లాన్ని దస్తగిరు మహాప్రసాదంగా తీసికొని ఆ ఆనందంలో అక్కడే కూర్చొనిపోయాడు

పెంటమ్మ కూడా అతన్ని చూడకుండానే ఆలోచనాధోరణిలో అక్కడే కూర్చుంది దస్తగిరు తనపొట్లంలోని వేరుసెనగను ఆమెవేరుసెనగ పొట్లంలో కలిపివేశాడు రెండుకాయలు వలచి ఆమె కందించాడు ఆమె వలచిన గింజలు అతనిచేతిలో పోసింది దస్తగిరు ఉద్రేకంతో ఆమెవైపు పరీక్షగా చూచాడు ఆమె తలఎత్తి దస్తగిరును చూచింది ఆమె కండ్లు నీళ్లతో తళతళలాడుతున్నాయి దస్తగిరు కండ్లల్లోంచి బొట బొట నీటిబొట్లు కిందబడ్డాయి ఇంతలో దూరంగా "చాయె గరం" అని కేకవినిపించింది దస్తగిరు అతన్ని పిలిచాడు

"పైసలు నేనిస్తా", పెంటమ్మ వికసించిన ముఖంతో అన్నది

"లేదు నేనిస్తా" అంటూ దస్తగిరు కన్నీరు తుడుచుకున్నాడు

పెంటమ్మ బిడియంతో తలనేలకువేసింది

టీ వాడు వచ్చాడు అతనికి పైసలు ఇవ్వడానికి పెంటమ్మ, దస్తగీరులు పోటీపడ్డారు తుదకు పెంటమ్మే గెలిచింది వాండ్లిద్దరు ఆనందంతో చా రుచి అనుభవిస్తుండే, చా తెచ్చినవాడు గుటకలువేస్తూ నిలుచున్నాడు పైసలుతీసికొని కొంతదూరం వెళ్ళి, వెనుకకు తిరిగి వాండ్లిద్దర్ని చూచాడు, "హాయిరేహాయ్" కొంటెగా నవ్వి ముందుకు సాగాడు

కవిత :

# అపరశకునీ!

శ్రీ జె. బాపురెడ్డి

ఓడిపోయినవాడ ఇక నీ
ఓటమిని ఒప్పుకోలేవా!
వ్రాలిపోయిన ముఖము ఇంకా
వ్రాల్చినట్లు నటించుచేలా?
శాంతి సత్యం ప్రేమతత్వం
సొంత సొత్తని చెప్పినావు

అసురభావనలెన్నో నీదర
హాసములలో కప్పినావు
నిండు కసితో మానవత్వపు
గుండెలో ఫల్లాలునాటి
నిజం చెప్పిన వానిపైనే
నింద నారోపించినావు—
ఈగలను డేగలను చేసి
ఇంద్రజాలం చేయజూచి
ముక్తశాంతికపోతముల గళ
ములను తెగ కోరికించుతావా?
దుష్టశక్తుల కూడదీసి
దురాశోన్మత్తులనుచేసి
కత్తి గట్టించితివి ధర్మజ
గత్తు పైకో అపరశకునీ !
మోసపోయిన జగతి నీ విక్ర
తాశయాల్ పసిగట్టినాది
మోసకారీ ! నీ సహజమౌ
ముఖము ముందర పెట్టినాది
సభ్యలోకము నింకనైనా
మభ్యపెట్ట తలంచకోయి
పంచశీలాకాశ గంగా
భ్యంచితస్నాతుడవు కావోయ్
మారణానికికాదు నవ ని
ర్మాణమునకై పోటిపడవోయి
శాంతి సంక్షేమార్ద్రపవనో
చ్ఛలల్లోకము చూడ పదవోయి.



*కవిత్వంలో సంభాషణ :*

# కవితాప్రపంచం

*దాశరథి* మనిషి పెదవులు కదలినప్పటి
మాటలో ఆలోచనా నది
అది జనించినవాడ, మరి అది
కదలిపోయినజాడ, దానికి
మధ్య ధారాసదృశమై కవి
తా ప్రవాహం నడచినడచీ,
వేనవేలేడులుగ ఆగక
అమృత ఝరివలె అవిచ్ఛిన్నమ్మై
మహామేధావుల మనస్సుల
పొలాలందున సస్యవృద్ధిని
సలిపి, నాగరికతకు ప్రాణం
పోసి మనిషిని మనిషిజేసే
మరి సుగంధసునిగ మలంచీ
మనోలోకంమీద పెత్తన
మును పరాసరిగ ఒనర్చీ
చీకటిని దీపాలు పెట్టీ
దుఃఖమున ఆనందమిచ్చీ
చావులో అమరతను కూర్చీ
సాగిపోతున్నాది—నేదో,

*నారాయణరెడ్డి* ఈనాడు కవిత
జ్యోత్స్నాసౌధనివాసిని
పూలుపొదిగిన పాలదారుల
పొంగివడిచే రాచపడుచు
అసూర్యంపశ్య - అమృతసహోదరి
మరి గత సహస్రాబ్దాలముందు
మానవుని వైపివిక దశయందు

కవిత - నేటి భిల్లాంగన
జారిపడ్డ వత్సరాల పుటలను
తీరికగా తిరగేసి చూస్తే
కానిపిస్తుంది కవిత,
కదలని పాలవెల్లివంటి యువతి.
నిప్పుతో నేస్తంచేసే కళ్ళు
ముళ్ళను ముద్దిడుకునే కాళ్లు
తరుచ్ఛాయాపరిష్వంగంలో
మెలికలువడ్డ మేను.
సెలయేళ్ళకు గమనంనేర్పే చిత్రమైన పరుగు
తరగెత్తిన రక్తంలో తరలే మధువు నురుగు
గాలివలె తరంగాళివలె
నియతిలేని ప్రగతి
యతిలేని గతి

*దాశరథి* విజాని కదే ఛందం
కవిత్వానికదే అందం
అసలు గుండెచప్పుడే ఛందం
అదేమృదంగం వాద్యబృందం
సంగీతమంతా కలిసి
నాట్యంకూడా కొంత బలిసి
వాటితో అర్థాలు చేతులు కలిపి
త్రిపుటియై కవితా స్వరూపం దిద్దుకొన్నవి
ఆఫ్రికా కారడవులందున
అల్లనాటి అశాంతి ఢంకా భాషణంలో
కవిత నృత్యం దివ్యగాంధర్వం స్ఫురిస్తాయి.
వీటి సంయోగాలు, వియోగాలు
కవిత కొక ఆకృతిని కూర్చాయి
నృతిగీతీ సంయోగాలు
యతిభీతిని కవితకు కల్పించాయి.

గతిరీతినికూడా అందించాయి
ఎగిసిపోయే రామచిలుక 'గతి'
దానికి పసిడి పంజరం 'యతి'

నారాయణరెడ్డి చిలుకలకు స్వర్ణపంజరాలు
ఊహలకు నియమశృంఖలాలు
ఇవి నేడు - మరి నాడు -
కల్పనాలోకంలో తొలిసారిగా
కమలమిత్రుడు పొడిచినప్పుడు,
మూగతనపు మంచుపొగల
మొగాలు దిగాలుపడినప్పుడు,
వాగర్థాలవలె బ్రతికిన
క్రౌంచపక్షుల కవలోంచి ఒకటి
కిరాతకుని శరాగ్రానికి
గురియై పడిపోయినప్పుడు,
ఎవరో ఒక మహామనస్వి
హృదయగహ్వరాన్ని చీల్చుక
దూకిన శోకప్రవాహం
శ్లోకమై పోయినప్పుడు,
ఆ శ్లోకం మహాకావ్యానికి
అమృతనాంది యైనప్పుడు
జడజగత్తు చైతన్య రసస్నపితమైన యపుడు,
శిలలు మాటలాడినపుడు
చెట్లు పాటపాడినపుడు
అవనిపైకి జాహ్నవియై అవతరించినది కవిత

దాశరథి కవితను గంగానదిగా కల్పనచేయడం బాగుంది
భావధార భాగీరథికి పర్యాయపదంగా ఉంది.
గగనగంగ అమాంతంగా
జగతిపైకి విరుచుకపడితే

లోకమిలా ఉండేదా ?
శంభుడు తన శిరస్సుపై
జాహ్నవిని నిలిపినట్లే
నిరంకుశ భావధారలకు
నియమాలు అవసరమేమో ?

నారాయణరెడ్డి అమరగంగ శివశిరస్సు
కలంకారమైనట్లే
నిసర్గకవితకు నియమం
నిండుతనం కూర్చాలి
అలాగాక కేవల నియమాళులు కవితాలక్ష్మికి
అయశ్శృంఖలాలంక్రియలై పోవునుగాదా ?

దాశరథి కవితను విల్లాంగననగా
గగనస్రోతస్వినిగా
పోల్చగ నా స్మృతిపటాన
నిల్చెను నేనన్న నుడులు
దూరాన పొడిగాలి దెబ్బలకు
తునాతునకలై పోయిన ఆకులతో
మునలిమొహం పడిన వృక్షం మీద
యౌవనం చిగిరించడం కవిత్వం
రోజూకనపడే నక్షత్రాల్లోనే
రోజూకనబడని కొత్తదనంచూచి
రోజూపొందని అనుభూతి
పొందడం అంటేనే కవిత్వం
మనసు మల్లెపొదల్లోంచి
పసందైన వాసనలు పీచి
అవి పద్యాల సీసాల్లో
అనంతకాలం నిలిస్తేనే కవిత్వం

నారాయణరెడ్డి అవును కవిత్వమంటే మాటల
అందాలప్రోవే కాదు
అవును కవిత్వమంటే విలువు
టస్దాల మిహాలే కాదు
ఆత్మవంటి దేదో శక్తి
అందులో ఇమిడి వుండాలి.
ఆత్మ ఉన్నతమైతే తప్ప
అమరత్వం సాధ్యం కాదు
అమృతత్వ ఆమ్రేడిత
మంటాను కవిత్వాన్ని నేను
అణువులోన నిద్రించే
అంతర్జాతీయత్వాన్ని
ఆలోకించి చీపుదప్పే ఆర్షదర్శనం కవిత
పరమాణువు ముఖంలోన తెరచుకునే మరణదంష్ట్రల
మాటలతో కరగించే మహామంత్రం కవిత
బురదలోన బ్రతికే కుమ్మరిపురుగుల లేవనెత్తి
బంభరాలుగామార్చే బ్రహ్మత్వం కవితలో ఉంది
సమాజంసాంతం మూఢత్వపు
సారామైకంలోపడి
తూలుతుంటే జాగృతి దీ
పాలెత్తుతుంది కవిత

దాశరథి కాదామరి, శబ్దశక్తి
కేది విలుస్తుంది ఎదుట ?
మనసులోపలి కొండలను చెండగల మాట
మనిషిలోపలి దౌష్ట్యమును ద్రుంచగలమాట
హిమగిరీంద్రమునెక్కి ఎగిసిపోగలమాట
అమృతభాండము దెచ్చి అందించగలమాట
రాక్షసుని గుండెలో రాతిని ద్రవింపించి
భిక్షువుకు బ్రతుకుపై ప్రీతి కల్పించి

కత్తులకు తలవంపు కావించి, క్రొంబూల
గుత్తులకు రాగసంపత్తి కోడించి
రణదాహఘోరతాపమున బీడైయున్న
మనిషి మేధాభూమి మరల పండించి,
లోకము సుధాఝరానీకమై తీయనోట
కురియించినటుల యీ ధరణిని మలంచి
లంకగా గాక కైలాసమ్ముగా జగము
రాణించునటు పునారచనజేయును కవిత

నారాయణరెడ్డి

సహారాలో సలిల స్వర్గం
శూన్యమనుకుంటున్న గగనసౌధానికి
చుక్కలకంకరతో చెక్కినమార్గం
చీకటి ఖంజర్ల పోట్లతో
చిరిగినలోకం గొంతుకలో
చిరువెన్నెల ప్రాణభిక్ష
శిశిరాత్ముల పశువాంఛాత్యప్తికి పశమై
వసనాలను పోగొట్టుకున్న
కాలమనే బిచ్చకత్తె మానరక్ష
దాస్యపు నల్లమందు మింగి
తరాలకొద్ది గురక తీస్తున్న
తమోవాసుల జాడ్యకుడ్యాలను
పగులగొట్టే వజ్రహస్తం
పిరికితనం వారసత్వంలా
సంక్రమించిన శరణాగతుల
పిల్లిగొంతులలో సాహస
భీషణ మర్దలఘోషలు
పెకిలించే శంఖస్వరం -
ఇదే కవితా ప్రయోజనం
ఇదే నవతా భాజనం

దాశరథి

మాట్లాడని మల్లెమొగ్గమాదిరిగా సాగి
నిశ్శబ్దం ఎరుగనట్టి విమ్మనగవలె తూగి
చేదగు కన్నీటిబొట్లు చిందిన చప్పుడులు విని
వాదింపగరాని మనసు పరివాదినిలో తుగని
మూగి పుస్తకాలలోని రాగాలను పాడి
గాలివోలె కనిపించే ఆలోచన వాడి
తలఉవాల్చిన ప్రజాగళాలను
పలికిస్తాడు కవి
కదలలేని యెదనెమళ్ళను
కిళ్లువిప్పి ఆడిస్తాడు
మెట్లులేని మేడమీద
మేలి నీలిముసుగుతీసి
నవ్వే అందాల తరుణిని
నవశారద విశారదిని
నవనీతంలా అరచేత
అవతరింపిస్తాడు కవి

నారాయణరెడ్డి

అంతేమరి కవిశక్తికి
అంతంటూ ఎక్కడిదీ?
సాధారణ మానవుడు
స్ఫటికం లాంటివాడు
ప్రక్కరంగులకు లోబడి
వ్యక్తిత్వం కోల్పోతాడు
కవిమాత్రం సూర్యునితో
నిశ్చితంగా పోల్చవచ్చు
ఏడు రంగులను జీర్ణించుకొని
ఏకవర్ణం చిమ్ముతాడు
చెదిరిదిన్న హృదయంతో
మసిబట్టిన మనస్సుతో

మాటలు గిలికేవాడు
ఏనాటికి కవికాడు
పరులబాధ తనబాధగ పంచుకొన్నవాడే కవి
పరులసుఖంలో శిరస్సు పైకెత్తినవాడే కవి
పుచ్చపూలు గచ్చపొదలు జిల్లేడులు పల్లేరులు
కవికలం సోకితేనే కల్పవృక్షాలవుతాయి.
తుహినాచలశిరంనుండి తురగలించే జలపాతాలు
కవిగుండెలో విద్యుత్తును కల్పించకమానవు

*దాశరథి* జలపాతంలో వినబడు
విద్యుత్తు గుసగుసవలె
కవిమనస్సులో ఏవో
భవిష్యత్తు మాట లుంటాయి
కోతిని మనిషిగా తొలచిన
కాస్మిక్ - రేడియేషన్ బలమే
కవికలంలో చొరబడి
మనిషిని దేవతగా మలుస్తుంది
మూలపదార్థాలకోసం
వేలేళ్ల తపం చేసిన
శాస్త్రజ్ఞుని వోలె కవి
శాంతికొరకు తపిస్తాడు
భూమిని చుట్టిన జలనిధి
పోలిక శాంతిని పెంచి
యుద్ధాన్ని అరెస్టుచేసి
మరణశిక్ష విధిస్తాడు

*నారాయణరెడ్డి* జగత్తులో ఏమూలో పొగచూరిన
నరజాతుల పీపులపై విరుగుతున్న
వెండికొరడా నీడల్ని చూస్తే
కవికళ్ళలో ఎర్రదాళ్ళు
శివతాండవం చేస్తాయి.

పచ్చిగడ్డిలా పెరిగిన పల్లెవాళ్ళపై
ఆకాశంనుంచి రాకాసులు అగ్నివర్షం కురిపిస్తే
కవిశిరస్సును చీలుస్తూ ప్రతినాదం ఎగుస్తుంది
అరసెకండుమాత్రం వెల్గి
మరణించే విద్యుల్లతలకు
రాత్రి సాంతం జీవించే పౌరసత్వ మివ్వడం,
మనస్సులకు మత్తెక్కించే
మల్లికా పరిమళాలకు
కనులకుగారడీచేసే కమనీయాకృతి కల్పించడం
కవికిమాత్రమే సుసాధ్యం

*దాశరథి* ఆలోచనలంత లేతవైన అంగుళుల కొసలు
స్పర్శింపగలేనంతటి పల్చని అర్థాల ఒడలు
కోర్కెలుచుంబించలేని కోమలి ఆశల పెదవులు
గగనము మాత్రమె దర్శించగల విశాల మనస్సులు.
ముసలి భాస్కరునిచూపుల మసకలలో తప్పిపోయి
కనిపించని కాలాంశం కవికి కవ్విస్తాయి

*నారాయణరెడ్డి* చండకరుని కుపిత దృక్కులు
చంద్రుని సుధాస్నపిత వాక్కులు
శర్వరీ వినీల హస్తసంచాలిత తాళవృంతాలు
నవ్వులూ, కన్నీళ్లూ
మల్లెల మళ్లూ గులాబి ముళ్లూ
అన్నీ ఏకకాలంలో
అగుపిస్తాయి కవిదృష్టికి

*దాశరథి* శిశిరర్తు విషవాయుఘాతాలకు ఒడలిన
వనాంతర నగ్న తరుహాసం
జీర్ణకుటీ విశ్శబ్ద కోణాన
కళామూర్తి మృత్యునిశ్వాసం
రుద్రవీణా తంత్రికల చప్పుడు
యువాంగనా నయనరాగంలో

అశ్రుదీపికా జ్యోతిఃఫలకం
రుద్రవీణలో అశ్రుదీపికలు
అశ్రుదీపికల రుద్రవీణలు
ప్రతిఫలించడం ఒకేచోట
అదెచ్చట ? కవిగుండె పీట.

నారాయణరెడ్డి
పరిమళాలను పులుముకొన్న
తరళకాంతి తరంగాలు
ఆకృతులను మలచుకొన్న
అమృత వీణాస్వరభంగాలు
పవనసహాయం లేకుండా
ప్రవహించే ప్రసవనౌకలు
ఇందుకాంతిలో ముఖాలు
కందని తామర రేకులు
ప్రియురాళ్ళు విసిరేచూపుల రాళ్లు
వేదాంతం వడ్డించే ముసలివాళ్ళు—
అనంతముఖాలుగా ఉన్నలోకం
ఐక్యరూపంలో కవీంద్రుని
మొదటితెరపై కదలిపోతూ
పిదప లోకులముందు విల్చును

దాశరథి
ఆద్య కవితాయుగం ఒక ధృవ
మైన నవ్యకవిత్వమొక ధ్రువం
అపుడు మతమూ మాంత్రికత్వము
సాంఘికప్రాసంగికము, లయ
బద్ధవృత్తి, ఎవో అకారణ
వాదముల ప్రాబల్యములు మరి
మన ధృవం శాస్త్రీయమైనది.
ఇందు ఆకుకు పోకకందని
వేమి అక్కరలేదు స్వచ్ఛమ్మైన
భావప్రకటనమ్ము.

కేవలోద్వేగమ్ముచే మలినీకృతమ్మగు
వాస్తవమ్ములు లేవు ఇచ్చట
గణితశాస్త్రంతో ప్రపంచం కొలికదిపే
శాస్త్రధ్రువమిది - ఇచట కవితా
మార్గమొక భిన్నగతినందెను.
నే దగాధాయోమయత్వము
నేడు అస్పష్టాతిరేకము
పనికిరావు, మనోమహత్వం
దానితో జోడింపగా ప్రాపంచికత్వం కావలెను

నారాయణరెడ్డి ఔనౌను. లోకంపోకదే భిన్నమ్ము నాటికి నేటికీ
ఈనాటి గణితం, శాస్త్రరీతీ
పీటికందని అనిర్వాచ్య స్వచ్ఛమానసలోకవీథుల
విమానమ్మై ప్రయోగించే కవిత్వానికి నమోవాకం
సుధాఘంటలు మ్రోగి మానసపథాలందున
సమరఘోషలు సమసి కల్యాణోద్యమం వ్యా
పించి లోకం నాల్గుదిక్కుల
సమతకవితను ఆడపడుచై,
అమృతమానవతా రహస్యం
అందరం ఆస్వాదనం కావించి,
మనిషికీ ఆదర్శమునకూ
రాగబంధుత్వమును కూరిచి
సాగిపోదము లోకకల్యా
ణాగమమ్ములు పాడుకొంటూ
సాగిపోదము మహాకావ్య
స్యందనమ్ములు వాడుకుంటూ
సాగిపోదము సాగిపోదము

(ఆలిండియా రేడియో నుండి జూలై 8 వ తేదీనాడు 'రసమయ'
కార్యక్రమంలో ప్రసారితమైనది)



వ్యాసము

# చేమకూర కవి చిత్రించిన ఉలూపి

—శ్రీ ఎం. కులశేఖరరావు

తంజాపురాంధ్ర నాయకరాజుల కాలంలో బయలుదేరిన ప్రబంధాలలో చేమకూర వేంకటకవి రచించిన విజయ విలాసం ఉత్తమశ్రేణికి చెందినదనే విషయం సర్వపండిత విదితమే వేంకటరాజు అవలంబించిన రచనాశిల్పం, వర్ణనా నైపుణి, అన్నిటికిమించిన పాత్ర చిత్రీకరణ ఈ ప్రబంధానికి యింతటి విశిష్ట స్థానాన్ని సమకూర్చినవి రచన, అలంకారాన్వితవర్ణన, శయ్యా విధానాలలో ఈ కవి వసుచరిత్రకారుని ఆదర్శంగా గ్రహించి తనప్రతిభా పాండిత్యాలను సాయంగా తీసుకొని కావ్యనిర్మాణానికి పూనుకున్నాడు ఇక పాత్రపోషణలో విభిన్న మార్గాన్ని అవలంబించినాడు ఇందు ఈయన అనుసరించిన రీతులను పరిశీలిస్తే, పూర్వ ప్రబంధాలలోని పాత్రలకు వైవిధ్యం కలిగిన పాత్రలను సృష్టించడానికి ప్రయత్నించినట్లుగా కనిపిస్తుంది పూర్వ ప్రబంధకవులు పాత్రలను కేవలం వర్ణించడానికే పూనుకున్నారు వారి ప్రతిభాయుతమైన వర్ణనలు కావ్యాలకు సౌరభాన్నే సమకూర్చినా, పాత్రలు స్వయంగా చైతన్య వంతములు కావేమో ననిపిస్తుంది వేంకటరాజు మార్గం దీనికి భిన్నమైంది పాత్ర ప్రవేశానికి తాను చేయవలసిన వర్ణన క్లుప్తంగా ముగించి, ఆ వ్యక్తి మన స్తత్త్వాన్ని సంభాషణ ద్వారాకాని, స్వగతంతోగాని పాఠకులకు వ్యక్త మయ్యేట్లుచేస్తాడు ఇది ఒక ప్రత్యేక పద్ధతి

విజయ విలాస కథకంతకూ ఆధారములైనవి నాలుగు పాత్రలు నాయకుడు అర్జునుడు నాయికలు ఉలూపి, చిత్రాంగద, సుభద్ర. ఈ నలుగురిలో కథా పూర్వభాగంనుండి చివరివరకు అర్జునుడు వ్యాపించి ఉన్నాడు ఉలూపి, చిత్ర, సుభద్ర క్రమంగా తమ పాత్రలను నెరవేర్చి అదృశ్య లవుతారు. ఒకే కావ్యంలో ముగ్గురు నాయికలున్నా వారి శీల చిత్రణలో చాల జాగ్రత్త వహించి యీ కవి వారిని మూడు విధాలుగా చిత్రించినాడు నిజానికి నాయకుని పాత్ర పోషణకన్నా, నాయికలను రూపింపజేయడంలోనే కవి అధికమైన శ్రద్ధను కనబరచినా డని చెప్పవలసి ఉంటుంది.

నాయికా త్రయంలో క్రమాన్ని అనుసరించేకాక బుద్ధి చాతుర్యాల్లోను, అందంలోను, నాయకుణ్ని తనవైపు ఆకర్షించే శక్తియందునూ, ప్రథమ ఉలూపి అందుచేతనే బ్రహ్మచర్య దీక్షతో పుణ్యస్థలాలను దర్శిస్తున్న మహావీరుని అర్జునుణ్ని అవలీలగా ఆకర్షించింది గంగానది సమీపంలో హిమధవళ సైకత తలాల్లో విహరించే అర్జునుణ్ణి ప్రప్రథమంగా దర్శించింది నాగకన్య ఉలూపి కైవసం చేసుకొని, ఘన నిభాంగుడూ అయిన ఆతనివైపు ఆకర్షితమైంది ద్రౌపదీ స్వయంవరానికి వెళ్ళివచ్చిన కామరూప భోగులవలన అర్జునుని గాంభీర్యాన్ని గురించి విన్నదికాబట్టి తనబుద్ధి కుశలతచే ఆ కనిపించినవాడు అర్జునుడే అని ఊహించుకొన్నది ఆ మహావీరుణ్ని సన్నిహితంగా దర్శించాలనే అభిలాషతో సమీపించి మాయాన్వితమై అతనికి తెలియకుండానే 'కోరికలు తేటలు పెట్టగ, పెడుకళ్ళదిండొత్తుకొనంగ, అచ్చెరువు తొంగిలి రెప్పల పీగనొత్తగా, బెట్టిగ పంపెదియక' ఆ మహావీరుణ్ణి అలా విభ్రమ్ముగేక్షణ వీక్షించింది ప్రథమ దర్శనం, తద్వారా పరవశం - రెండూ కలిగినవి నాయికకు ఆమెకు ఇటువంటి అవస్థ కలిగినందులో ఆశ్చర్య మేమీలేదు ఆమెను అద్భుత మిచ్చిన ఆ మహావీరుడు సామాన్యుడా మరి! పరిశీలించి చూస్తే 'రాకొమరు కెరులు నీలపు రాకొమరు నిరాకరించు, రాకానందునిని రాకొట్టు సుగమము - పగములు - రంజింగురాకు గని పరాకుచేయు ఉత్రిపి పంఖంలోని కెమ్మలపంటి ఆ గరహాసం, ఆపుతలమీగ ప్రసరించే 'అత్యాదర శీతలేక్షణ సుధారసధార' చూచే వారికి సంతోషాన్ని కలిగించే ఆ కళామహి నిజంగా ఆ ముఖం చంద్రునితో సమానమైనదే గంభీరమైన గళరేఖ గంధాన్ని ఊపిరి పోసినట్లుగా ఉన్నది కన్నోమల శిఖరి శరాసనాలను వాదులు ఒట్టుపెట్టినవి ఇట్టి పిరబిలాస సంపదతో ఉన్న యీతనికి ఏ రాజు సరిరాడు అందుచేతనే "నా హృదయ మమ్ముకచెల్ల" దీనికి అని నిశ్చయించుకొన్నది ఉలూపి ఈ మహావీరుణ్నిపొంది 'నాకలోకంబు వారికైన లేని - అలఘుతర భాగ్యాన్ని' పొందడానికి ఆమెమనస్సు ఆందోళన చెందింది

కాని ఒక సందేహం—ఇరువైపులనుండి ప్రేమానురాగా లుంటేనేగాని సక్రమ పర్యవసానం కలుగడానికి వీలులేదు ఉలూపి మనస్సున కలిగిన యీ ప్రేమాంకురాన్ని అర్జునుడు లేశమాత్ర మైనను ఎరిగినవాడు కాదు కనీసం ఆమె అతిలోక సౌందర్యాన్ని గుర్తించికూడ ఎరుగడు కలిగిన సంచలనమంతా ఒకేవైపు వేరొకవైపు, నిశ్చలతతప్ప మరేంలేదు అందుచేతనే సవ్యసాచి నిశ్చింతగా జపతత్పరుడై ఉన్నాడు పరిస్థితిని చక్కగా పరిశీలించింది ఉలూపి.

నాగలోక కన్యలకు సహజంగా సమకూడిన చతురత్వ ముపయోగిస్తేనే తన కోరిక సఫల మవుతుందనే విషయాన్ని గ్రహించింది నాగరాజ తనయ మాపటి వేళ అందరు విశాకులై యుండగా ''ఇటు జయించిన న్విడుతునే నేనిక'' అంటూ సాహసించి 'ఆ యామినీవిట కులశేఖరుని' మాయ అచ్చుపడగా తన నగరికి చేర్చింది సాహస మేమోచేసింది! కాని పర్యవసానం ఎట్లా ఉంటుందో ? అతడు తన కోరికను నిరాకరిస్తే తాను పడినశ్రమ అంతా వృథా! మనస్సు ఆందోళన చెందుతోంది పరిస్థితి అంబాకవస్తే తట్టుకోగల ధైర్యం లేకపోలేదు

ఏమీ తెలియని పాకశాసని ఎప్పటివలెనే జపంచేస్తూ కన్నులు తెరచి చూచినాడు 'ఈ నెలరాలజగతి' 'కపురంపుఁదావి' 'పసిడియుప్పరిగ' 'అలరుల పాన్పు' 'మిసిమి కెంపులకాంతి' అతనికి ఆశ్చర్యాన్ని కలిగించినవి ఏదో మాయ జరిగిందనుకొన్నాడు కొంచెం తేరుకున్నాడు ఎదుటనే'జఅపులగు నెల్లనొజ్జ'యైన మనోహరి, భుజగగామిని కనిపించింది అప్పటి పరిస్థితులు అర్థంకాలేదు నరు నికి ఇది 'మాయా నటనంబో, గంగా ఘటనంబో' అని యెంచినాడు అసలు సంగతి తెలుసుకోవాలనే కుతూహలంతో గంభీరంగా 'వధూమణి, యెవ్వరి దాన ఏపు, ఏరెయ్యది ?' అని ప్రశ్నించినాడు ఉలూపి నిరీక్షిస్తున్న సమయం చివరి కానన్నమైంది ఈ తరుణాన్ని వదలుకుంటే తాను పడినపాట్లన్నీ వృథా కావచ్చుననే సంగతి ఆ నాగకన్యకు బాగా తెలుసును ఏన ప్రవర్తనలో, తన చాతుర్యాన్నంతా ప్రవేశపెట్టి ఆ మహానాయకున్ని ముగ్ధుణ్ని చేస్తేనే తాను పడిన శ్రమకు ప్రతిఫలం లభిస్తుంది కాబట్టే, ముంచుకొని వస్తున్న సిగ్గుదొంతర లను గూడ ఆవలికినెట్టి తన వేషంలో అతి విచిత్రమై ప్రత్యేకమైన ఒక వైనాన్ని కనబరచింది 'మేలి పసిండిగాజుల సమేళపు బచ్చల కల్కడింపు డాకేలు మెఱుంగు గబ్బిచనుగ్రేవకు' దార్చినది, తన సౌందర్యమంతా ఆవిష్కణా ల్గోంచి కనిపించే విధంగా నిగకన్నులతో ఆ మహావీరుణ్ని ప్రత్యుత్తర మీయ డానికి తిలకించింది ఇంతటి ప్రయత్నానికి ఎంతటి కురుపీరుడైనా కరిగిపోక నిలుస్తాడా యిక ! ఈ విధంగా సానుకూల వాతావరణాన్ని ఏర్పరచుకొని అర్జునుని ప్రశ్నకు ప్రత్యుత్తర మీయడానికి పూనుకొన్నది ప్రవర్తనలో ఇంతటి శ్రద్ధ చూపించడం ఉరగాంగన ఉలూపికే తెలుసు ఈ గాఢమైన పరిశీలన వేంకటరాజుకే చెల్లుతుంది

ఇక తన వృత్తాంతాన్ని తెలియబరుస్తూ ఉలూపి 'ఈ జగంబు పాతాళము, నే నులూపియనుదాన, భుజంగమ రాజకన్యకన్' అని తన కులనామా

దుల నెరింగించింది పెద్దనార్యుడు వరూధినిచేత 'పేరు వరూధిని...' అని చెప్పించినట్లుగానే ఉన్నదీ స్వపరిచయం కాని వరూధినికన్న అధికృత ఉలూపిలో కనబరుస్తేనే వేంకటకవికి తృప్తి వరూధిని తనపేరు చెప్పి ప్రవరుణ్ని తన ఆతిథ్యం అంగీకరించ వలసిందిగా కోరుతుంది కాని యింత ప్రయత్నంచేసి ఆకర్షితుణ్ని చేసిన అర్జునుణ్ని కేవలం తన ఆతిథ్యాన్ని అంగీకరించమని కోరితే లాభంలేదని ఉలూపికి తెలుసు అందుచేతనే తరుణాన్ని మించనీయక 'సరిలేని విలాసముగని వరియిం చిట దోడికొనుచు వచ్చితి నిన్నున్' అని తన అభిప్రాయాన్ని స్వచ్ఛంగా వెలిబుచ్చింది 'కటాక్ష లవలేశముననే ముల్లోకాల మోహింపజేసే నీవు మన్మథునికన్నా అధికునివి కాబట్టి అనుగ్రహించి దృడాంకపాళిని నన్ను చేర్చుము' అని ప్రార్థించింది

'మాయా నటనంబో, గంగా ఘటనంబో' అనుకొంటూన్న అర్జునునికి పరిస్థితి అర్థమయింది ఎంత గాఢంగా ప్రేమించకపోతే జవంలో నిమగ్నుడైన తనను ఈ పాతాళానికి తీసుక రావడానికి సాహసిస్తుంది ఉలూపి 'రూపవిభ్రమ రేఖాఖనులు నాగకన్యలు' అని ఇదివరకు విన్నది ఇపుడు ప్రత్యక్షంగా కనిపిస్తున్నది ఎదుటనున్న ఆ ఎలనాగ అసామాన్యురాలాయెను మరి! ఆమె మొగము 'వెన్నుని యన్న న్నను జయించె' అట్టుగా ఉన్నది సౌందర్య పూరితములైన ఆ కన్నులు నలినాసన్నములే' 'నువ్వుబువ్వు నవ్వు జవ్వని నాసిక' 'మబ్బు నుబ్బు గెబ్బు బిబ్బోకవతి వేణి' ఆ మహావీరుణ్ని ముగ్ధుణ్ని గావించినవి 'మదిమెచ్చినాడు' ఆ యింద్రసూనుడు తన్నుతాను పరీక్షించుకొన్నాడు ఆకన్య ప్రార్థనను నిరాకరించే పరిస్థితిలో తాను లేడు అనే విషయాన్ని గ్రహించినాడు కాని యింత త్వరగా ఆమె ప్రార్థన నంగీకరిస్తే తనకేం గౌరవం? పైగా తాను తేలికైపోతాడు ఇచ్చటే ఆయా మనస్తత్త్వాలను చిత్రించడంలో చమత్కరించినాడు కవి

ప్రత్యుత్తరానికై నిరీక్షిస్తున్న వడతితో 'అకాముకుడనై, వ్రతినై భూప్రదక్షిణము సేయబోయే నన్ను ఇలా తీసుకరావడం న్యాయమేనా' అని ప్రశ్నించినాడు ఈమాట వస్తుందని ఉలూపి ఎఱుగనిదికాదు అర్జునునిలో తాను చేసిన పనికి కొంత ప్రాతికూల్యం కనిపిస్తున్నది అతణ్ని తన వానిగా చేసికోవలెనంటే మరొక్కమారు తన సామర్థ్యాన్ని ప్రయోగించవలె. అందుకే మోమున 'మొలక నవ్వొలయగ' తన సౌందర్య భరిత రూపపు తళుకులను లీలగా ప్రదర్శించి సంభాషణ కుపక్రమించింది 'నిను గీతి సాహితీ మోహన

వాణులు చెవులువట్టి ఆడిస్తున్నారుగదా! నీవు కాముకుడవు కానంటే నమ్మక మేమిటి? నీ అసమానమైన విలాసరేఖాకృతులతో త్రిభువన లీలావతుల నలయించుటేనా నీ వ్రతధర్మం!' అని ఎదురు ప్రశ్నించింది 'నీవు ద్విజార్థం ధర్మజుని పాన్పుటింటిలో ప్రవేశించడం, తత్ప్రాయశ్చిత్తంగా భూప్రదక్షిణం చేయడానికి పూనుకోవడం, తెలియనిదానగాను' అని తన పరిజ్ఞానాన్ని వెల్లడించింది 'వెఱకు విలుకాని వారికి భయపడి నీ మరుగు చేరినాను నన్ను పరిగ్రహించి రక్షించుము క్షత్రియులకు ప్రాణ రక్షణముకన్న ధర్మమున్నదా' అని తన ధర్మ సూక్ష్మతను ప్రదర్శించింది 'ఇదివరకు నీవు శుల్కంగా మత్స్య యంత్రాన్ని తెగవేసి ద్రౌపదిని చేపట్టలేదా, ఇపుడు అంగభూపతాకాయత యంత్ర మత్స్యాన్ని ఖండించి నన్ను ద్వితీయగా పరిగ్రహింపుము' అని బ్రతిమాలింది

అర్జునుడు నిరుత్తరుడైనాడు కాముకుడను కాను, వ్రతిని అనే అవరోధాలను ఇట్టే తొలగించింది ఉలూపి పైగా తన శాస్త్ర ధర్మాన్ని బోధిస్తున్నది ఆలోచించినాడు చక్కని ఉపాయం తట్టింది 'సమస్తము నెఱిగిన వలతివిగదా పరసతి నెనయుట రాజులకు ధర్మమా? ఈ అనుచితము తగునా' అని తన పాపభీతిని వెల్లడించినాడు అన్ని తెలిసిన సుహాపురుషు కేవలం తన్ను పరీక్షించవలెనని యీ విధంగా అన్నాడనే విషయాన్ని గ్రహించడంలో చతురమతి ఉలూపికి చాలాసేపు పట్టలేదు 'నృపపుంగవ! అన్నిట జాణవు ఒక మాటలో సూచితమైన మర్మ కర్మములు తెలియులేదా? అయినా, కన్నియ గాని వేరొకతెగాను, మనోహరరూప!' అని తన వాస్తవ స్థితిని తెలిపింది 'నీకు నే జన్నియ వట్టియుంటి బుజ్జిపాపనుంచియు నేటిదాక, నా కన్నుల యాన, నా వలపు కస్తురి నామముతోడు, నే చెప్పినది నిజము—ఇంకా నమ్మకపోతే నాకు అత్యంతావరణీయమును, ప్రేమపాత్రమైన నీమమోవి మధురామృతాన్ని అని బాసచేస్తాను' అని తన లోకిక వ్యవహార జ్ఞానాన్ని చూపి, యీ విధమైన ప్రమాణము ద్వారా మన కోరికలు తీరునవిగదా అని సూచ్యప్రాయంగా అన్నది నాగకన్య తాను అర్జునుణ్ణి గురించి విని చిత్రఫలకంమీద వ్రాసిన రూపాన్ని చూపించింది తనను చేపట్టమని మరోసారి వేడుకొన్నది

రాజుకు మరో ఆలోచన తట్టింది "నీవు ఫణిజాతికి చెందినదానవు నేను మానవుణ్ని అన్యజాతి ప్రవర్తించు టర్హమగునె? కాబట్టి యీ కోరికను వదలివేయి" అని చెప్పినాడు కాని దర్మసూక్ష్మాలను వల్లించి, లౌకికజ్ఞానాన్ని

ప్రదర్శించి తన సామర్థ్యాన్ని నిరూపించుకొన్న ఉలూపి యిపుడుమాత్రం ఊరు కుంటుందా ? తనకున్న పౌరాణిక పరిజ్ఞానాన్నంతా వినియోగించి "ఇట్లు విపరీతంగా మాట్లాడడం దేనికి? సూర్యవంశానికి మకుటాయ మానుడైన రాముని కుమారుని కుశుడు మా కుముద్వతిని వివాహ మాడలేదా ? పురుకుత్సుడు నర్మదఁ బెండ్లియాడడే ?"అని ఉద్ఘాటించింది "వెలివెట్టరే ఛాడబులు పరాశరు బట్టి దాశకన్యాకేళి తప్పుజేసి ?" అని వరూధిని వాదించిన ట్లున్నది యిది ఐతే ఈ రెంటికీ ప్రధానమైన భేదం ఒకటి లేకపోలేదు వరూధిని వాదన ఒకానొక పవిత్రుణ్ణి అవినీతికి ప్రేరణ చేయునది ఇక ఉలూపి తన్ను ద్వితీయ భార్యగా చేపట్టుమని బ్రతిమాలుతున్నది సామాన్య నాయికకును, ముగ్ధానాయికకును ఉన్న ముఖ్యమయినతేడా ఇదే అందుకే సామాన్యవాదన, వాదనగనే ఉండిపోయింది ముగ్ధ ఎదుటివాణ్ని ముగ్ధుణ్ణి చేసేదాకా వదలలేదు

ఇప్పటికీ కిరీటి చలించినట్లులేదు మనస్సులోని అభిప్రాయ మేమిటో తెలియదు పైగా ఉలూపి కోరికను ప్రతిఘటిస్తున్నట్టు కనిపిస్తున్నాడు అయోమయంలో పడింది ఉలూపి "ఇంతదూరం తీసుకవచ్చినానని కాబోలు నా కోరికను మన్నించక వ్యాకుల పెడుతున్నావు" అంటూ ఇక మాటాడ లేక పోయింది స్త్రీ సహజమైన ప్రకృతి ఆమెను ఆవరించింది ఆ అందమైన ముఖాబ్జంలో విన్నబాటు కనిపించింది గళంలో గాద్గదికం జనించింది చక్కని తెలి సోగకన్నుగవలో బాష్పములు గ్రమ్మినవి

ఎంతటి ధీరుడయినా స్త్రీ కన్నీటిధాటికి ఆగగలడా ! ఎదుట సౌందర్యరాశి కన్నుల్లోంచి బాష్పాలు వెలువడుతూంటే ఏమహావీరుడు మనస్సు దిటవుగా ఉంచుకోగలడు ? నలాది ధీరోదాత్త నాయకులే ప్రియురాండ్ర కన్నీటిముందు వాలిపోయినారుకదా ! ఇక అర్జునుడు వారి సామ్యంలో ఏపాటివాడు ? ఇంక పట్టుదల పనికిరా దనుకున్నాడు కురువీరుడు ఉలూపి అన్నట్టుగా తనకు స్త్రీ హత్యాపాతకంకూడ తగలవచ్చు అని భయపడినాడు పైగా ప్రథమ దర్శనంలోనే ఆ మోహనమూర్తికి తాను దాసుడై పోయినాడాయెను ఇంతవరకు వహించింది కేవలం నిబ్బరంమాత్రమే ఆలస్యానికి అవకాశంలేదు మౌనాన్ని విడనాడినాడు "చక్కెరబొమ్మ ! నా వ్రతము చందము దెల్పితి నంతెకాక, నీ చక్కదనంబుగన్న నిముసంబయిన న్నిలుపోవ శక్యమే యక్కునజేర్పక" అంటూ తన ఆంతర్యాన్ని తెలియజేసినాడు శుభ సంకల్పం ఏర్పడితే ఆలస్యం చేయకూడదు. కాబట్టి ఉలూపి కింకిణీగణవికస్వరసుస్వరములు వ్యాపింపగా

"వివాహ విధిజ్ఞుడయిన మీనాంకు డొనర్చినా డిది శుభైక ముహూర్తమర" మ్మటంచు నెచ్చెలి కరగ్రహణం చేసినాడు ఆమె కోరిక మన్నించినాడు.

ఈ విధంగా నాగకన్య ఉలూపి తనబుద్ధి నైశిత్యాన్ని ఉపయోగించి ప్రియుణ్ణి పొందడంలో సఫలయైంది తన కార్యసాధనకు ఒకసారి మాయో పాయాన్ని అవలంబిస్తే, మరోసారి వాక్చాతుర్యాన్ని ప్రదర్శించింది ఇంకోసారి తన లోకోత్తర సౌందర్యాన్ని చూపించింది వేరొకప్పుడు తనశాస్త్ర పరి జ్ఞానాన్ని ఆలంబనంగా చేసికొని ధర్మసూక్ష్మముల నుపన్యసించింది చివరకు కన్నీరు కార్చడంలోనూ వెనుకాడలేదు. ఇంతటి అపూర్వ చాతుర్యంగల నాయికలు కనిపించడం అరుదు అందుకే క్రమపరిణామపూర్వకమైన శీల చిత్రణ ఉలూపికి ప్రత్యేకతను సాధించిపెట్టినది ఇట్టి నాయికను సృష్టించి వేంకటకవి ధన్యుడైనాడు



కవిత

# సూటి ప్రశ్నలు

శ్రీ వేమూరి రామారావు

దూరాన బ్రహ్మాండ తీరానమున్న
చుక్క కన్నెల సొగసు లెక్కింతువేమొ
బాధతో నవ్యక్తభావాల గుందు
క్షతగాత్ర మానవుని వెతమాట యేమి ?

సూర్యాస్తమయవేళ సురుచిరారుణిమ
పాటలో వర్ణించి పాడగలవేమొ .
తీవ్ర బాధాకులిత తీక్ష్ణనేత్రాల
అరుణరేఖల నెట్లు విరచింతువోయి !

పండువెన్నెల నడుమ పసిడి దారులలో
చిఱు మినుక రేకలను చేరి లెక్కింతో
పీడితుడు తాడితుడు పేదమానవుని
కనుల నున్నట్టి నల్లని చారికలనో ?

అగణిత మజేయమౌ అచలమ్ములైన
గణియింప గలవేమొ గణిత సాధనల
నవజగతి నిర్మించునట్టి మానసుల
సంఘటిత శక్తులను సరిగ గణియింతో !





ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీ పెద్దారెడ్డిగారు తమ ఉపన్యాసము చదువుచున్నారు.



హిందీ ప్రచార సమ్మేళన సందర్భంలో ప్రేక్షకులు

# హిందీ ప్రచార సమ్మేళనము, హైద్రాబాదు

## ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసము

— శ్రీ మర్రి చెన్నారెడ్డి

*పూజ్యులగు రాష్ట్రపతిజీ ! సోదర సోదరీమణులారా !*

దక్షిణ భారత హిందీ ప్రచారసభ శాఖలైన హైదరాబాదు, ఆంధ్ర హిందీ ప్రచారసంఘముల సంయుక్త యాజమాన్యంలో ఈ సమ్మేళనాన్ని జరిపించడానికి నిర్ణయించబడ్డది రాష్ట్రపతిరాజేంద్రబాబుగారు ఈసమ్మేళనమును ప్రారంభించుటకు అంగీకరించారు. ఇది మనకు ఎంతో అదృష్టకరమైన విషయము హైద్రాబాదులో రాష్ట్రపతి నిలయం ఏర్పడిన తరువాత మొదటిసారిగా రాష్ట్రపతిజీ ఇక్కడికి వేంచేసినారు హైద్రాబాదు ఉత్తర దక్షిణదేశ సంస్కృతులకు కూడలిస్థలము.

ఈనాడు మనకందరికి ఎంతో సుదినము.

రాష్ట్రపతిజీ !

మీరు సర్వోన్నత పదవిని అధిష్ఠించి ఉన్నారు అంతేగాక మీరు భారతీయుల ఆకాంక్షలకూ, ఉత్సాహానికీ ప్రతిమూర్తులు ఈదేశంలో ఐక్యతనూ, పరస్పర సహకారాన్నీ, పరస్పర విశ్వాసాన్నీ సాధించుటకు మీ వలన ఎంతో స్ఫూర్తి కలుగుతున్నది పూజ్యులగు మహాత్మాగాంధీజీ నిర్యాణం జరిగిన తరువాత మీరు దక్షిణ భారత హిందీప్రచారసభ అధ్యక్షపదవిని స్వీకరించినారు దేశ పునర్నిర్మాణానికి అనేకరంగాలలో కృషి జరుగుతున్నది అన్నింటికీ మీ వ్యక్తిగతమైన సహాయం, మార్గదర్శకత్వం లభిస్తున్నది.

రాష్ట్రపునర్నిర్మాణము దేశంలో ఒక పెద్దసమస్య దాదాపు పూర్తిగా ఒక సంవత్సరంనుండి దేశంలో ఈ సమస్య ప్రజలను వ్యాకులపెడుతున్నది ఈ సమస్య కారణంగా అనేక కార్యక్రమాలు కుంటువడినవి గూడా దౌర్భాగ్యవశంవలన ఈ సమస్య తన సహజమైన హద్దులనుగూడా దాటి పోయింది. అవాంఛనీయమైన ఘటనలు దేశంలోని కొన్ని భాగాలలో జరిగినవి ఆ ఘటనలవలన ఆయా ప్రాంతాలకు గానీ, ఆయా ప్రాంతాలలోని ప్రజలకుగానీ ఏవిధమైన సహాయమూ లభించలేదు.

ఈనాడు మన దేశంలోని శాసనవ్యవస్థ, ప్రజాతంత్రవ్యవస్థానిర్మాణము మొదలగు వానిమీద భాషాప్రయుక్త రాష్ట్రవిభజనకు సంబంధించిన భావాల

ప్రాబల్యం ఏర్పడడం సహజమే మనం ఈనాడు కొన్ని విషమ పరిస్థితులలో నుండి ముందుకు సాగుతున్నాము. దేశనిర్మాణ పథంలో ఒకమూలవంపుదగ్గరకు చేరినాము మాతృభాషకు లేక ప్రాంతీయభాషకు వ్యక్తిగతజీవితంలో ప్రముఖస్థాన ముండడం స్వాభావికమే ప్రజాతంత్ర విధానంలో వ్యక్తిగత విశిష్టతకు మనం ప్రాముఖ్యత నిస్తాము కనుక భాషకు ప్రధానస్థాన ముండక తప్పదు విభిన్నమైన విశిష్టతలను ఏకంచేసి - సమన్వయపరచి విశాలమైన దేశవికాసానికి కృషిచేయడం మన పరమ కర్తవ్యం ఈ పనికి మనకు సామాన్యభాష చాలా అవసరం. దాని ద్వారా దేశంలో నలుమూలలకూ మనం పోగలుగుతాము ఇటు ప్రాదేశికభాషలనూ, అటు రాష్ట్రభాషనూ గుడ్డిగా అభిమానించేవారు ఈ మార్గంలో కొన్ని కొత్తసమస్య లను తీసుకొని రావచ్చును కనుక మనం ముందుగానే మేల్కొని ప్రాంతీయభాష, రాజభాష రెండింటి సమన్వయానికి కృషిచేయాలి అనాడే దేశంలో ఐక్యత స్థిరపడ గలుగుతుంది దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఇదేదృష్టితో గడచిన 38 సంవత్స రాలనుండి హిందీ వ్యాప్తికి తోడ్పడు తున్నది.

భారతదేశంలో 14 భాషలున్నవి. వాటిలోనుండి దేనినో ఒకదానిని మనం రాజభాషగా స్వీకరించాలి హిందీ మాట్లాడేవారిసంఖ్య దేశంలో ఎక్కువగా ఉన్నది. అందువలన ఆభాషకు రాజభాషకాగలగౌరవం దక్కింది ఆభాషలో ఏదో పెద్దవిశేష మున్నదని భావించడంవలన అది రాష్ట్రభాష కాలేదు ఒకభాష ఇంకొక భాష మీద సామ్రాజ్యాన్ని చలాయిస్తుందని అనుకోడంగూడా భ్రమ హిందీని సమర్థించే వారు ఈ విషయాన్ని ఎల్లప్పుడూ జ్ఞాపక ముంచుకోవాలి అనాడె వారు హిందీ వ్యాప్తికి దోహదం కలుగజేయ గలుగుతారు సంయోగవశంవలన హిందీ మాట్లాడే వారి జనసంఖ్య ఉత్తరదేశంలో ఎక్కువగా ఉన్నది అందువలన ఈభాషను ఉత్తర దేశం వారిభాష అనడంగూడా సంభవిస్తున్నది ఉత్తరదేశం దక్షిణదేశం మీద శాసనం చేయదలచుకొన్నదని ఇక్కడ కొంతమంది సందేహిస్తున్నారు. కొంత మంది బలహీనులకు - గుండె దిటవులేనివారికి ఇటువంటి సందేహం కలుగు తున్నది. వారు హిందీని వ్యతిరేకిస్తున్నారు పొరపాటు మార్గంలో పడిన ఆ సోద రులుగూడా నెమ్మదినెమ్మదిగా నిజస్థితిని గుర్తిస్తున్నారు. ఈ మానసిక పరివర్తనం తీసుకొనిరావడానికి దక్షిణ భారత హిందీప్రచారసభ చేసినకృషి ప్రశంసనీయమైనది. రాజభాషాకమీషన్‌వారు తమ నివేదికను సమర్పించబోతున్న సమయంలో ఈ సమ్మేళనం జరుగుతున్నది. దేశనాయకులైన శ్రీ బి జి ఖేరుగారి నాయకత్వాన ఆకమీషన్‌వారు దేశపరిస్థితులను గమనించి దేశాభివృద్ధికి ఉపయోగించే నిర్ణయాలను

చేయగలరు శ్రీ మోటూరి సత్యనారాయణగారు సభాధ్యక్షులుగా ఈరోజు మన మధ్యన ఉన్నారు. వివిధ భాషలను సమానస్థాయిలోనుంచి, వానిలో పరస్పరసహకారాన్ని పెంపొందించే మౌలికసిద్ధాంతాలను ఆ కమీషన్‌వారు విస్మరించరని మన మందరము సంపూర్ణంగా విశ్వసించవచ్చును. దక్షిణ భారత హిందీ ప్రచారసభ ప్రారంభమైననాటినుండి ఇదే విషయాన్ని బోధిస్తూ వస్తున్నది. శ్రీ సత్యనారాయణ గారికి ఈ సంస్థతోగల సంబంధం మీకందరికి తెలిసినదే

ఈ సమయంలో దక్షిణ భారత హిందీప్రచారసభ హైదరాబాదుశాఖ శ్రీసత్య నారాయణగారి వ్యక్తిగత మార్గదర్శకత్వంలో అత్యధికంగా ఉన్నతిని పొందగలదని నేను గట్టిగా చెప్పదలచుకొన్నాను శ్రీ సత్యనారాయణగారు మాశాఖయెడల విశేష మైన ఆదరాన్ని చూపిస్తూ ఉన్నారని చెప్పడంగూడా అనుచిత మనుకోను. అందు వల్ల ఈ సమ్మేళనంయొక్క అధ్యక్షపదవిని శ్రీ సత్యనారాయణగారు స్వీకరించడం ఎంతగానో ఉచితమైనపని

ఈ రెండురోజులు మనముందు చాలా కార్యక్రమా లున్నవి. సాహిత్యచిత్ర కళాప్రదర్శనము, ఆరుభాషలలో ఏకాంకనాటికల ప్రదర్శనము, విభిన్న భాషలలో కవిసమ్మేళనాదులు జరుగనున్నవి సంఘటనకు సంబంధించిన సమస్యలుగూడా మన ముందున్నవి ఆంధ్ర, హైదరాబాదు హిందీప్రచారసంఘముల సంయుక్త కార్య వర్గ సమావేశములు ఆ సమస్యల పరిష్కారానికి ఉపయోగించగలవు పరిసరవిచార వినిమయం వలన మంచి నిర్ణయములు జరుగగలవని నా విశ్వాసము

ఈ సమ్మేళనానికి దయచేసిన ప్రతినిధులకు, ప్రేక్షకులను కేవలం లాంఛన ప్రాయంగా స్వాగతం చెప్పడం నాకిష్టంలేదు. మా ఏర్పాట్లలో గల లోటుపాట్లను గురించి, లేక మీకు కలిగిన యిబ్బందులను గురించి క్షమాపణ చెప్పుకోవడంగూడా నాకు యిష్టంలేదు ఆహ్వానసంఘము ఉత్సాహవంతులైన కార్యకర్తల సహాయంతో లోటుపాట్లు లేకుండా ఉండుటకు అవసరమైన ప్రయత్నాలన్నీ చేసింది. మనమంద రము ఒక కుటుంబానికి చెందినవారం. ఈ కుటుంబంలోనుండి నేను వేరు అని చెప్పుకొనే సాహసం నాకులేదు. నేనుగూడా మీలో ఒకణ్ణి.

రాష్ట్రపతిజీ :

మీ మార్గదర్శకత్వంలో - మీ ప్రేరణతో - ఈ సమ్మేళనం ఉపయుక్తమైన కార్యక్రమాన్ని తయారుచేయగలదని విశ్వసిస్తున్నాను. ఈ సమ్మేళనమును ప్రారం భించుటకు దయతో అంగీకరించినందులకు మీకు నా కృతజ్ఞతను తెలియజేస్తూ భగవంతుడు మీకు ఆయురారోగ్యముల నొసంగుగాక అని ప్రార్థిస్తున్నాను. ★

# హిందీ ప్రచార సమ్మేళనము, హైద్రాబాదు

## ప్రారంభోపన్యాసము

*రాష్ట్రపతి శ్రీ డాక్టర్ రాజేంద్రప్రసాద్*

*సోదర సోదరీమణులారా!*

ఈ సమ్మేళనాన్ని ప్రారంభించు అవకాశం నాకు లభింపజేసినందులకు నాకు చాలా ఆనందంగా ఉన్నది దక్షిణ భారత హిందీ ప్రచారసభతో ఏదో రూపంలో మొదటినుండి నాకు సంబంధమున్నది అందువలన ఈ సభపక్షమున జరుగుతున్న పనిని నేను పూర్తిగా ఎరుగుదును అసలు ఈ పని ఏవిధంగా ప్రారంభమైనదో, ఎందుకు ప్రారంభమైనదో, హిందీ రాజభాషగా అంగీకరించవలెననే ప్రయత్నం ఏవిధంగా జరిగిందో చాలా మందికి తెలియకపోవచ్చును దక్షిణాఫ్రికాలో ఉన్న రోజుల్లో గాంధీమహాత్మునికి భారతదేశంలోని విభిన్నభాషలను మాట్లాడేవారిమధ్య పని చేయవలసివచ్చింది దక్షిణాఫ్రికాలో తమిళులు, బిహారీప్రాంతంవారు ఆయనతో కలిసి ఎక్కువగా పనిచేశారు వారి నందరినీ ఏకసూత్రంతో బంధించడానికి సాధనం హిందీ ప్రచారమేనని ఆనాడు వారు నిర్ణయించుకొన్నారు హిందీయే సార్వదేశిక భాషకాగలదని వారికి అభిప్రాయం కలిగింది కనుక భారతదేశంలోనికి రాగానే చంపారన్‌లో తన పనిని పెద్ద ఎత్తున ప్రారంభిస్తూ అక్కడే దక్షిణదేశంలో హిందీ ప్రచారం జరుగవలెనని నిర్ణయించుకొన్నారు

నాకు జ్ఞాపకమున్నంతవరకు 1918 లో ఆయన స్వామి సత్యదేవ పరివ్రాజకునీ, దేవదాసు గాంధీనీ దక్షిణదేశానికి పంపించి వారి ద్వారా హిందీ ప్రచార కార్యాన్ని ప్రారంభింపజేశారు వారిద్దరూ మద్రాసులో ఉండి కొంతకాలం హిందీ ప్రచారకార్యాన్ని నడిపించారు తరువాత చాలామంది యువకులు ఉత్తరప్రదేశం నుండీ, బిహారునుండి మద్రాసుకు వచ్చి చాలాకాలం హిందీ ప్రచారంచేశారు సంతోష కరమైన విషయమేమంటే హిందీ విషయంలో ఈనాడు అక్కడక్కడ మనం వింటున్నమాటలు ఆనాడు వినపడలేదు జనులు ఆనాడు హిందీని అప్యాయతతో నేర్చుకొన్నారు నెమ్మది నెమ్మదిగా దక్షిణ దేశంలోనే తగినంతమంది కార్యకర్తలు బయలుదేరడంవలన ఉత్తరదేశంనుండి కార్యకర్తలు రావలసిన అవసరం తగ్గిపోయింది 35 సంవత్సరాలనుండి ఉత్తరదేశంనుండి డబ్బు తెప్పించుకొనవలసిన అవసరం గూడా దక్షిణదేశానికి కలుగలేదు.

పని ఎంత పెరిగిందంటే వేల సంఖ్యలో దక్షిణ భారత హిందీ ప్రచారసభ వారిపరీక్షలకు విద్యార్థులు హాజరవుతున్నారు. అన్నింటికంటే ముఖ్యవిషయమేమంటే హిందీ నేర్చుకొనుటకు ఒక వర్గంవారు గాక అన్నివర్గాల వారూ రావడం ఆరంభించారు. వారిలో స్త్రీలు, పురుషులు, పిల్లలు, వృద్ధులు అందరూ ఉండేవారు మీకు ఇదివింటే ఆశ్చర్యం కలుగవచ్చును ఒక సభలో తాత, తండ్రి, మనమడు ముగ్గురికీ యోగ్యతాపత్రాలను నేను పంచిపెట్టి ఉన్నాను. ఈ ఉద్యమంలో స్త్రీలు ఎక్కువగా పాల్గొంటున్నారని గూడా చెప్పితే మీకు చాలా ఆనందం కలుగవచ్చును. స్త్రీలు పురుషులకంటే ఈ విషయంలో ముందంజవేస్తున్నారు ఇది శుభసూచకము. స్త్రీ హిందీ నేర్చుకొంటే ఆమె పిల్లలకు గూడా తొందరగా హిందీ అలవడుతుంది. హిందీ వారి మాతృభాష అయిపోతుందని చెప్పడం నా ఉద్దేశ్యంకాదు, తల్లికి హిందీవస్తే పిల్లలకు హిందీ నేర్చుకొనడంలో తగినంత ప్రోత్సాహం లభిస్తుంది

దక్షిణదేశంలో దాదాపు 40 సంవత్సరాలనుండి హిందీ ప్రచారకార్యం బాగా జరుగుతున్నది 1918 సంవత్సరంలో ఇందోరులో జరిగిన హిందీ సాహిత్య సమ్మేళనంలో దక్షిణదేశంలో హిందీ ప్రచారం జరుగవలెనని నిర్ణయింపబడ్డది అక్కడ అందుకు కొంత ధనం గూడా వసూలుచేయబడింది అనాటినుండి దక్షిణ భారత హిందీ సభ పనిచేస్తున్నది కేవలం హిందీ ప్రచారం చేయడమే గాక ఈ సభ ఉత్తమమైన సాహిత్యాన్ని గూడా నిర్మించింది

ఈ ప్రాంతంలో నాలుగు భాషలున్నవని మీకు తెలుసును నాలుగు భాషల వారు తేలికగా హిందీని నేర్చుకొనుటకు అవసరమైన సాహిత్యాన్ని నిర్మించవలసి ఉంటుంది కొంత చదివిన తరువాత ఆ చదివినదానిని జ్ఞాపకం చేసుకొనే అవకాశం ఉండాలి వరుసగా చదివే అవకాశం దొరకకపోతే చదివిన దానిని గూడా మరచి పోవడం జరుగుతుంది చదివినదానిని మరచిపోకుండా ఉండవలెనంటే ఎల్లప్పుడూ చదువుతూ ఉండాలి అందుకు అవసరమైన పుస్తకాలూ డిక్షనరీలు దక్షిణ భారత హిందీ ప్రచారసభ వారిచే ప్రచురింపబడ్డవి ఇంత ఎక్కువ సంఖ్యలో ఇంత ఉపయోగకరమైన సాహిత్యాన్ని ప్రచురించిన సంస్థలు బహుతక్కువగా ఉన్నవి

స్వాగతాధ్యక్షులు చెప్పినట్లు బలహీనులెవరో ఏదో కేకవేస్తే హిందీ ప్రచారకులు భయపడగూడదు. హిందీ ప్రాంతీయభాషల స్థానాన్ని గ్రహించేది కాదు. హిందీ సార్వదేశికభాష భారత దేశమందంతటా ఒకభాష అవసరము. ఇంగ్లీషువారు మనదేశంలో ఉన్నంతకాలం ఇంగ్లీషు ఆ పనికి ఉపయోగపడింది ఈనాడు గూడా ఇంగ్లీషును మనం పూర్తిగా వదలలేదు కాని మహాత్మాజీ ఇంగ్లీషు

మన దేశభాష కాదనీ, అది ఆ స్థానాన్ని గ్రహించగూడదనీ ఏనాడో నిర్ణయించారు. ఇక్కడ ఉన్నభాషలు ఉన్నంతగా లేకపోతే, ఏ భాషలోను ఉత్తమ సాహిత్యం లేకపోతే, ఆధునికభావాలను వ్యక్తిం చేయగలిగిన శక్తి ఏ భాషలోనూ లేకపోతే ఇంగ్లీషులో అవకాశం దొరికేది. సంస్కృతాన్ని వదలినా మిగతా భారతీయభాషలు గూడా చాలా సంపన్నములుగా ఉన్నవి భావ వ్యక్తీకరణకు అవసరమైన శబ్దాలు దొరకకపోతే వెంటనే వాటిని నిర్మించుకొనవచ్చును.

కనుక ఏ విదేశభాషా మనదేశంలో సార్వదేశిక భాషగా ఉండవలసిన అవసరంలేదు భాషద్వారా ఇంగ్లీషు వారిని బానిసగా చేయుటకు అవకాశం లేదని ఇంగ్లీషువారు గర్వంగా చెప్పుకుంటారు ఇంగ్లీషుమీద నమ్మకం పెట్టుకొని కూర్చున్నంతకాలం మనం సంపూర్ణంగా స్వతంత్రులం కానేరము. ఈ విషయాన్ని భారతీయులు పూర్తిగా తెలుసుకోవాలి

భారతీయభాషల పరస్పరసంబంధము గాఢమైనది ఉత్తరదేశాన్ని గురించి నేను వేరే చెప్పనక్కర్లేదు ఎందువల్లనంటే ఉత్తరదేశపు భాషలకన్నింటికీ తల్లి సంస్కృతము దక్షిణ భారతదేశాన్ని గురించి అదేవిషయం చెప్పడానికి వీలులేదు. అయితే అంతమాత్రంచేత భారతదేశమం దంతటా సంస్కృతం వ్యాప్తిలో ఉండేది అనే విషయాన్నిగూడా మనం మరచిపోవుటకు వీలులేదు సంస్కృతభాష యింటి యింటిలో,మూలమూలలో, గ్రామగ్రామంలో అధ్యయనం చేయబడింది అందువల్లనే యావద్భారతదేశ సంస్కృతీ మనకు ఒక్కటిగా కనపడుతున్నది సంస్కృతభాష దక్షిణదేశ భాషలను ఎంతగా ప్రభావితం చేసిందో నాకంటె మీకు ఎక్కువగా తెలుసును నేను ఒక్కవిషయం చెప్పగలను ఆంధ్రదేశంలో నేను పర్యటన చేసినప్పుడు నాకు సన్మానపత్రాలు సమర్పించబడ్డవి వాటిలో అధికంగా సంస్కృత శబ్దాలు ఉండేవి. కొంచెం తెలుగు నేర్చుకొంటే ఆ పత్రాలు నాకు అర్థం కాగలవని అనిపించేది. కన్నడ, మళయాళ భాషల విషయంగూడా అంతే తమిళంలో గూడా సంస్కృత శబ్దాలు తక్కువలేవు కాని మిగతా భాషలకంటె తక్కువ హిందీతో సంబంధాన్ని కలిపే ఈ ఐక్యత దక్షిణదేశపు భాషలలో మొదటినుండి ఉన్నది. ప్రజలకు సరిగ్గా నచ్చజెప్పితే, సరియైన ప్రచారాన్ని చేస్తే హిందీని సార్వదేశిక వ్యవహారాలకుగాను అంగీకరించుటకు ఎవ్వరికీ ఎట్టి అభ్యంతరమూ ఉండదు ప్రజలలో దేశమంటే శ్రద్ధా, భక్తీ ఉండనే ఉన్నవి. కాని హిందీవారు మాత్రం ఈ విషయంలో చాలా జాగరూకత కలిగి ఉండాలి బలవంతంగా హిందీభాష

తమ నెత్తిమీద రుద్దబడుతుందనే భావం అహిందీ ప్రాంతీయులలో కలిగేటట్లు వారు వ్యవహరించగూడదు

సార్వదేశిక భాషను అందరూ నేర్చుకొనడం అవసరం గనుక హిందీని ఎక్కువమంది తెలుసుకొనగలరు మాట్లాడగలరు గనుక హిందీకి ఆస్థానం లభించింది. అంతమాత్రంచేత ఇతరభాషలలో సాహిత్యం లేదు, శక్తిలేదు అని అర్థం కాదు హిందీలో గూడా ఇతర భాషలకంటె తక్కువ శక్తిగానీ, తక్కువసాహిత్యం గానీ లేదు సుప్రీమ్‌కోర్టులోనూ, పార్లమెంటులోనూ ఇంగ్లీషును ఉపయోగించకుండా ఉండడానికి హిందీ అంగీకరించబడింది పెద్దపెద్ద దుకాణాలనుండి వస్తువులను తెప్పించవలచుకొంటే ఇంగ్లీషులో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడకుండా ఉండడానికి హిందీ అంగీకరింపబడింది పూర్వం తీర్థయాత్రలకు దక్షిదేశంవారుఉత్తరానికీ, ఉత్తరదేశంవారు దక్షిణదేశానికీ వస్తూ పోతూ ఉండేవారు. వారు హిందీ ద్వారా తమ పనిని నెరవేర్చుకొనగలగాలి

ఈ భాష అభివృద్ధిచెందే అవకాశముంది అన్ని భాషలు అభివృద్ధి చెందవలెనని మా కోరిక. అన్నిభాషలలోనూ సాహిత్యం అభివృద్ధి చెందవలెననీ, ఒక భాష యెడల ఇంకొక భాషకు ద్వేషభావం ఉండగూడదనీ నా ఆశయము. కనుకనే హిందీవారు చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి పొరపాటున గూడా ఇతరులకు కష్టం కలిగించే మాటలను ఉపయోగించగూడదు. దక్షిణదేశస్థులు గూడా ఈ విషయాన్ని సంపూర్ణంగా గుర్తించియే ఉన్నారని నా ఉద్దేశ్యము దేశభక్తి ప్రపూరితులై దేశప్రేమ కలిగినవారై హిందీని ఇప్పటికే వారు బాగా నేర్చుకొన్నారు. ఆ పనిని ఇంకా తీవ్రంగా వ్యాప్తంచేయాలి అదే ఈనాటి మన కర్తవ్యం.

ఆంధ్రులకు హిందీ విషయంలో ప్రత్యేకమైన శ్రద్ధ ఉన్నదనే విషయం నాకు మొదటినుండి తెలుసును 1935 లో కాంగ్రెసు అధ్యక్షుడుగా నేను ఆంధ్రదేశంలో పర్యటన చేశాను ఆరోజుల్లో హిందీలో మాట్లాడనా, ఇంగ్లీషులో మాట్లాడనా అని నేను జనాన్ని ప్రశ్నించేవాణ్ణి హిందీలోనే మాట్లాడమని ప్రజలు కోరేవారు. నాకు ఎంతో ఆనందం కలిగేది ఆ సభల్లో చాలామందికి హిందీ తెలిసేది కాదు. అయినా వారు సహించి ఊరుకునేవారు ఇంగ్లీషునైనా వారు సహించవలసి వచ్చేది. ఎందువల్లనంటే చాలా మందికి హిందీగానీ ఇంగ్లీషుగానీ ఏదీ వచ్చేదికాదు అనువాదం కొరకు వారు ఎదురు చూడవలసివచ్చేది. ఇంగ్లీషునుండి అనువాదానికంటే హిందీనుండి అనువాదానికే వారు అంగీకరించేవారు. ఆనాటినుండి ఆంధ్రదేశంలో హిందీ ప్రచారకార్యం ఎంతజరిగిందో నాకు తెలుసును.

హైదరాబాదులో నైజాము ప్రభుత్వం ఏర్పడినప్పటినుండి హిందీ ప్రచారం జరుగుతున్నది హిందీ ఉర్దూలు రెండు వేరువేరు భాషలుకావు. అవి ఒకేభాషకు చెందిన రెండు శైలులు అని విశ్వసించే వారిలో నేను ఒకణ్ణి ఒకదానిలో అరబ్బీ పార్సీ శబ్దాలు ఎక్కువగా ఉండే ఇంకొకదానిలో సంస్కృత శబ్దాలు ఎక్కువగా ఉంటున్నవి రెండు భాషలూ ఒక్కటే రెండింటి వాక్యరచనా, విధానమూ ఒక్కటే కాకపోతే డిక్షనరీల అవసరం ఎక్కువగా ఉంటుంది అంతే కనుక హైదరాబాదులో హిందీ ప్రచారంచేయడం మరీ తేలిక ఈ రాష్ట్రంలో నేను ఎక్కడకు పోయినా నా భాషలో నేను మాట్లాడుతున్నాను నేను సంస్కృత పండితుడను కాను నాకు పార్సీగూడా రాదు నాకేదో సామాన్యమైన భాష తెలుసును ఆ భాషను జనసామాన్యం బాగా అర్థంచేసుకొన గలుగుతున్నది హిందీ యావత్తు దేశంలో మాట్లాడబడి సార్వదేశిక భాషగా రూపొందగలదని నా విశ్వాసము. ఆహిందీ ప్రాంతీయులు హిందీని నేర్చుకొంటే వారిభాషలలోని ప్రయోగాలను హిందీలోనికి రాకుండా ఎవరు ఆపగలరు? హిందీవారు వ్రాసిన చాలా పుస్తకాలలో ఆయా ప్రాంతాలలోని ప్రయోగాలు ఉండనే ఉన్నవి అనేకమైన వాక్యరచనా పద్ధతులు ఉన్నవి

హిందీ వ్యాకరణపండితులకు వాటిని చూస్తే కష్టం కలుగవచ్చును కష్టం కలుగనివ్వండి ఇటువంటివి వచ్చి హిందీని పెంపొందించవలెనని మనస్ఫూర్తిగా హిందీ మాతృభాషగా గలవారు కోరాలి అందరూ కలసి ప్రయత్నం చేస్తేనే హిందీ అభివృద్ధిని పొందుతుంది. హిందీ ప్రచారం చేసేవారుహిందీభాష నిర్మాణానికి గూడా పనిచేయాలి

మీ ప్రయత్నములు సఫలం కాగలవనీ, ఎంత ఉత్సాహంతో మీరు ఈ పనిని చేస్తున్నారో తదనుగుణ్యంగా ప్రభుత్వంవల్లా, జనసామాన్యంవల్ల మీకు సహాయం లభించగలదనీ నా విశ్వాసము ఈనాడు మీకు దొరికిన సభాపతి తన జీవితాన్ని హిందీ ప్రచారానికి అంకితం చేసినవాడు ఆయన హిందీకి చేసినసేవ భవిష్యత్తులో భారతదేశ భాషాచరిత్రలో ఎంతో గౌరవంతో, ఉల్లేఖింపబడగలదు. అటువంటి అధ్యక్షుడు మీకు దొరకడం సంతోషకరమైన విషయము



# ఏకాంక నాటికల
# ఉత్సవ ప్రారంభోపన్యాసము

*శ్రీ బెజవాడ గోపాలరెడ్డి*

హిందీ ప్రచార సమ్మేళనంతోబాటు విభిన్నభాషలలో ఏకాంక నాటికల ఉత్సవంగూడా జరుగుతున్నందులకు నా కెంతో సంతోషంగా ఉన్నది ప్రాచీన అర్వాచీన సంస్కృతి స్వరూపులగు శ్రీ రాష్ట్రపతిగారు ఈ సమ్మేళనమును ప్రారంభించినారు రాష్ట్రభాషయగు హిందీతోబాటు ఇతర భారతీయభాషలుగూడా వృద్ధిని పొందు అవకాశం లభించవలెనని వారు చేసిన నదుపదేశము మా హృదయాలపై ఎక్కువగా హత్తుకొన్నది హిందీ ఈనాడు రాజభాషగా అంగీకరించబడినది పలువురు ఉత్సాహంగా హిందీ భాషను అభ్యసిస్తున్నారు అయినా ఇది అహిందీ ప్రాంతీయులకు మాతృభాష కానేరదు హిందీ వ్యాప్తిపేరుతో ప్రాంతీయ భాషలను అణచివేయగూడదు హిందీతోబాటు ప్రాంతీయభాషల వికాసానికి తోడ్పడవలెను అందువలన ఈసమ్మేళనం నడుపుతున్నవారికి ప్రత్యేకంగా అభినందనలు తెలియజేస్తున్నాను. ఈ సమ్మేళన నిర్వాహకులు ప్రధానమైన ఈ విషయాన్ని గుర్తించి విభిన్నభాషలకు సంబంధించిన కవులను పిలిపించి ఈ సమ్మేళన నిర్వహణలో అందరి సహకారమును సంపాదించినారు

మనదేశం వైజ్ఞానికరంగంలోనూ, యాంత్రికంగానూ కడువేగంతో అభివృద్ధిని సాధిస్తున్నది అట్టిస్థితిలో మనం నాటకకళను, చిత్రకళను, సంగీతసాహిత్యములను విస్మరించగూడదు మన జీవితంలో ఎల్లప్పుడూ నిత్యనూతనత్వం వెల్లివిరుస్తూ ఉండవలెను నూతనత్వం పేరుతో పురాతన సంపదనుగూడా వదలివేయకూడదు శతాబ్దాలుగా మన పూర్వజులవలన మనకు లభించిన భావాలు, ఆలోచనా పద్ధతులూ మన భావాలను మన ఆలోచనా విధానాలనూ పునరుజ్జీవింప జేస్తున్నవి. "గతాన్ని" ఉదాసీన దృష్టితో చూడడం జాతీయతా వికాసానికి అనుకూలమగు పని కాదు గతానికి సంబంధించిన బీజాలమీదనే ఈనాటి "వర్తమాన" వృక్షం నిలబడి ఉన్నదనే విషయాన్ని సదా జ్ఞాపకం ఉంచుకోవాలి వైజ్ఞానిక క్షేత్రంలో పశ్చిమ దేశాలు ఎంత అభివృద్ధిని సాధించినా మనం కళ్ళుమూసుకొని వాటిని అనుసరించము. పశ్చిమ దేశాలనుండి తీసుకొన్నదానిని మనం మనదానినిగా చేసుకొంటాము.

అది మనది అయిపోవాలి అనగా ప్రాచీనకాలంనుండి మనకు లభించిన వారసత్వ మును పెంపొందించేదిగా ఉండాలి ఒక తరంనుండి ఇంకొక తరానికి సాంస్కృతికజ్యోతి విప్లవాత్మకంగా అందించబడుతూ ఉంటుంది. భారతప్రభుత్వం నాటక ఎకాడమీని, సాహిత్య ఎకాడమీని, లలితకళల ఎకాడమీని స్థాపించి కళాప్రపంచాన్ని ప్రోత్సాహ పరుస్తున్నదని తెలియజేయుటకు సంతోషిస్తున్నాను. మన శిల్పకళ, మన సంగీతము, మన చిత్రకళ, మన సంస్కృతి, మన జాతీయ ప్రతిభను వ్యక్తీకరించే విభిన్న సాధనాలు ఆ సాధనాలను మనం పెంపొందించుకొనకపోతే మన వికాసం ఆగిపోతుంది మనం బలహీనులమై పోతాము ఈదృష్టితోకూడా ఈనాడు ప్రారంభమవుతున్న సాంస్కృతిక ఉత్సవాన్నిచూచి హృదయపూర్వకంగా ఆనంద పడుతున్నాను

ఈ సాంస్కృతికోత్సవంలో నాటక విభాగాన్ని ప్రారంభించవలసినదిగా ఈ సమ్మేళనంవారు నన్ను ఆహ్వానించినారు. భారతదేశంలోని వివిధప్రాంతాలలో నాటకకళ ఒకేవిధంగా అభివృద్ధిని పొందలేదు. అన్నింటి పునాదీ ఒకే రకంగా ఉన్నా అది విభిన్న రూపాలను ధరించింది విభిన్న ప్రాంతాలకు సంబంధించిన నాటకాలను గురించి అభిప్రాయాన్ని వెల్లడించేముందు వాటి నన్నింటినీ ఒకే గీటు రాయిమీద పెట్టడానికి వీలులేదు బెంగాలులో నాటకం ఒకరూపంలో ఉంచే మహారాష్ట్రంలో ఇంకొకరూపంలో ఉన్నది తమిళనాడులో ఒకరకంగా ఉంచే ఆంధ్రలో ఇంకొకరకంగా ఉన్నది కొన్ని ప్రాంతాలలో నాటకాలకు జనసామాన్యంయొక్క సహాయం ఎంతగా లభించవలెనో అంత లభించలేదు. కొన్ని ప్రాంతాలలో కొన్ని విషయాలకు ప్రాముఖ్యతలభిస్తే మరికొన్ని ప్రాంతాలలో మరికొన్ని విషయాలకు ప్రాధాన్యత లభించింది ఉదాహరణకు తమిళనాటకాలను చూడండి. తమిళ నాటకాలలో దృశ్యాలకూ, సంగీతానికీ, హాస్యానికీ, రంగురంగుల తెరలకూ ప్రాముఖ్యత ఎక్కువ మహారాష్ట్రి నాటకాలలో సంగీతానికి ప్రాధాన్యత ఎక్కువగా కన్పిస్తున్నది ఆంధ్రదేశంలో అభినయంతోపాటు సంగీతానికిగూడా నాటకాలలో ప్రముఖ స్థానం లభించింది. తెలుగునాటకాలలో హాస్యరసానికి ప్రాధాన్యత చాలాతక్కువ

ఈ నాటకోత్సవంలో హైద్రాబాదులోని ప్రముఖప్రాంతీయ భాషలతోబాటు హిందీ, ఉర్దూ, సంస్కృతనాటకాలకుగూడా స్థానం కల్పించబడింది

ఇన్ని భాషలకు ప్రాధాన్యత విచ్చిన సమ్మేళన నిర్వాహకులకు నా ప్రత్యేక ధన్యవాదములు. ఈ విధంగా ఆరుభాషలలో నాటకాలను ప్రదర్శించుటకు అనువైన వసతులు హైద్రాబాదులోనే కలవు. హైద్రాబాదులో మరాఠీ, కన్నడము, తెలుగు

భాషలు మాట్లాడే జనసంఖ్య చాలా ఉన్నది అదేవిధంగా ఉర్దూగూడా ఇక్కడ నివసించే చాలామందికి మాతృభాష. హిందీ మాతృభాషగాగలవారుగూడా ఇక్కడ చాలామంది ఉన్నారు. కనుకనే హైద్రాబాదులో ఈ నాటక ప్రదర్శనములద్వారా ఒక నవీనజాగృతి ఉత్పన్నమైనది. సంస్కృతం దేవభాష. దేవభాషతోబాటు ఈ ఉత్సవకార్యక్రమంలో ఐదు ఆధునిక భాషలకు స్థానం లభించింది

హైద్రాబాదు ఉత్తర దక్షిణ దేశాలను కలిపేనగరం హిందీ ఉర్దూలు ఉత్తర దేశభాషలయితే, తెలుగు, మరాఠీ కన్నడభాషలు దక్షిణదేశపుభాషలు. భౌగోళికంగా మరాఠీ దక్షిణదేశభాష అయినా దేవనాగరీలిపిని ఆ భాష స్వీకరించింది ఈ ఐదు భాషలూ హైద్రాబాదు నగరంలోని భాషలు అందువలన ఈ పట్టణానికి ఐదురంగుల సౌందర్యం లభించింది అంతేగాక హైద్రాబాదు హిందూ మహమ్మదీయ సంస్కృతులకు కూడలిస్థలం. హిందుస్తానీ, కర్ణాటక సంగీతాలు రెండూ ఇక్కడ వ్యాప్తిలో ఉన్నవి అన్ని విధాలా హైదరాబాదు భారతదేశంయొక్క సంక్షిప్త స్వరూపము. ఈ సంక్షిప్తభారతంలో ఈరోజూ, రేపూ మనం ఆరునాటకాలను ఆరుభాషలలో చూడబోతున్నాము.

సాహిత్యాభివ్యక్తికి నాటకం సర్వోత్తమమైన సాధనం. నాటకం తొందరలో మన హృదయాలను ద్రవింప జేస్తుంది. నాటకాన్ని చదువవచ్చును. రంగస్థలంమీద చూడవచ్చును అందువల్లనే సాహిత్యానికి సంబంధించిన వివిధమైన అంగాలలో నాటకానికి ప్రాధాన్యత లభించివున్నది. పండితపామరు లిద్దరూ నాటకాన్ని చూచి ఆనందించగలరు అందువల్లనే ప్రాచీన భాషలలో గానివ్వండి, ఆధునిక భాషలలో గానివ్వండి నాటకాలకు సర్వ ప్రథమస్థానం లభించివున్నది. షేక్స్పియర్, గేటే, మోలియర్, ఇబ్సన్, బర్నార్డ్‌షా మొదలగు వారు సమస్యలను విడదీయుటకు నాటకాలను సాధనాలుగా ఉపయోగించుకొన్నారు మనుష్యునిలో కలిగే ప్రతి క్రియలను వ్యక్తీకరించుటకు ఇది సాధనము.

నాటకంలో సాహిత్యం ఉండనే ఉంటుంది దానితోబాటు కళా ప్రవీణుడగు నటుడు అభినయం చేస్తూవుంటే ఆ అభినయం ద్వారా భావగ్రహణం చేస్తూ ప్రేక్షకులు తాదాత్మ్యన్ని పొంది ఆనందపరవశులవుతున్నారు అసత్యమైన విషయం సత్యంగా నాటకంలో భాసిస్తుంది. అసహజమైన విషయాలను పరిస్థితులను చూస్తూ గూడా శరీరాన్నే మరచిపోతాము. జన సామాన్యం యొక్క హృదయంవరకు చేరడానికి నాటకము పెద్దది సాధనము మనుష్యత్వాన్ని ఉన్నతశిఖరాలమీది కెక్కించ గలుగుతుంది నాటకకళ, సంఘంలోని వైషమ్యాలను చిత్రించి మానవుని మనస్సులో

పరివర్తనం తీసుకొనిరావడానికి నాటకం మహాసాధనము. భావప్రచారానికి నాటకము బహు ఉపయుక్తమైనది.

గడచిన 40 సంవత్సరాలుగా ఆంధ్రదేశంలో నాటక కళకు చాలా ప్రోత్సాహం లభించింది. అనేకమంది ప్రముఖనటులు ఆంధ్ర దేశంలోని పలు జిల్లాలలో బయలు దేరి దేశమందంతటా మంచి కీర్తిని సంపాదించుకొన్నారు బళ్లారి రాఘవా చార్యులుగారు సుప్రసిద్ధనటుడు ఆయన ఆంధ్రదేశంలో నాటక కళకు కొత్తదోవలను చూపించాడు స్థానం నరసింహారావుగారు రెండవ ప్రసిద్ధనటుడు ఈనాడు గూడా తన అభినయం ద్వారా కళారసికులను ఆయన తన్మయపరుస్తున్నాడు ఆయన స్త్రీ పాత్రలను ధరిస్తూ ఉంటాడు రాష్ట్రపతి రాజేంద్రబాబుగారు ఆయనకు పద్మశ్రీ బిరుదాన్ని ప్రసాదించారు ఇది ఆంధ్రులకు ఎంతో ఆనందకరమైన విషయము. రాష్ట్రపతికి నా ధన్యవాదములు

హైదరాబాదులోని సాంస్కృతిక జీవితంలో ఈ దినము అపూర్వమైన దినము మన రాష్ట్రపతి ఈ పట్టణాన్ని భారతదేశానికి రెండవ రాజధానిగా స్వీకరించి ఈనాడు మనమధ్యన రెండు గంటలుండి నూతన సందేశాన్ని ప్రసా దించారు నాకీ అవకాశాన్ని కల్పించిన ఆహ్వాన సంఘం వారికి నా కృతజ్ఞత నాటకోత్సవాన్ని నేను ఆనందంగా ప్రారంభిస్తున్నాను ఇది షణ్ముఖ దర్శనము. అది విజయవంతం కావలెనని కోరుతున్నాను



# సమ్మేళనమునకు శుభాకాంక్షా సందేశములు పంపిన ప్రముఖులు



1. *మౌలానా అబుల్ కలామ్ ఆజాద్*
   కేంద్ర విద్యాశాఖామాత్యులు, న్యూ ఢిల్లీ
2. *పండిత గోవిందవల్లభ్ పంత్*
   కేంద్ర హోంశాఖమంత్రి, న్యూ ఢిల్లీ

3. శ్రీ సి. డి దేశ్ ముఖ్
కేంద్ర ఆర్థిక శాఖామంత్రి, న్యూ ఢిల్లీ
4. శ్రీ జగ్ జీవన్ రామ్
కేంద్ర రవాణా శాఖామంత్రి, న్యూ ఢిల్లీ
5 శ్రీ గుల్జారీలాల్ నందా
కేంద్ర ప్లానింగ్ మంత్రి, న్యూ ఢిల్లీ
6. శ్రీ ఖండూభాయ్ దేశాయ్
కేంద్ర కార్మిక శాఖామంత్రి, న్యూ ఢిల్లీ
7. శ్రీ కె. సి. రెడ్డి
కేంద్ర ఉత్పత్తి శాఖామంత్రి, న్యూ ఢిల్లీ
8. శ్రీ సర్దార్ స్వర్ణసింగ్
కేంద్ర పబ్లిక్‌వర్క్సు శాఖామంత్రి, న్యూ ఢిల్లీ
9 శ్రీ అజిత్ ప్రసాద్ జైన్
కేంద్ర పునరావాస శాఖామంత్రి, న్యూ ఢిల్లీ
10. శ్రీ యం. అనంతశయనం అయ్యంగార్
స్పీకర్, లోక్‌సభ, న్యూ ఢిల్లీ
11. డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య
గవర్నరు, మధ్యప్రదేశ్
12. శ్రీ ఆర్. ఆర్ దివాకర్
గవర్నరు, బీహారు
13 శ్రీ హరెకృష్ణ మెహతాబ్
గవర్నరు, బొంబాయి
14 శ్రీ మొరార్జీ దేశాయ్
ముఖ్యమంత్రి, బొంబాయి
15. శ్రీ కామరాజనాడార్
ముఖ్యమంత్రి, మద్రాసు
16. శ్రీ కె. హనుమంతయ్య
ముఖ్యమంత్రి, మైసూర్
17. శ్రీ కళా వెంకట్రావు
ప్లానింగుమంత్రి, ఆంధ్ర

★

వ్యాసము

# విశిష్ట వ్యక్తిత్వంగల కథకుడు బుచ్చిబాబు

— శ్రీ డి. రామలింగం

సుప్రసిద్ధ ఆంగ్ల నవలా రచయిత ఎర్నెస్ట్ హెమింగ్వే 1954 లో సారస్వతంలో నోబెల్ బహుమానాన్ని అందుకుంటూ "రచయితలది ఏకాకి జీవితం. ఆ ఏకాకితనాన్ని విడిచి నలుగురిలోకి వచ్చి తమ పేరు ప్రతిష్ఠలను ఇనుమడింపచేసుకొనడానికి ప్రయత్నించడం మొదలుపెడితే వారి రచనలలో పస తగ్గడానికి అవకాశముంటుంది రచయిత ఏకాకిగానే తన రచనలను సాగిస్తూ శాశ్వతకీర్తిని సంపాదించవలసి వుంటుంది నిజమైన రచయితకు తాను రచించే ప్రతి కొత్త గ్రంథం కూడా తనకు అందకుండా దూరంగా వున్న ఆదర్శాన్ని అందుకోవడానికి చేసే కొత్త ప్రయత్నమే కాగలదు" అన్నాడు కవుల సంగతి ఏమైనప్పటికీ రచయితల విషయంలో మాత్రం ఇది యథార్థమైన సలహాగానే కన్పిస్తుంది ఎర్నెస్ట్ హెమింగ్వే లాగా నలుగురిలోకి రాకుండా, ఏకాకి జీవితాన్ని గడుపుతూ తెలుగు కథానికా సాహిత్యాన్ని సుసంపన్నంచేసిన రచయిత బుచ్చిబాబు ఈయన వేదికలమీదికివచ్చి ఉపన్యాసాలివ్వడు ఒక్క సాహిత్యసభలో నైనా ఈయన పాల్గొన్నట్లు తెలిపే వార్తలు ఇంతవరకు వెలువడలేదు మనిషిని కూడా చాలా తక్కువమంది చూచివుంటారు ఏ సభలకూ పొయ్యే అవకాశాలు తక్కువ రచనల ద్వారానే పాఠకుల కీయన దర్శనం అయినా శాశ్వతంగా పరిచయం వుండేటంతటి కథలు పాఠకలోకానికి అందజేశాడు

ఆధునికులైన తెలుగు కథకులలో బుచ్చిబాబు అంత వయస్సుమళ్ళినవాడూ కాదు ఇప్పుడిప్పుడే వస్తూవున్న నవోదిత రచయితా కాడు చలం, మునిమాణిక్యం, భమిడిపాటి, కృష్ణశాస్త్రి మొదలగువారి రచనలు చదివిన మీదటనే సాహితీ వ్యాసంగానికి పూనుకున్నవాడీయన అంటే ఆధునికులైన మన సాహిత్యకులలో ఈయన రెండవ తరానికి చెందినవాడు దాదాపు నలభై ఏండ్ల వయస్సు అయినా ఆధునిక తెలుగు సాహిత్యంలో, ముఖ్యంగా కథానికలు, నవల, నాటికలు వ్రాసినవారిలో విస్మరింపజాలనంతటి విశిష్ట స్థానాన్ని పొందాడు ఈయన వ్రాసిన 11 కథలు ఇంతవరకు బహుశా మూడు సంపుటాలుగా వెలువడ్డాయనుకుంటాను ఇంకా దాదాపు రెండు డజనుల కథలు పుస్తకరూపంలో రావలసివున్నవి వీటిలో ప్రతి కథలో నవ్యత్వంవుంది దేనినీ త్రోసివెయ్యలేము కారణం అది మనల్ని అంతం వరకూ చదివిస్తుంది ఆలోచన కలుగజేస్తుంది ఎందరో పాఠకుల మన్ననలు పొందదగిన మూడు డజనుల కథలు వ్రాసి, ఇంకా కథానికారంగంలో నిలబడి, పాఠకులలో కొత్త ఆశలు కలిగిస్తూ, తన కొత్త రచన కొరకై పాఠకులు నిరీక్షించేటట్లు చేయగలుగుతున్నాడంటే ఆ కథకుడిలో తప్పక కొంత వైశిష్ట్యం ఉండితీరాలి

## రచయిత అయిన వైనం

తెలుగు కథాసాహిత్యంలో బుచ్చిబాబుది ఒక విలక్షణమైన వ్యక్తిత్వంగా కన్పిస్తుంది ఈయన వచనంలో వ్రాసినా తప్పనిసరిగా కవే అనిపిస్తాడు ఒక్కొక్కప్పుడు కవికిమించిన భావావేశం, వర్ణనలు చూపెడతాడు మరొకప్పుడు మరీ Sentimental గా కన్పిస్తాడు ఇంకొకప్పుడు Childish గా కన్పట్టచేసి మనల్ని నవ్విస్తాడు జీవిత సమస్యలనూ మానవప్రకృతినీ తర్కించి చర్చిస్తూ, నిర్వచనాలు చెబుతూ మన ఊహలను చాలాదూరం తీసుకెడతాడు తాను పొందిన విజ్ఞానాన్నీ, అనుభవాన్నీ చూపెడుతూ పాఠకునిలో తాత్త్వీక చింతను రేకెత్తిస్తూ క్షణంసేపు వైరాగ్యం జనింప జేస్తాడు తరచు శృంగారం వుంటుంది ఈయన రచనల్లో ఆ శృంగారంకూడా మొపాసా, లారెన్సు, చలంవంటి రచయితల శృంగారానికేమీ తీసిపోదు కాని ఆ రచయితలవలె శృంగారంలో కథావస్తువును ముగించక అక్కడినుంచి ఏదో వ్యక్తీకరణ పాఠకునికి దర్శనమిచ్చునట్లుగా ముగిస్తాడు ఏదో విషయాన్ని చెబుతూ దాన్ని మరి దేనికో పోలుస్తూ పోతాడు ఆ పోలికలు అనూహ్యంగానే ఉండవచ్చు వాటిమధ్య వ్యత్యాసం ఎంతో ఉండవచ్చు కాని ఏదో తాత్వికమైన సాదృశ్యం తప్పక స్ఫురిస్తుంది అందులో బుద్ధితో కాకపోయినా అనుభూతితో మనం దాన్ని గుర్తిస్తాము, ఎరిగడిస్తాము ఈయన ప్రతిభ ఇంతచంచలంగా ద్యోతకమైనా ఈయన రచనలన్నిటినీ వివేచనతో చదివినట్లయితే ఒకవిషయం ధృవపడుతుంది రచనావ్యాసంగంలో జీవితంపై ఒకదృక్పథం ఏర్పరచుకోవడానికి ఈయన నిరంతరం అన్వేషణ సాగిస్తూ వచ్చాడు ఈప్రయత్నంవల్లనే ఆయన సాహితీ వ్యక్తిత్వం రూపొందింది "జీవితరహస్యం, దాన్ని తెలుసుకోవడానికి మానవుడు చేసే ప్రయత్నం—ఏగొప్ప రచనకైనా ఇదే పునాది" అని బుచ్చిబాబు ఒకచోట చెప్పుకున్నాడు. అటువంటి దృక్పథాన్ని ఏర్పరచుకోవడంలో ఈయన వ్యక్తిత్వం కొన్ని ప్రభావాలకు లోనయింది ఆ ప్రభావాలు జీవితానుభవాలవల్లా ముఖ్యంగా పుస్తకపఠనంవల్లనే ఆయనకు కలిగాయి టాగూరునవల "రెక్" హార్డీ రచించిన "టెస్" "అనామకుడు జూడ్" అనే నవలలు బుచ్చిబాబు ఊహలో స్వర్గాన్ని రచించాయట పిక్‌విక్ పేపర్సు చదువుతూ ఆయన బిగ్గరగా నవ్వితే ఇంట్లోవారు పిచ్చివాడనుకునేవారట కృష్ణశాస్త్రిగారు "కన్నీటి కెరటాలు" అనే గేయం "నా కొరకు చెమ్మగిలు నయనమ్ములేదు" అనే పద్యపాదం ఆయనను బాగా ఆకర్షించాయి టాల్‌స్టాయి వ్రాసిన "క్రూయిడ్‌జర్ సొనాటా" కూడా అంతే ఒక పర్యాయం పేరుచూచి మోసపోయి పి జి వుడ్‌హౌస్ వ్రాసిన "చిక్కులోవున్న చక్కటి చుక్క" అనే నవల చదివి ఏడవడానికి సిద్ధపడ్డాడట యువకులలో తిరుగుబాటుకు తోడ్పడే రచయిత బెర్నార్డుషా అని ఈయన అభిప్రాయం షేక్స్‌పియర్ రచించిన "హేమ్లెట్" అనే నాటకం చదవడం వల్ల సారస్వతం విలాసంకొరకు కాదనీ, జీవితవిధానం నిర్ణయించడంలో దానికొకస్థానం వున్నదనీ గ్రహించాడు ఆస్కార్‌వైల్డు వ్రాసిన "దుఃఖసాగరం" అనే స్వీయగాథకూడా ఈయనకు తోడ్పడింది.

అయితే కాలేజీలో చదువుకొనే రోజుల్లోనే షా రచనలూ, వ్యక్తిగతమైన కొన్ని అనుభవాలు జీవితానికి అర్థంవుందా, దేవుడున్నాడా, కర్మసిద్ధాంతం నిజమైతే వ్యక్తిగతమైన కృషికి నైతిక విలువ వుందా, సృష్టంతా ఎందుకు ? అనే ప్రశ్నలు ఈయనకు కలిగాయి మార్క్సు సిద్ధాంతాలు, ఆధునిక విజ్ఞానశాస్త్ర పరిశోధనలు, వీటి ఫలితంగా దైవంపై గురి తప్పి మతంపై అసహ్యం ప్రబలింది అశాంతి హెచ్చింది అవిపోతే ఇక ఏ మానవవాదాన్నో, ప్రకృతినో, కళనో ఆరాధించాలి అప్పుడు డా రాధాకృష్ణన్‌గారి "ఆదర్శ తత్వం" అనే గ్రంథ రూపంగా వెలువడిన హిబ్బర్టు ఉపన్యాసాలు ఈయన భావప్రపంచాన్ని తారుమారు చేశాయి మతంపైనా, దైవంపైనా గురితప్పినవారు ఆరాధించే సిద్ధాంతాల నన్నిటినీ ఒక్కొక్కదాన్నే విమర్శించి, అవి ఎందుకు తృప్తికరంగా లేవో రాధాకృష్ణన్ గ్రంథం చూపెట్టింది ఆగ్రంథం రెండువిషయాలను విశదపరచింది కళ, సంస్కృతి, ఆరాధన, తత్వశాస్త్రం,ఇవన్నీ ప్రవర్తన లోనూ, శీలంలోను ప్రతిఫలించినప్పుడు తప్ప లేకపోతే ప్రయోజనం లేదు ఇది మొదటి విషయం రెండవది అతీంద్రియజ్ఞానం ఈ ఆలోచనలన్నీ, ఈయనలో మనోవ్యధ కలిగించాయి నైతికవిలువలు, విజ్ఞానశాస్త్రం, కళ, ప్రకృతి, మానవసేవ, నాగరికత వీటినన్నిటినీ ఆమోదించికూడా మతంపైనా దైవంపైనా గురి కుదరనివారికి మోక్షం లేదా ? అనే ప్రశ్న ఎదుర్కొంది అప్పుడు బెర్‌ట్రాండ్ రస్సెల్ వ్రాసిన రచన లీయన చదవడం మొదలు పెట్టాడు రస్సెల్ వ్రాసిన "స్వేచ్ఛాజీవుల ఆరాధన" అనే వ్యాసం ఈయనను పూర్తిగా మార్చివేసింది ఆ వ్యాసంలో బోధించబడినదయ, ప్రేమ, సహనం, వైరాగ్యం, నిస్సంగత్వం మొదలయిన ఆధ్యాత్మిక విలువలు కొత్తవి కావు అన్నిమతాలు, అన్నిదేశాల ప్రవక్తలు చెబుతున్నవే కాని దైవంతొ ముడిపెట్టకుండా ఆమోదకరమైన ఒక జీవిత దృక్పథంగా వర్ణించడమే ఆ వ్యాసంలోని విశేషం కాని తరువాత రస్సెలువే మరికొన్ని రచనలు, ఇతర తత్వశాస్త్ర గ్రంథాలు చదివినమీదట రస్సెలునుగూడా మార్గదర్శిగా పెట్టుకోక ఎవరికివారు వారివారి సంస్కృతినిబట్టి, అనుభవాన్నిబట్టి ఒక సిద్ధాంతాన్ని అనుసరించుకోవడం తప్ప గత్యంతరం లేనట్లుందనీ మన జీవితవిధానాన్ని సమర్థించే సిద్ధాంతమే మనం అన్వయించుకోవడం దాగనిపిస్తుందనీ ఈయన గ్రహించాడు వాల్మీకి, మామ్, ఇలియట్, వర్డ్సువర్తుల గ్రంథాలు అభిమానంగా చదివాడు అయితే అన్ని సిద్ధాంతాలూ లోపభూయిష్టమైనవే గనుక మనం దేన్నీ ఆమోదించవద్దు అన్న హక్సులే తత్వంలో ఈయనకు విశ్వాసం లేదు ప్రతి వ్యక్తీ తనకు సత్యమని తోచిన సిద్ధాంతాన్ని అనుసరించవచ్చునని ఈయన భావం ఆవిధంగా తనకు తోచిన భావాలను రచయితయై వ్రాస్తేనేగాని మానసికవ్యధనుండి విముక్తి లేదని గ్రహించాడు ప్రఖ్యాత ఆంగ్లభాషారచయిత ఆర్ కె నారాయణ్ పరీక్షలో తప్పి మైసూరులో ప్రకృతి సౌందర్యానికి ఆలవాలమైన ఒక తటాకతీరంలో పనిలేనివాడిలా విహరిస్తూ తోచిన భావాలను పెన్సిలుతో నోటుబుక్కుపై వ్రాసుకుంటూ రచనావ్యాసంగంలో పడ్డాడట ప్రఖ్యాత ఉర్దూ కథారచయిత క్రిషన్ చందర్ కామెర్లరోగంతో ఆసుపత్రి బెడ్‌పై పడుకొని కాశ్మీరు లోయ ప్రకృతిసౌందర్యాన్ని ఒకవంక ఆ లోయలో బరువులెత్తుకొని ఊచకాళ్ళతో, పీక్కుపోయిన మొహాలతో దీనంగాపోతూవుండే కష్టజీవులను మరొకవంకచూస్తూ ఆరెండుదృశ్యాల

వల్ల ప్రభావితుడై సౌందర్యాన్ని వర్ణిస్తూ, అన్యాయాన్ని బహిర్గతంచేస్తూ, దైన్యాన్ని వ్యక్తీక రిస్తూ రచయిత అయ్యాడట కాని తెలుగుకథకుడు బుచ్చిబాబుకు యౌవనదశలో విభిన్నమైన సిద్ధాంతాలు, వ్యక్తిగతంగా కలిగిన అనుభవాలు, ప్రపంచాన్ని పరిశీలించి పొందిన అనుభూతి- ఇవే రచయిత కావడానికి ప్రోద్బలం చేశాయి మానసిక విముక్తికోసమే ఈయన రచనలు చేశాడు ఏదయినా ఒక సమస్యను తీవ్రంగా తాను ఆలోచించినప్పుడు దానికి ఒక పరిష్కారం అంటూ చూపకపోయినా సమస్య వివరణను నలుగురితో కలిసి పంచుకుంటేనేగాని మనశ్శాంతి కలుగదు కనుక తాను నమ్మిన ఆదర్శాలకు సిద్ధాంతాలకు కళాస్వరూపమిచ్చి రచనలద్వారా పాఠకిలోకానికి అందజేశాడు కథలు, నాటికలు, ఒకనవల, ఇంకా అనేక పరిశరచనలు చేశాడు కాని కథారచయితగానే ఈయన తెలుగు సాహిత్యంలో ప్రముఖస్థానం పొందాడు.

ఒక కథకుడు ఉత్తమ కథకుడని చెప్పడానికి రెండు ఆధారాలున్నవి ఒకటి కథా వస్తువును ఎన్నుకోవడంలో ఒక new conception ద్యోతకమై, అదొక అపురూపమైన సంఘటనగా భావించడానికి ఆస్కారమున్నట్లయితే అతడు ఉత్తమ కథకుడే అని చెప్పాలి. రెండవది కథావస్తువు ఏదైనా చెప్పేవిధానంలో, భాషలో, శైలిలో, శిల్పంలో ఒక ప్రత్యేక వ్యక్తిత్వాన్ని చూపించడం ఇద్దరు యువతీ యువకుల మధ్య ప్రేమను అనేకమంది కథకులు కథావస్తువుగా తీసుకొన్నారు మరి అంతటితో ఆ వస్తువు స్వీకారయోగ్యం కాదనగలమా? నవ్యత్వాన్ని చూపించలేనివారు ఆ మాట అంటారేమో కాని ప్రతిభావంతుడైన కథకుడు తన శైలితో, శిల్పంతో ఒక కొత్తఫక్కీతో అదే విషయాన్ని ఉత్తమమైన కథగా మలచుతాడు. ఇవి రెండూ - అంటే వినూత్నమైన కథావస్తువు, విలక్షణమైన వ్యక్తీకరణ బుచ్చిబాబులో ఉన్నాయి పైగా కథ చెప్పేతీరులో ఈయన వాడ్యే పోకడలు, చూపే శిల్పం, ఉపయోగించే భాషా బహు ఆకర్షవంతంగా ఉంటాయి, వీటన్నిటినీ మించి ఈయన చేసే తాత్త్వికచింతన పరేసరి ఈ అన్ని సుగుణాలతో ఒక ప్రత్యేకశైలి అలవరచుకున్నాడు ఒక కథ చదివిన తరువాత ఇది బుచ్చిబాబు కథ అని అనుకొనేటంత వ్యక్తిత్వాన్ని ఈయన సాధించాడు. కథా వ్యూహ నిర్మాణంలో పాత్రలకు పెట్టే సంభాషణలలో, కథా గమనంతోపాటు వాతావర ణాన్నీ, పరిసరాలను చిత్రించడంలో, చివరకి అర్థాంతరంగానో tragical గానో కథను ముగించడంలో, ప్రయోజనాన్ని చూపడంలో, కథావస్తువును గూర్చి పాత్రల తత్వాలను గూర్చి ప్రయోగాలు చేసి కథలు సృష్టించడంలో ఈయనది అందెవేసిన చేయిగా కన్పిస్తుంది. ఉత్తమమైనకథకుడనో, లేక నవలారచయితఅనో చెప్పడానికి అన్నిటికంటె మరొకవిచిత్రమైన యోగ్యత కొందరు రచయితలలో మనకు గోచరిస్తుంది ఏమిటంటే కొందరు ఒక్కొక్కచోట అసభ్యంగా వ్రాసినా, అవాస్తవికంగా వ్రాసినా మన ఇష్టాయిష్టాలపై వారి ప్రభావముద్ర తప్పక పడవేస్తారు అల్ఫాంజ్ డాడే వ్రాసిన "శాఫో" నవలలో ప్రతిఘట్టంలో హద్దుమీరిన కామప్ర వృత్తి చిత్రితమయింది. కాని ఆ మహత్వం ఏమిటోగాని దానిపై మనకు జుగుప్స కలుగదు. కొన్ని ప్రసిద్ధమైన నవలల్లో అవాస్తవికమైన సంఘటనలు పేర్కొనబడ్డవి. అయినా వాస్తవి కతకు మించిన ప్రభావాన్ని అవి పాఠకులపై వేశాయి బుచ్చిబాబు కథలలో కూడా కొన్ని కొన్ని చోట్ల సభ్యతకూ, సంప్రదాయానికి, వాస్తవికతకూ స్వల్పంగా దూరమైన సన్నివేశా

ఉండవచ్చు కాని వాటిని చదవండి ఉండలేము చదవాలనే కాంక్షను నిలుపుకోలేము తీరా చదివిన తరువాత దాన్ని గూర్చి వితర్కించుకోకుండానూ ఉండలేము ఇదీ ఆయన రచనలో ఉన్న విశిష్టత

## అపురూప వ్యక్తి కుముదం

కథకుడుగా బుచ్చిబాబుకు గల వైశిష్ట్యాన్ని వ్యక్తంచెయ్యడానికి ఆయన వ్రాసిన "నన్ను గురించి కథ వ్రాయవూ?" అనే కథ చాలు విశ్వ కథాసాహిత్యంలో అత్యుత్తమమైన కథలలో ఒకటిగా దీన్ని నేను ఎన్నుకుంటాను అసలు ఇది కథ కాదు మహోన్నతమైన భావం గల ఒక ఖండకావ్యం హృదయం గల ప్రతివ్యక్తిలో ప్రవృత్తిజాగృత్తను రచించగల కథానిక ఇది సామాన్య సంసారంలో కష్టసుఖాలు అనుభవిస్తూ మౌనంగా తన మనోభావం ప్రకటించకుండానే జీవితం చాలించిన ఒక యువతి జీవితగాథ ఇది ఇందులో కుముదం, కథకుడు - వీరిద్దరే పాత్రలు మిగతా పాత్రలు ప్రత్యక్షంగా రావు కుముదం, అతనూ చిన్నతనం నుంచీ ఒకేచోట పెరిగాడు ఆ అమ్మాయి అతనికంటే రెండేండ్లు చిన్నది ఇద్దరికీ బాల్యస్నేహం ఈడువొచ్చిన తరువాత కుముదానికి వివాహమైపోతుంది అతను బ్రహ్మచారిగానే వుండిపోయి జీవితంతో సంఘర్షణపడుతూ ఉంటాడు తన మామగారింట్లో అద్దె కుంటూ వున్న కుముదం వాళ్ళదగ్గర నుంచి అద్దె అడిగితీసుకోవడానికి వస్తూ ఆమెని తరచు కలుసుకుంటూ ఆమె జీవితాన్ని పరిశీలిస్తూవుంటాడు

కుముదం వ్యక్తిత్వాన్ని బుచ్చిబాబు సాధారణ మనిషిగా కాక అపురూపమైన ఒక ఊహావ్యక్తిగా చిత్రించాడు "ఎర్రటి శరీరం, వేసంగిలో పస్పుంకురిసే ముందు దిట్టంగా అల్లుకున్న మబ్బుల్లాంటి శరీరచ్ఛాయ, సంపూర్ణంగా వికసించని అవయవాలు ఎవరో దువ్వినట్లుగా ఉండే జడపట్టు, చూసిన వస్తువులు తనకోసం కానట్లు చాంచల్యంగా మెరిసి బలహీనమైన కనురెప్పల క్రింద, మంచులో కదిలిపోయిన కుందేలులా మెరిసే నేత్రాలూ, కంఠంలో కొలవడానికి వీలుగా ఉండే పల్చటి నాళాలు, నీడ కన్పించినట్లు స్ఫురించే వక్షం, శరీరంలో పైభాగాన్ని మోసేటందుకు వోపిక లేనట్టి అల్పమైన నడుం"— ఇదీ కుముదం మూర్తిచిత్రణ ఇంతవరకూ కుముదం బాహ్యవ్యక్తిత్వం మాత్రమే వర్ణింపబడింది ఇక ఆమె అంతరంగిక వ్యక్తిత్వం ఆమె ఈ ప్రపంచాన్నుంచి ఏమీ ఆశించని వ్యక్తి తన పెండ్లివిషయంలో కూడా ఆమె తనకు పరిచయమైన వ్యక్తిని ప్రేమించలేదు అసలు తన మనోభావాలనే వెల్లడించదు. కాలం ఆమెపై ఏలాంటి మార్పు తేలేకపోయింది పిల్లలు కలిగినా మాతృత్వం తాలూకు చిహ్నాలేవీ ఆమెలో కన్పించవు పిల్లల్ని చూచుకొని తల్లులుపడే గర్వం ఆమెలో లేదు అసలు పిల్లలూ, భర్త, సంసారం— ఇవేవీ ఆమె నిజశరీరాన్ని తాకి పంచుకున్నట్లులేదు మనిషి ఉండడం కూడా మరో లోకంలో ఆత్మను మరచిపోయి శరీరాన్ని తన ఇష్టంలేకుండానే ఈ లోకంలోకి రప్పించినట్లు చలిస్తుంది ఆమె నేత్రాలు ఈ ప్రపంచంలోనే వున్నా మరో లోకంలోకి చూస్తూ ఉంటాయి. ఇక లౌకికంగా చూస్తే ఆమె కడు సాధారణమైన మనిషి చదువుకోలేదు సంగీతం నేర్చుకోలేదు. గొప్ప స్థితిపరురాలు కాదు అనాకారి కాదు, పెద్ద

అందగత్తె కాదు తన భర్త ఇలా ఉండాలి, ఆ ఈ హోదా తెచ్చుకోవాలి అని కోరదు. దొరికిన భర్తతోనే జీవితం గడుపుతూవుంది

ఇటువంటి కుముదం 'నన్ను గురించి కథ వ్రాయవూ ?' అని కథకుణ్ణి అడుగుతుంది కథ వ్రాయడానికి ఆమెలో చెప్పుకోదగిన ప్రత్యేకతలేవీ లేవంటాడు అతను ఆమె జీవితాన్ని పరిశీలిస్తూపొయ్యాడు ఆమెకు కేవలం నిస్సంగత్వం అలవడింది మనుష్యులతో చేసే ప్రేమలో దాస్యం వుందనీ, సంసారం ప్రేమ ఇవన్నీ బంధనాలనీ, అసలు పుట్టడమే సృష్టికి దాస్యమనీ కుముదం వాదిస్తుంది చివరకు యవ్వనం గడచిపోక మునుపే ఈ లోకం నుంచి శాశ్వతంగా నిష్క్రమిస్తుంది ఆసుపత్రిలో మరణస్థితిలో వుండగా అతను ఆమెవద్దకుపోతాడు. అనుకోకుండానే తన చెయ్యిని ఆమె చేతిపై వెయ్యబొయ్యాడు ఆమె వెంటనే చెయ్యి లాగుకొని దుప్పట్లో దాచుకుంటుంది "నువ్వెందుకు పెండ్లి చేసుకోలేదో నాకు తెలుసు-నాకోసం నాకు వివాహం ఈ ప్రపంచం నాదౌతేగా కాని నువ్వుమాత్రం " అని ఏమో చెప్పటోతూ కళ్ళుమూస్తుంది ఆమె చనిపోయిన తరువాత అతను ఆమెనిగూర్చి తన అభిప్రాయాన్ని మార్చుకొని ఆమెలో ఒక వ్యక్తిత్వం వున్నదని గుర్తించి ఆ వ్యక్తిత్వాన్ని విచక్షణ చేస్తాడు

కుముదాన్ని గూర్చి కథ వ్రాయడానికి ఆమెలో ఏమున్నదని ప్రశ్నించిన కథకుడే కేవలం ఆమె ఒక్కపాత్రను ప్రధానంగా తీసుకొని సుదీర్ఘమైన కథను సృష్టించాడు నేటి మన సంఘంలోని యువతులలో సామాన్యంగా స్ఫురించే లక్షణాలు, వాంఛలు, చేష్టలు, భావాలు కావు కుముదానివి ఆమె గొప్ప కార్యాన్నేదీ సాధించలేదు కనీసం ఒక విలువను సాధించాలని ప్రయత్నించిన మనిషికాదు ఈ ప్రపంచంపై ఏ విషయంలోనూ ఎదురుతిరగ లేదు సృష్టి, సంసారం అంతా ఒక విధమైనదాస్యం అని ఆమె భావం మనిషి జీవితానికి తలవొగ్గి ప్రపంచాన్ని అంగీకరించాలనీ, అన్నిటికీ అతీతుడై స్వతంత్రంగా బ్రతకాలనీ అంటుంది జీవితంపై విచిత్రమైన వేదాంత దృష్టిని అలవరచుకున్న స్త్రీ కుముదం ఆ దృష్టి తార్కికజ్ఞానాన్నుంచి కాదు, కేవలం జీర్ణించుకొన్న అనుభవం నుంచి వొచ్చింది. అతనితో ఆమె అన్న నాలుగు మాటలు ఆమె దృష్టిని వ్యక్తపరుస్తాయి "నువ్వు జీవితాన్ని పరిశీలిస్తావు, నేను అనుభవిస్తాను జీవితానికి తలవొగ్గి ప్రపంచాన్ని అంగీకరిస్తాను. అసలు పుట్టడమే సృష్టికి దాస్యం మనుషుల ప్రేమలో దాస్యంవుంది "

ప్రపంచప్రసిద్ధ తత్వవేత్త బెర్ట్రాండ్ రస్సెల్ ఒక వ్యాసంలో అంటాడు "మనోవ్యథ వదిలి, జీవితశక్తిని అంగీకరించి, వైరాగ్యం అలవరచుకోవడం జ్ఞానం తాత్కాలికమైన వాంఛలపై మమకారాన్ని విడిచిపెట్టడం, శాశ్వతమైన విలువలనే ఉద్రేకంతో కాంక్షించడం— ఇదే స్వేచ్ఛ కోర్కెల విసర్జననుంచి వైరాగ్యం జనిస్తుంది వాంఛకు దాస్యం చెయ్యని ఊహతే ఆనందం లభ్యమవుతుంది " జీవితంపై ఇటువంటి దృక్పథం కుముదం పాత్ర పూర్తిగా అన్వయించుకున్నది అయితే అటువంటి తాత్త్వికదృక్పథం కుముదంలాటి సాధారణ స్త్రీకి ఎలా కలుగుతుందని విమర్శిస్తే మనకు ఈ కథలో సమాధానం దొరకదు జీవితంపై మానవునికి ఒక దృక్పథం అంటూవుండడం కేవలం అనుభవంనుంచేనని అంటారు. కాని

అనుభవాన్ని మించినశక్తులు కూడా కొన్ని ఉన్నాయి అట్టివాటిలో మొదటిది వ్యక్తియొక్క శారీరక మానసిక ప్రకృతి రెండవది వ్యక్తిగత సంస్కృతి మూడవది నమ్మినవారికి పూర్వ జన్మ సంస్కారం కుముదం అలాకావడానికి కారణ లేమిటి? ఇందులో వాస్తవికతవుందా అనే ప్రశ్నలు ఈ కథ చదివిన తరువాత కలుగవు కథ చదువుతూ ఉండగానే మనం కొత్త లోకంలోకి ప్రవేశిస్తాము అక్కడ హేతువాదానికి, బుద్ధికి కాదు ప్రాధాన్యం, సర్వానికీ అతీతమైన నిర్మలహృదయానికే

కథ చివరలో కుముదం చనిపోయిన తరువాత ఆ యువకుడు "కుముదం త్వరితంగా ముగిసిపోతూవున్న శతాబ్దానికి చెందిన స్త్రీ ఈ యుద్ధానంతరం అలాంటి స్త్రీలు మన సంఘంలో ఇంకా ఉంటారనుకోను" అంటాడు అంటే రెండవ ప్రపంచయుద్ధం సాగుతున్నకాలంలో ఈ కథ జరిగినట్లుగా కథకుడు చెప్పుతూవచ్చాడు బుచ్చిబాబు వ్రాసిన కొన్ని కథల్లో, "చివరకు మిగిలేది" నవల్లో కూడా, రెండు ప్రపంచ సంగ్రామాల మధ్యకాలంలో తెనుగునాట యువతీయువకుల జీవితాల్ని, వారి సమస్యల్ని చిత్రించాడు కాని ఈ కథయొక్క 'ఆత్మ' వేరు. కథ కాలం ఏదైనా కథ Conception కూ, కుముదం పాత్రకూ కాలపరిమితి అంటూ ఒకటి ఉంటుందని నేను అనుకోలేను కుముదం ఒక ప్రత్యేక శతాబ్దానికిచెందిన స్త్రీ కాదు అటువంటి స్త్రీలు ఎప్పుడైనా ఎక్కడైనా ఉండవచ్చును ఆమెది అపురూపమైన ఆధ్యాత్మిక వ్యక్తిత్వం స్వప్నజగత్తునూ, ఊహాస్వర్గాన్నీ రచించుకోగలవారి ఊహకే ఆ వ్యక్తిత్వం గోచరిస్తుంది తెలుగు కథకుడు బుచ్చిబాబు సృష్టించిన ఈ కథను సోదర భారతీయులకూ, ప్రాచ్యపాశ్చాత్య దేశీయులకూ పరిచయంచేయవలసిన అవశ్యకత ఎంతైనావున్నది

## మానవజీవితపు విలువలు

ప్రపంచవిఖ్యాత ఆంగ్లకథారచయిత సోమర్సెట్‌మామ్ బుచ్చిబాబును కొంతవరకు ఆకర్షించాడు "మామ్‌ను రచయితలరచయిత అని పిలువబుద్ధిపుట్టుతుంది" అని బుచ్చిబాబు ఒక పర్యాయం చెప్పుకున్నాడు రచయితకు ఉపకరించే మెలకువలు, పరికరాల పరిశీలన— ఇవన్నీ బుచ్చిబాబు చాలావరకు మామ్‌నుంచే గ్రహించ గలిగాడు ఈ విధంగా మామ్ ప్రభావం ఈయనపై పడినప్పటికీ ఆ ప్రభావాన్నిబట్టి ఈయన రచనా సంవిధానంలోను, భావాలలోను, వ్యక్తిత్వంలోను మామ్‌ను అనుకరించలేదు అప్రయత్నంగాగూడా ఈయనకు మామ్ అనుకరణ అబ్బిందని నిశ్చయంగా చెప్పలేము, పైగా కొన్నిచోట్ల మామ్‌కు విరుద్ధమైన భావాలను వెలిబుచ్చుతూ ఈయన కథలు వ్రాశాడు ఇందుకు "మీరూ, నేనూ, మామ్" కథ నిదర్శనం ఏదో ఒక కథ అల్లేటందుకు కావలసిన అనుభవాన్ని లాగకుండా ఏ వ్యక్తితోనూ గంట ప్రసంగించలేను అన్నాడు సోమర్సెట్ మామ్ "ఏదో అసాధారణమైన ఒక్కచూపు, ఒకచేష్ట, మాటలో మార్దవం, అప్రయత్నంగా వెలువడిన వాక్యంలో పదజాలం, విచారంతో వొదిగిన పెదవుల పొంపు, నవ్వు స్ఫురింపజేసే కనురెప్పల తళతళ—వీటిని గ్రహించడానికి గంటచాలు వీటిల్లోంచే కథ అల్లగలను" అంటాడు మామ్ కానీ కొందరువ్యక్తులెట్లా ఉంటారంటే వారిని సంవత్సరంపాటు పరిశీలించే అవకాశం కలిగినా వారినిగూర్చి ఏ కథనూ అల్లే

టందుకు తగిన వస్తువును సేకరించలేమని బుచ్చిబాబు అంటాడు. ఒకవేళ అస్పష్టమైన తాత్కాలిక సూచనల ననుసరించి వ్రాసినా అది పోగమంచుని పటాపంచలుచేసే ప్రయత్నంగా పరిణమించి, చివరకు రచయిత మన స్తత్వమే కథకి వస్తువుగా తయారు కావచ్చునంటాడు. పైగా మామ్‌కి సాధారణంగా పురుషులపైన సానుభూతి, స్త్రీల పైన ద్వేషం—ఈ విషయం అతని కథలద్వారా, ముఖ్యంగా Unconquered వంటి కథలవల్ల వ్యక్తమవుతున్నది మామ్ సృష్టించే స్త్రీ పాత్రలకి శరీరాలు తప్ప మెదడు, ఊహ, మానవత్వం ఉండవు ఇవన్నీ పురుషుని సొత్తు స్త్రీలకు కావలసింది సంఘంలో పలుకుబడి, హోదా, అధికారం—వీటిని సూచించే భౌతిక పరికరాలు వీటిని ఏ మొగాడు ఎక్కువగా సంపాదించి పెట్టగలిగితే అతని కోసం వారు శృంగారం వలని పన్నుతారు. ఒకవేళ అపజయం పొందారా ప్రతీకారం సాధిస్తారు దీనికి పురుషపాత్రలు లొంగరు. అ సందర్భాలలో స్త్రీలకి, పురుషులకి, సంసారం అనబడే సంఘర్షణ జరుగుతుంది పురుషుడు గెలిచినపుడు సంఘం పురోగమిస్తుంది స్త్రీ గెలిచినప్పుడు సంస్కృతి పతనం జరుగుతుంది మామ్ ఈ అభిప్రాయాన్ని పాశ్చాత్య దేశాల పరిస్థితినిచూచి ఏర్పరచుకొని వుంటాడు ఫ్రాన్సుదేశంలో స్త్రీల ప్రవర్తననుచూచి విసుగు చెంది రోమారోలాకూడా "జీన్ క్రిస్తోఫీ" నవలలో ఒకచోట దాదాపు ఇటువంటి అభిప్రాయాన్నే వెలువరిచాడు బుచ్చిబాబు ఈ అభిప్రాయాలను ఖండించలేదు ఖండించవలసిన అగత్యంకూడా లేదు ఈయన పట్టించుకున్నది స్త్రీ పురుషుల విచక్షణ కాదు స్త్రీ అయినా పురుషుడైనా ఒక వ్యక్తిని అర్థంచేసుకోవడం అంత సులభం కాదని మాత్రమే చెప్పాడు మామ్ కథలు అలా వుంటాయని మాత్రమే చెబుతూ పై కథలో పద్మావతినిగూర్చి చెబుతాడు

పద్మావతి సంసారం చేస్తూవున్న స్త్రీ ఆమె వయస్సు నలభై ఉంటాయి భర్త నాగభూషణంగారు డాక్టరు వారికి ఐదుగురు పిల్లలుకూడా వున్నారు నాగభూషణం గారి ప్రాక్టీసు కూడా పరవాలేదు వారింట్లో వేలాయుధం అనే మరోవ్యక్తి వున్నారు అతని వయస్సు యాభై పైన మొదట నాగభూషణం గారి డిస్పెన్సరీలో వుంటూ తరువాత ఇంటి నౌకరుగా కుదురుకున్నారు ఇక మిగిలిన వ్యక్తి కథకుడు లేదా కథకుడు 'నేను' అని కథలో చెప్పుతున్న వ్యక్తి 'నేను' అనే పాత్రనుపెట్టి బుచ్చిబాబు కొన్ని కథలు వ్రాశాడు మామ్ కథలలో కూడా 'నేను' అని వ్రాసినవి చాలా ఉన్నయి వాటిలో ఎంతవరకు ఆ 'నేను' వ్యక్తి అసలు మామో, ఎంతవరకు కల్పితవ్యక్తో ఎవరికీ తెలీదు. బుచ్చిబాబు విషయంకూడా అంతే అది రచయిత అనుభవంకావచ్చు లేదా కల్పనకావచ్చు,కాని అలావ్రాయడంలో కథకుడికి ఒక సులువుంది ఏమిటంటే అలావ్రాసిన కథ Autobiographical గా వుండి వాస్తవికత స్ఫురింపజేస్తూ పాఠకునిలో ఉత్సుకతకల్గిస్తుంది కథకుడు మెడికల్ కాలేజీలో చదువుతూ నాగభూషణం గారింటి రెండోవాటాలో కాపురంఉండేవాడు. నాగభూషణంగారికుటుంబంతో ఇతనికి రాగాచనువేర్పడుతుంది. తరచు అక్కడే గడుపుతూ ఉండేవాడు అలా వారి సంసారాన్ని పరిశీలింపసాగాడు పద్మావతికి సంసారంపై వైముఖ్యం కలిగినట్లు ఆమె సంభాషణల వల్ల కథకునికి బోధపడుతుంది. కాని అందుకు కారణాలేమీ బైటికి కన్పించవు పిల్లలకి జబ్బు చేసినా ఆవిడలో ఆదుర్దా వుండదు. వారి దాంపత్యం చూస్తే పైకి అన్యోన్యంగా కన్పిస్తారు. మరి

పద్మావతి వైఖరికి కారణమేమిటి? ఒకరోజు కథకుడికి తెలియవస్తుంది నాగభూషణంగారిని పెట్టుకున్న పళ్ళని పద్మావతిది చాలా అందమైన ఎళ్ళవరుస కాని ఇదే ఆవిడ విముఖతకి కారణంకాదు. పద్మావతి పెద్ద కుటుంబంలో పుట్టింది పెద్ద కలలుకన్నది కాని సాధారణుడైన నాగభూషణం గారితో కాపురం ఆమెలో తీరని అసంతృప్తిని కలిగించింది ఆ అసంతృప్తి చాలాకాలం నుంచి అజ్ఞాతంగా ఆమెలో వుంది. విధిలేక కాపురం ఈదుతూ వస్తుంది. ఆమె హృదయంలో వెలుగుసోకని రహస్య మందిరాలు, ఇంద్రియాలు శోధించని కోణాలు ఉండేవి ఒకరోజు నాగభూషణంగారికి అకస్మాత్తుగా గుండెలో నొప్పివచ్చి, ఆ రాత్రంతా బాధపడి మరుసటిరోజు ఉదయం చనిపోతాడు కొంతకాలానికి పద్మావతి కూడా జబ్బుపడితే కథకుడు ఆమెను చూడడానికి పట్నంవొస్తాడు అప్పుడామె వేదనతో తన భర్త ఆత్మహత్య చేసుకున్నాడని చెప్పి కళ్ళు మూస్తుంది తిరిగి కొంతకాలం తరువాత కథకుడు వేలాయుధాన్ని పట్నంలో కలుసుకుంటాడు అతను చెబుతాడు, నాగభూషణంగారు మామూలుగా చావలేదని పద్మావతిగారే ఆయన్ని చంపేసిందని, కాఫీలో నిద్రమత్తు బిళ్ళలు ఎక్కువగా కలిపిఇవ్వడంవల్ల అరగంటలోనే ఆయన ప్రాణాలు విడిచాడని వేలాయుధం చెబుతాడు ఆమె ఎందుకిలా చేసిందో చెప్పనా అంటూనే అతను స్పృహతప్పిపోయి మరణిస్తాడు నిజంగా నాగభూషణం మరణం ఎలా జరిగిందనే సమస్య కథ చివర పాఠకుణ్ణి ఎదుర్కొంటుంది సోమర్సెట్ మామ్ అయితే పద్మావతే భర్తను చంపేసిందని చెప్పి నాగభూషణంపై పాఠకులకు సానుభూతి కలిగించవచ్చు మరికొందరు మరోవిధంగా భావించవచ్చు ఆ నిజానిజాలు పాఠకుడే నిర్ణయించాలని చెబుతూ రాగద్వేషాలతో నిమిత్తం లేకుండా వ్యక్తుల ప్రవర్తన పరిస్థితులకు అతీతం కానిదిగా త్రాసులో తూచి చూపడంగా పెట్టుకొన్న కాము ఆత్మహత్యకీ, హత్యకీ అంగీకరించమనీ, నాగభూషణంగారిది సహజమైన మరణమేనన్న తమ నమ్మకానికి రుజావుగా ఈ కథను ఇంకా పెంచలేక పోవడమేననీ అంటూ బుచ్చిబాబు కథను ముగించాడు, ఇలా చేయడంవల్ల సాధారణంగా పాఠకునికి కథంతా అందంగా వ్రాసి చివరన అందంగా చెడగొట్టినట్లనిపిస్తుంది అయితే పర్యవసానాన్ని కచ్చితంగా చెప్పివేయడంకన్న ఒకానొక ముఖ్యమైన ఉద్దేశంతో ఈకథ వ్రాయబడింది

కథ చివరలో కథకుడు కొన్ని విషయాలు వివేచన చేస్తాడు మరణకారణాలను కొంత విస్తృతంగా తర్కిస్తాడు ఇది పాఠకుణ్ణి కొంత తికమక పరచడానికి వీలుంది అయితే కథ అంతటా కథకుడు ఇటువంటి స్వీయాభిప్రాయాలను తరచు వెలిబుచ్చుతూ తర్కిస్తూ విమర్శ చేస్తూ పోతూవుంటాడు బుచ్చిబాబు కథలలో సామాన్యంగా ఈ స్వీయాభిప్రాయాలుంటాయి ఇవేమిటీ అని విసిగించుకొనివదిలేస్తే కథ చదివి ప్రయోజనం లేదు కథకునిలో తాత్వికుని లక్షణాలున్నప్పుడు ఆ అభిప్రాయాలకు చాలా ప్రాధాన్యముంటుంది. అసలు కథకన్న ఆ అభిప్రాయాలే మనల్ని కదలించివేస్తాయి ఆలోచనలు రేకెత్తిస్తాయి కనుక ఇది డిటెక్టివు పద్ధతిలో పరిశీలించవలసిన కథ కాదు డిటెక్టివ్ కథగానే కన్పిస్తుంది కాని ఆ విధంగా పరిశీలన చేయడానికి పూనుకుంటే అటో ఇటో తేలదమో, లేదా చివరకు అయోమయత్వం ఏర్పడదమో సంభవిస్తుంది. పాఠకుడు చివరకు అద్భుతరసంలో పడిపోవదమో లేక దిక్కు-

లేపీ విడిపోక వితర్కించుకోవడమో జరుగుతుంది నాగభూషణంగారు ఆత్మహత్య చేసుకున్నాడని పద్మావతి చెప్పింది ఆమె మాటనే విశ్వసించాలంటే అదొకవాదన భార్య వైఖరి గ్రహించి ఆయన అలా చేసుకున్నాడేమోనని విశ్వసించవొచ్చు కాదు. నాగభూషణంగారిని పద్మావతే చంపివేసిందని వేలాయుధం చెప్పాడు దీన్ని సమర్థించడానికి కొన్ని కారణాలు కూడా చెప్పవచ్చును. ఏమిటంటే భర్త ఆత్మహత్య చేసుకుంటాడని ఆవిడ చాలా ఆశపడి వుండవొచ్చు కాని అలా జరిగే సూచనలు లేనందున తనే ఆ పని చేసివుండొచ్చు ఇది రెండవ వాదన అదీకాదు. వేలాయుధం చెప్పింది కూడా విశ్వసించడానికి వీలు లేదు ఎందుకంటే కలిమిలేములకు ఎప్పుడూ పడదు. వేలాయుధం సంఘంలో క్రిందితరగతికి చెందినవాడు కాబట్టి పైవర్గానికి చెందిన పద్మావతిపై అపవాదువేశాడు. నాగభూషణంగారి మరణం సహజమైనదే ఎందుచేతనంటే ఆయనకు అప్పుడప్పుడు గుండెనొప్పి వస్తూవుండేది ఇది మూడవవాదన కాని ఇదీ సరికాదు వేలాయుధం అపవాదు వేశాడనడానికి వీలులేదు. పద్మావతిగారిలోవున్న సుగుణాలను అతను లోగడ ప్రశంసించివున్నాడు పెట్టుపోతలలో ఆమె అన్నపూర్ణ అని చెప్పాడు ఒక పర్యాయం కథకుడితో అయినా ఆమె నడత విషయంలో అతనికేమైనా అనుమానాలు కలిగాయేమో! మరి ఈ మూడింట్లో దేన్నినమ్మడం? ఈ విజిగీషలో పడిపోతే ఆలోచించినకొద్దీ ఏవో లోతులు, కోణాలు గోచరిస్తాయి. డిటెక్టివ్ కథను మించిన కొన్ని విలువలు ఈ కథలో సాధింపబడినవి ఆ విలువల్ని చూపెట్టడమే కథకుడి ఉద్దేశం కథకుడు ఒక సమస్యను మన ముందుంచాడు అంతే, దానికి పరిష్కారమేమిటో చెప్పలేదు ఫలానా కారణం అని గట్టిగా చెప్పలేదు పైగా సహజమైన మరణమే అనుకోండి అన్నాడు Suspense పెట్టి ఇంతకథా వ్రాసి సహజమైన మరణం అని చెప్పడంలో అంతరార్థమేమిటి? అక్కడేవుంది కథకుడు ఈ కథను వ్రాయడంలో గల ముఖ్యోద్దేశం ఏదో కారణమని కచ్చితంగా చెప్పివేస్తే, లేదా ఫలానాకారణమై ఉంటుందని పాఠకుడు తేలికగా ఊహించుకోవడానికి ఆస్కారం కలిగిస్తే కథలో మిగిలేదేమిటి? ముక్కూ మొగమూ తెలియని రామయ్యగారు ఎలావుంటారు, ఎటువంటివారు అని ఎవరైనా ప్రశ్నిస్తే వారిని ఆ రామయ్యగారింటి గుమ్మంలోకి తీసుకుపోయి పరిచయం చేయించి ఇక మాట్లాడుకోండని చెప్పడం మాదిరిగా కథకుడుకూడా ఈకథను సృష్టించి, సమస్యను వివేచనచేసి, విలువలు కట్టుకోండని ఈపాఠకులకు వదిలిపెట్టాడు సంఘంలో లేదా వ్యక్తులలో లోపం ఎక్కడుందో చూపడం కథకుడిపని. కథచిన్నదైనా పద్మావతి, నాగభూషణం, వేలాయుధం పాత్రలు విపులంగానే బోధపడుతున్నవి. నాగభూషణంగారి మరణం ఎలా కలిగింది అనికాదు ఇందులో ఆలోచించవలసింది. ఎందుకు కలిగిందని ఆలోచించాలి ప్రతి జీవితం మృత్యువుతోనే అంతమవుతుంది. కాని మృత్యువు ఒక జీవితాన్ని అంతంచేసిన తరువాత కూడా మిగిలేవి ఆ జీవితపు విలువలు. ఆ విలువలు కూడా ఒక్కొక్క పాఠకుడు తన అంతరాంతరంలో విశ్వసించే కారణాన్నిబట్టి, పరిశీలించగల లోతులనుబట్టి ఉంటాయి పురుషులలోగాని స్త్రీలలోగాని ఏ పాత్రపై సానుభూతి చూపినా లేక ఏ పాత్రను ద్వేషించినా సత్యం అవగతంకాదు. ప్రాథమికమైన విలువలు మారవు. కనుక అట్టి విలువలనే శోధించడానికి యత్నించాలి. సమాజంలో పైకి కన్పించే మర్యాద, సం

దాయం ఎంతో ఘనంగా, కట్టుదిట్టంగా కన్పిస్తాయి కాని లోపల ఎంతో కుళ్ళువుంటుంది భార్యాభర్త లిద్దరూ చక్కని కుటుంబంతో సుఖంగా సంసారం చేస్తున్నట్లే కన్పిస్తారు. కాని లోపల ఒకరు అతృప్తవాంఛలతో బాధపడుతూవుంటారు మరొకరు అవతలి వ్యక్తిసంగతి ఎరిగివుండి కూడా తాము చేయగలదేమీ లేదని సర్దిపెట్టుకొని సమాజానికి వెరచి, పరిస్థితిని చూస్తూనే కాలం వెళ్ళబుచ్చుతూ ఉంటారు సమాజం ఇంతవరకూ గ్రుడ్డిది కాని అగ్ని పర్వతం బ్రద్దలైనట్లుగా ఆ సంసారంలో ఏదో జరిగేసరికి కళ్ళు తెరుస్తుంది పరిపరివిధాల అనుకొంటుంది సమాజం సంగతి ఎలావున్నా వ్యక్తులు తమవాంఛలను విసర్జించుకుంటే ఎట్టి దుస్సంఘటనలు జరుగవేమో ! కాని వ్యక్తులు మనస్సును జయించలేకపోతున్నారు పరిస్థితులకు అతీతులు కాలేకపోతున్నారు ఎప్పుడో ఒకప్పుడు బైటపడుతారు పద్మావతి విషయంలో కూడా ఇదే జరిగింది తన కూతురు పెళ్ళిసంగతి ఎత్తితే "మా అమ్మాయి అసలు పెళ్ళే చేసికోదు" అని చెబుతూ తనని మళ్ళా జీవించమంటే పెళ్ళే చేసుకోకుండా ఉండునని పద్మావతి ఒకపర్యాయం ధ్వనింపజేసింది ఈ ఒక్క వాక్యం చాలు ఆవిడ ధోరణిని గ్రహించడానికి

ఒకానొక సంఘటనను ఎత్తుకొని దాన్నిగూర్చి మనవైఖరి, మామ్‌వైఖరి, కథకుని వైఖరి ఎలా వుంటుందో సాదృశ్యంగా చూపడం, ఈమూడు వైఖరులకు సర్వసామాన్యమైన విలువలేవో సూచనప్రాయంగా చెప్పడం—ఇదీ "మీరూ, నేనూ, మామ్" కథలోని లక్ష్యం ఆ రీత్యా ఇది ఒక వైశిష్ట్యం గల కథ

కథానికా రచనకు పాత్రలను స్వీకరించాలంటే సంఘంలో రెండురకాల వ్యక్తులు కన్పిస్తారు ఒకరకంవారు ప్రధానమైన వ్యక్తులు వీరినిగూర్చి కథలు వ్రాయడానికి సావకాశం తక్కువ ఎందుచేతనంటే వారి బుద్ధివికాసమే వారి మనఃప్రవృత్తులను కొంతవంకు అణచి ఉంచుతుంది రెండవరకంవారు పెంకితత్వం గలవారు వీళ్ళవి విపరీతమైన చిత్తప్రవృత్తులు కాలంయొక్క గతితోపాటు మారడం అలవాటు చేసుకోలేక ఎదురుతిరిగే ఈ రకం తత్వాలలో కథలు అనంతంగా సృష్టి అవుతాయి పాలగుమ్మి పద్మరాజుగారు ఈరకం తత్వాలనే తమ కథలలో ప్రధానంగా తీసుకొచ్చారు వారిలో అసంస్కృతికంగా మిగిలిన చిత్తప్రవృత్తులను చిత్రించారు కాని అటు ప్రధానవ్యక్తులు కాకుండా, ఇటు పెంకితత్వాలు కాకుండా మధ్యరకం వ్యక్తులను పాత్రలుగా తీసుకొని ఏకథైనా వ్రాయాలంటే రచన అంత ప్రోత్సాహకరంగా నడవదు ఒకవేళ ఏవో కల్పనలతో నడచినా పాఠకునిలో తీవ్రమైన భావాలు, ఊహలు రేకెత్తించేటంతటి ప్రతిభ అందులో ఉండదు మరి బుచ్చిబాబు ఈ కథలో తీసుకున్నది అటువంటి పాత్రలనే అయినా పాఠకుడు లోకాన్ని ఒక పర్యాయం పర్యాలోకన చేసుకునేటంతటి తీక్ష్ణమైన మానసికాందోళన కలిగిస్తుంది కథ అందుకు కారణం లౌకికమైన సంసార బంధనానికీ, వ్యవస్థకీ అలౌకికమైన మానవతాత్విక విలువలకూగల వ్యత్యాసం చూపబడడమే

పట్టణవాసాన్నిగూర్చి, నాగరకవ్యక్తులనుగూర్చి కథలు వ్రాసినవారిలో బుచ్చిబాబు అగ్రశ్రేణికి చెందిన రచయిత. ఆ వ్రాయడంకూడా బహువయ్యారంగా, ఫ్యాషన్‌గా వ్రాశాడు

ఆ జీవితంలోకి, ఆ వ్యక్తుల్లోకి ప్రవేశించి చిత్రమైన సంఘటనలను ఊహించి, రమణీయమూ, గంభీరమూ అయిన సన్నివేశాలతో కథలు సృష్టించారు.

## కళాస్వరూప మివ్వబడిన మహత్తరమైన అనుభవం

బుచ్చిబాబు వ్రాసిన కథలన్నిటిలోకీ "నిరంతరత్రయం" అనే కథను ఉత్తమమైన కథగా నేను భావిస్తాను ఆయన వ్రాసిన కథలలో దీనిని magnum opus అనవచ్చు ఇది చాలా పెద్ద కథ రాజకీయాలు, ఆర్థిక స్థితిగతులు, ప్రేమ, సానుభూతి, నైతిక విలువలు మొదలగు అనేకవిషయాలు ఈ కథలో చర్చించబడ్డాయి ఈ ఇరవయ్యో శతాబ్దంలో రాజకీయ స్వాతంత్ర్యం, ఆర్థిక సమానత్వం, సాంఘిక సమానత్వం మొదలైన అనేక నినాదాలు విన వస్తున్నాయి ఆర్థిక అసమానత్వమే నేటి ప్రపంచంలో మానవుని దుఃఖానికి, అసంతృప్తికి కారణమనీ, ఆర్థిక సమానత్వం సాధింపబడితే అన్ని ఇబ్బందులూ తొలగిపోయి మనుష్యులు సుఖంగా ఆనందంగా జీవితం వెళ్ళబుచ్చుకోగలరనీ కొందరంటారు ధనికుల ఆస్తులను బీదవాళ్ళకు పంచిపెడితే సమస్యలన్నీ ఇట్టే పరిష్కారమవుతాయని అంటారు ఈ అంశానికే ఈ కథలో తగు సమాధానం ఇవ్వబడింది

రాజకీయ భావాలను కథల ద్వారా ప్రచారం చేయడం విదేశాలలోను, మనదేశంలోనూ జరుగుతూ ఉన్నది ఈరకం కథలు వ్రాసేవారు ప్రేమకథల్ని అపహాస్యం చేస్తారు భూస్వామి తత్వపు విలువల్ని దూయబట్టుతారు ధనికులపై ద్వేషం, బీదలపై సానుభూతి వుండాలంటారు కాని బుచ్చిబాబు ఇదంతా తప్పు, చారిత్రక రాజకీయ పరిస్థితులవల్ల సంఘాన్ని పరిశీలించి సంస్కరించడం కళపనికాదు, కావాలంటే దానికోసం వ్యాసాలు వ్రాయండి, ఉపన్యాసాలివ్వండి, ఉద్యమాలు లేవదీయండి కాని కథల్లోకి దించకండి బాబూ అంటారు వ్యక్తులు రాజకీయ ఆర్థిక పరిస్థితులకు లొంగిపోయి, కీలుబొమ్మలైన పక్షంలో వారి ప్రవర్తనకు వారు బాధ్యులుకారు, సమాజం అవుతుంది అట్లాంటప్పుడు మంచి చెడ్డలకు నైతిక విలువలకు స్థానమే వుండదు బాహ్యప్రపంచంలో శక్తులకు లొంగిపోకుండా, వాతావరణానికి అతీతం కాగలిగినప్పుడే వ్యక్తిగతమైన నీతి ప్రస్తావనకి తావుందంటారు కాని చిత్రమేమిటంటే ఇట్లా అనుకోవడం కూడా భూస్వామి తత్వపు నాగరికత లక్షణం అని ఆధునికులలో ఒకవర్గంవారు ఈసడించుకుంటారు

ఈ విషయ మే "నిరంతరత్రయం" అనే కథలో బుచ్చిబాబు చాలా దీర్ఘంగా చర్చించారు. ఈ కథలో నాయకుడు కరుణాకరం, ఇతను చాలా చదివాడు రెండవవ్యక్తి కామేశం పెద్ద స్థితిపరుడు మూడవ వ్యక్తి కామేశం భార్య సుగుణ ఈమె విద్యావంతురాలు, అందగత్తె, పిల్లలు లేరు. నాల్గవ వ్యక్తి కథకుడు కరుణాకరం, కామేశం, కథకుడు చిన్నతనంనుంచీ ఒకే చోట చదువుకున్నారు. కరుణాకరం బీదవాడవడంచేత అతని కాలేజీ చదువు ఖర్చువంతా స్నేహితులు, ముఖ్యంగా కామేశం భరించేవాళ్ళు కామేశం పరదాకోసం చదువుకునే కులాసా పురుషుడు. కరుణాకరం బీదవాడైనా, అతని ఖర్చులను స్నేహితులే భరిస్తున్నా, ఎక్కువగా

కామేశమే సహాయం చేస్తున్నా అతనన్నదానికల్లా ఊకొట్టే బానిసత్వపు లక్షణాలు కరుణాకరంలో లేవు

ముగ్గురూ కాలేజీ వొదిలిపెట్టిం తర్వాత ఏడెనిమిదేండ్లకు కథకుడు పట్నంలో కామేశాన్ని కలుసుకుంటాడు కామేశం భార్య సుగుణ జబ్బుపడి నర్సింగ్‌హోంలో ఉంటుంది. ఆమెది ఫలానా జబ్బు అని చెప్పడానికి వీలులేదు మనిషి నీరసంగా వుంటుంది సామాన్యంగా భాగ్యవంతులకివొచ్చే అయోమయమైన బలహీనత చాలా అందమైన జబ్బు అది దానికి మందు ప్రశాంత వాతావరణంలో అమితమైన తీరికే కామేశం కులాసా మనిషి. హృదయ మున్నవాడు కల్లాకపటం లేకుండా స్వేచ్ఛగా మాట్లాడుతాడు మనసులో వున్న మాటను దాచలేడు కాని సుగుణ అలాకాదు ఆమె కేవలం స్త్రీ ఎంత అందంగా ఎంత ఫేషన్‌గా వుంటుందో అంత గుంభనమైన మనిషి ఆమె అంతరంగాన్ని కనుక్కోవడం చాలా కష్టం కామేశం ఆమెని పువ్వులలోపెట్టి పూజిస్తున్నా ఆవిడ వైఖరి అదో తీరుగా ఉంటుంది బహుశా భాగ్యంవల్ల, సంపన్నత్వంవల్ల కలిగే నిర్లక్ష్య వైఖరికావచ్చు లేదా శారీరకమైన కారణం కావచ్చు ఇవి రెండూకూడా నని మనం అనుకోవచ్చు సుగుణ బహిరంగంగా పదిమందిలోను వున్నప్పుడుతప్ప తీక్షణంగా జీవించలేదు ఏకాంతం ఆమెకి తగదని కథకుడే అనుకుంటాడు

నర్సింగ్‌హోం ఘట్టం జరిగిన ఒక ఏడాదికి కథకుడు పట్నంలోని మందులషాపులో కరుణాకరాన్ని కలుసుకుంటాడు. కరుణాకరం అతన్ని గుర్తుపట్టి ఆప్యాయంగా పలుకరిస్తాడు ఇప్పుడు కరుణాకరం కామేశం దగ్గిరే ఉంటున్నాడు కామేశానికి టి బి జబ్బు అని నిర్ధారణమైపోయింది. అతని కెవ్వరూ లేరుకాబట్టి అతని కోరికపైనే కరుణాకరం వాళ్ళ దగ్గిరవుండి మందులూ మాకులూ తెచ్చిపెడుతూ, నర్సింగ్‌హోంలో కామేశాన్ని కనిపెట్టుకుంటూ సుగుణకు ధైర్యం చెబుతూ వాళ్ళ ఇంటి వ్యవహారాలను చూస్తూవుంటాడు కథకుణ్ణి కరుణాకరం నర్సింగ్‌హోంకి తీసుకెళతాడు కామేశం జబ్బుతో చాలా నీరసించిపోయినా కులాసాగా మాట్లాడే అతని తత్వం అలాగేవుంది కథకుడు అతన్ని పరామర్శిస్తాడు సానుభూతి ప్రకటిస్తాడు కరుణాకరం చేస్తున్న సేవకు తాను ఋణం తీర్చుకోలేనని కామేశం చెబుతాడు తన జబ్బు నయమైన తరువాత అతన్ని ఏ వూటీకో పంపి రెస్టు ఇవ్వాలంటాడు

నర్సింగ్‌హోంనుంచి కరుణాకరం కథకుడు ఇంటికి వెళ్లతూవుంటారు ఆ సాయంత్రం కరుణాకరం తనకొచ్చిపడ్డ సమస్యను చెబుతాడు కథకుడితో సుగుణ తనని ప్రేమిస్తోందనీ, ఆ వ్యవహారం ఇంకా ముదరక ముందే తాను వెళ్ళిపోవాలని చూస్తున్నాననీ, కాని కామేశం వుండమంటున్నాడనీ, అదే తన కిప్పుడు వొచ్చిపడ్డ సమస్య అనీ చెబుతాడు కరుణాకరం "నువ్వామెను ప్రేమించావా" అని కథకుడు అడుగుతా డతన్ని దాని కతను సూటిగా సమాధానం చెప్పలేక అతనికీ, ఆవిడకీ జరిగిన వ్యవహారాన్నంతా చెబుతాడు అతని మాటలవల్ల అసలు చొరవ తీసుకున్నది సుగుణేనని తేలిపోయింది కామేశం అలా జబ్బుగావుంటే "మనం ఇలావుండటం భావ్యంకాదు" అని కరుణాకరం ఆమెని హెచ్చరిస్తాడు అయినా ఆమె వేళాకోళం చేసేటంతటి చనువు కనబరచసాగింది కామేశం ముందుకూడా ఈ చను

వును దాచడానికి ప్రయత్నం చేయలేదు ఆవిడ ఒంటరిగావుంటే తల్లో పూలెట్టుకుంటుంది భర్తముందుకు పోతే వాటినితీసి దాచేస్తుంది కరుణాకరం కబుర్లు వ్రాతలు విప్లవధోరణిలో ఆధునికంగా కనబడినా అతను ఆచార వ్యవహారాల్లో పూర్వకాలపు మనిషని భర్తతో హేళనగా మాట్లాడుతుంది ఆమె కన్పరచిన ప్రేమకు అతను వెంటనే సానుకూలం కానందుకు ఆమె కోపగించుకుంటుంది అతనూ ఆమెను ప్రేమించాడు కాని ఆ ప్రేమను ప్రకటించలేదు తప్పించుకు తిరుగుతున్నాడు

ఈ కథకిల్లా ప్రాణంవున్న ఘట్టం ఇదే ఇక్కడే కథ ప్రబలమైన ఒకసమస్యను ఎదుర్కొంటుంది. మానవ జీవితానికి సంబంధించిన మహత్తరమైన సమస్యఅది స్త్రీ స్వాతంత్ర్యం స్త్రీ విద్య అనే వివాదాలు విప్పుడుతున్న ఈ ఇరవయ్యో శతాబ్దంలో ఎంతోమంది స్త్రీ పురుషుల నెదుర్కొంటున్న సమస్యఇది కరుణాకరం బీదవాడు స్నేహితుడు కామేశానికి జబ్బుగా వుంటే వచ్చి అతన్ని ఆదుకుంటున్నాడు కామేశం అతనికి ప్రాణమిత్రుడు, సరసుడు, హృదయం ఉన్నవాడు అయితే ఆర్థికంగా ఆ దంపతులమీద ఆధారపడినవాడు కరుణాకరం కాని భర్త జబ్బుగా ఉండడంవల్ల ప్రేమతో దహించుకు పోతోంది సుగుణ దాన్ని ప్రేమ అనవచ్చు కామం అనవచ్చు, లేదా చిత్త చాంచల్యం అనవచ్చు ఏమన్నా ఆమె పరిస్థితి అది "వెన్నెట్లోంచి మిట్టమధ్యాహ్నం ఎండలో కొచ్చినట్లు సుగుణ కనబడుతూవుంది ఆమెలో ప్రచండ శక్తులు, సముద్రం లోతుల్ని కదిల్చే ఇంద్రియాల తీవ్రత ప్రజ్వరిల్లుతున్నాయి అనుకూల వాతావరణం, సానుకూలమైన వ్యక్తి ఉన్నప్పుడే స్త్రీ చొరవ ప్రకటిస్తుంది సుగుణ జీవితాన్ని ఒక కళగా అనుభవిస్తుంది అసాధారణ పరిస్థితులు, అపూర్వ అనుభవాలు నిర్మించుకుంటేగాని ఆమె సంపూర్ణ వికాసంపొందదు. ఈ ఘట్టంలో బుచ్చిబాబు వ్రాసిన ఈ క్రింది వాక్యాలు ఈ కథ వ్రాయడంలో ఆయనకుగల ఉద్దేశాన్ని వ్యక్తపరచడమేగాక ఆర్థిక సమానత్వంవుంటే మనుషులు సుఖపడతారన్న వాదనలోని నిజా నిజాలను బైటపెడతాయి బుచ్చిబాబు వ్రాస్తాడు —

"నీతిని గురించిన చింత ధనికులకే గాని బీదవారికి సాధ్యపడదని ఒక ఆధునిక అభిప్రాయం ప్రబలివుంది మార్క్సిస్టు వాదాన్ని భగవద్గీతగా చూచుకొనేవారు బీదవారు నీతిగా వుండనక్కర్లేదనడం బదులు అల్లా వుండటం అసంభవమని వాదిస్తున్నారు బెర్నార్డ్‌షా నాటకంకూడా వ్రాశాడు ఇది నా దృష్టిలో సరియైన అభిప్రాయంకాదు ఇంకా ప్రాకులాడేటందుకూ, తమ ఆధిక్యతని ప్రకటించేందుకూ ఇంకేమీ లేనందున బీదవారికి నైతికచింతన మిగిలిందంటాను భాగ్యవంతులు సంఘంచేసే తీర్పులకు తలొగ్గకుండా త్రోసిపుచ్చగలరు ఆచార నియమాలను అతిక్రమించగలరు నైతికచింతన వారికవసరంలేదు కరుణాకరం పరిస్థితి ఈ విషయాన్ని ఋజువుచేసిందనిపించింది ప్రేమించినా అతను ప్రేమను ప్రకటించలేదు పరపురుషుడి భార్యను ప్రేమించడం అన్యాయమని అంగీకరిస్తున్నాడు తన గుప్పెట్లో కొచ్చిన అపూర్వ అనుభవాన్ని నీతిపేరిట వొదిలేశాడు సుగుణ తన దబ్బుని కరుణాకరంతో పంచుకున్నదంటే మార్క్సిస్టుమిత్రులు హర్షిస్తారు. కాని ప్రేమనిపంచుకున్నదంటే హర్షిస్తారా"?

ఇదీ బుచ్చిబాబు పాఠకులకువేసిన ప్రశ్న దీన్ని కొందరు అ స్తవ్య స్తమైన ప్రశ్నఅనవచ్చు ఆర్థిక విషయానికీ, స్త్రీ పురుషసంబంధాలకూ ముడిపెట్టడమేమిటని వారు అడుగవచ్చు. నిజమే కావచ్చు కాని ప్రపంచంలోని నేటి అరిష్టాలన్నిటికీ కారణం ఆర్థిక అసమానత్వమేనన్నట్లుగా కొందరు మాట్లాడుతూ ఉంటారు మానవ జీవితంలో ఆనందం కావాలంటే అందుకు ఒక్క ఆర్థిక విషయమే గాక మరెన్నో అంశాలున్నాయి మానవ జీవితానందం అనేక పరిస్థితుల ప్రభావాలకు లోబడివుంటుంది "ఆర్థిక స్వాతంత్ర్యం వుంటే మిగతా అన్నింటిలోనూ స్వతంత్రులు కావొచ్చుననుకుంటారు గాని, నిజానికి ఊహలో తప్ప మనుష్యులు స్వతంత్ర జీవులు కారు"అని బుచ్చిబాబు ఒకచోట కరుణాకరం అన్నట్లు వ్రాస్తాడు ఒకబీదవాడు ధనికుల జీవితపు అంతస్తులో అడుగుపెట్టి స్వానుభవంవల్ల తెలుసుకొన్న సత్యం ఇది ఎప్పుడైనా సత్యం మూలకారణాన్ని చూపిస్తుంది గాని రాజకీయ సిద్ధాంతాలుకావు

బుచ్చిబాబు కథను ఇంతటితో ముగించలేదు కారణం ఈ సమస్యను చర్చించి ఒక నిర్ణయానికి రావడమే ఆయన ప్రధానోద్దేశంకాదు సుగుణ వ్యక్తిత్వం ఇంకా విపులీకరించబడింది కథలో ఆమె ప్రేమకలాపాన్ని ఆపదు తాను నేరస్థురాల్ని అని ఒప్పుకుంటూనే ప్రేమకలాపాన్ని సాగిస్తుంది కామేశం జబ్బుకూ, తన ప్రేమకీ సంబంధం లేదంటుంది తనను కరుణాకరం ప్రేమించాడన్న చైతన్యం ఆమెలో వుంది ప్రేమలో దగాచేసుకోడం లేనికంటుంది రహస్యంలేకపోవడమే ప్రేమలక్షణమంటుంది అతను అంతగా విముఖుడైతే కామేశానికి జబ్బు తగ్గింతర్వాత ప్రేమ ప్రకటించుకోవడానికి, అంతవరకూ ఆగడానికైనా ఒప్పుకుంటుంది కామేశంబ్రదకడనే ఆమె నమ్మకం కామేశంజీవించివున్నంతవరకూ దూరంగా వుందామని ఇద్దరూ ప్రమాణం చేసుకుంటారు తరువాత అతను ఉద్రేకంలో చేసిందానికి పశ్చాత్తాపపడి ఏడుస్తాడు

కాని విధి బలీయమైంది కామేశానికి నయమవుతుంది హాస్పిటల్ నుంచి డిశ్చార్జి అవుతాడు కరుణాకరానికి క్షయ అని తేలిపోతుంది అతను శానిటోరియంలో చేరుతాడు అతనికి సపర్యలు చేయాలనీ, అతని వ్యాధి నయమయ్యేదాకా ఎటూ వెళ్ళకుండా కనిపెట్టుకు ఉండాలనీ కామేశం ఉత్సహిస్తాడు కాని సుగుణ మారిపోతుంది కరుణాకరం అంటే విసుగ్గా మాట్లాడుతుంది అతన్ని శానిటోరియంలో వదిలిపెట్టి ఊటీ, బెంగుళూరు పోదామని భర్తను వేధిస్తుంది అతను అట్లా జబ్బుతో బాధపడుతుంటే తాము దంపతులం అలా కులుకుతుంటూ ఉండడం భావ్యం కాదని కామేశం అంటాడు భార్యాభర్తల పరిస్థితి ఇట్లావుంటే కరుణాకరం విచిత్రమైన కోర్కెల ప్రభావానికి లోనయ్యాడు మంచాన పడింతర్వాత అతనికి సుగుణ పరిచయం కావలసివొచ్చింది ఎందుకో ఆమెపై తనకొక హక్కువున్నట్లు భావిస్తున్నాడు కాని ఆ విషయం ఆమెతో ముచ్చటించే సాహసం అతనికి లేదు కామేశం భార్య వేధించిన ప్రకారం చేయలేదు తన సుఖాన్ని త్యాగంచేశాడు కామేశం కోసమైనా తన జబ్బు త్వరగా నయమవాలనుకుంటాడు కరుణాకరం అతనికి అలాగే జబ్బుతగ్గుతూంది శానిటోరియం నుంచి డిశ్చార్జిచేసే పరిస్థితి వొస్తుంది కాని ఈ లోపలే కామేశం, సుగుణ వూరెళ్ళిపోతారు కరుణాకరం అకస్మాత్తుగా చనిపోతాడు. అతని మరణానికి డాక్టర్లే ఆశ్చర్యపోతారు. తనకు

నయమైంది. రావలసిందని కథకుడికి టెలిగ్రాం ఇస్తూ తన సంతోషాన్ని పంచుకొనేవాళ్లెవరూ లేరన్న దుఃఖంతో, వ్యాకులతతో కరుణాకరం చనిపోతాడు అతను ఆత్మహత్యచేసుకున్నాడని మనకు స్ఫురించడానికి తగు కారణాలున్నవి

కరుణాకరం సుగుణని ప్రేమించలేకపోలేదు ప్రేమించాడు అయితే ఆ ప్రేమను ప్రకటించలేదు కామేశానికి జబ్బు నయంకాగానే సుగుణ తనప్రేమను యథాప్రకారం అతని మీద కేంద్రీకరింపజేస్తుందేమో అని కథకుడు సమాధానం చెప్పినప్పుడు అతను చకితు డయ్యాడు సుగుణది అంత చపలమైన ప్రేమా అని ప్రశ్నిస్తాడు ప్రేమే అంతటిదని కథకుడు సమాధానం చెప్పినప్పుడు స్త్రీ ప్రేమపై అతనికి నమ్మకంలేనట్టుందంటాడు కాని కథకుడు స్పష్టంగా చెప్పేస్తాడు "తప్పకుండా నమ్మకం వుంది కాని ఏ ఒక్కరూ నాది అపూర్వమైన ప్రేమంటే మాత్రం నేను నవ్వుకిమానను బకెట్ బంగారంది కావొచ్చు, వెండిది కావొచ్చు, రాగిది కావొచ్చు, ఆఖరికి ప్లాస్టిక్ ది కావొచ్చు, లోపలివి మామూలునీళ్ళే" అని కరుణాకరం సుగుణను ప్రేమించాడనీ, తన జబ్బు నయమైంతరువాత ఆమె ప్రేమను పొందడానికి Unconscious గా తాను ధనవంతుడవ్వాలని కాంక్షించాడని చెప్పడానికి ఒక్క నిదర్శనం కన్పిస్తుంది జబ్బులో ఉండగా క్రాస్‌వర్డ్ పజిలుకు కట్టి అందులో తప్పకుండా నెగ్గుతానని ఆశలుపెట్టుకుంటాడు ఆ డబ్బుతో తాను చేయదలచుకున్న వాటినిగూర్చి కలలు కంటాడు హాలీవుడ్ వెళ్ళి సినిమాతారలను చూచి, ఏదైనా పత్రికలో చేరిపోయి అక్కడే వుండిపోతాట్ట ఈ ఒక్క అంశమే అతని మనస్సులో నిరంతరం సుగుణ తిరుగుతూందన దానికి నిదర్శనం కాని కామేశానికి నయమై తాను శానిటోరియంలో పడ్డతర్వాత సుగుణ వైఖరిని చూచి అతను బాధపడ్డాడు, ఏడ్చాడు సుగుణని తానుప్రేమించలేదని చెప్పుతున్నాడు. తన నగ్నహృదయాన్ని బైట పడేశాడు ఆశాభంగం పొందాడు అసలు తనకు జీవితంలో ఇటువంటి సంఘటన ఎందుకు జరిగిందా అని వాపొయ్యాడు సుగుణ వైఖరికి మళ్ళీ తానే సమాధానంచెప్పుకున్నాడు. హృదయం క్షణక్షణంజీవిస్తుంది, ఆశిస్తుంది, అనుభవిస్తుంది-అంతే శాశ్వతాన్ని ఆదేశించదు. మనం శాసిస్తాం శరీరాలకి లేని అమరత్వం, ఆత్మల కెలావొస్తుంది రావాలని కోరడం మనం ఆత్మలకి చేసే అన్యాయం అసలు ఈ లోకంలో ఎవ్వరూ ఎవర్నీ ప్రేమించలేరు మనుషులకి కావలసింది ప్రేమకాదు. ప్రేమ శరీరానికి కావాలి హృదయం కోరేదీ కాస్తంత దయ, కొంచెం అప్యాయత, అదరణ-అంతే

కథలోని ఈ నాలుగు పాత్రలలో కథకుడు, ఒక ప్రేక్షకుడు, మధ్యవర్తి మాత్రమే. కాని మిగతా మూడుపాత్రలు మన భావప్రపంచంలోకి ప్రవేశించి మాలో ఎవరం ఎటువంటి వారం అని ప్రశ్నిస్తాయి కామేశంపై మనకు గౌరవభావం ఏర్పడుతుంది అతని త్యాగంలో పరిపూర్ణతవుంది మానవుడు ఎంత ఎత్తైన శిఖరాన్ని అందుకోగలడో ఆ పాత్ర సూచిస్తుంది. ఇక సుగుణ సూక్ష్మంగా ఆలోచిస్తే ఆవిడపై మనకు ఏహ్యభావం ఏర్పడుతుంది, కరుణా కరాన్ని పాడుచేసింది ఆమేనని ఆరోపిస్తాము. కాని ఆమె కేవలం స్త్రీ ఆమెను మనం పొగడలేకపోవచ్చు. కానిదూషించడం న్యాయముకాదేమో! ఈనాడు ఒకవర్గంవారు మార్క్సిష్టు మిత్రుల ననుసరించి ధనికుల ఆస్తులను పంచుకోవాలనడంలో ఎంత సబబువుందో ఆమె

కరుణాకరంతో ప్రేమను పంచుకోవాలని చేసిన ప్రయత్నంకూడా అంతే ఇక కరుణాకరం సంగతి బీదవాడయినా స్నేహితుణ్ని ఆదుకున్నాడు విగ్రహం అలవరచుకొని మిత్రుని భార్యను పతనం కాకుండా కాపాడాడు ఆ ప్రయత్నంలో సామాన్య మానవ సహజమైన బలహీనతకు లోబడిపోయినా చివరకు మాత్రం కామేశం సుఖాన్ని, వారి సంసార శ్రేయస్సును కాంక్షించే ఈ లోకంనుంచి నిష్క్రమించాడు ఆకలితో ఒక వ్యక్తి మరణించాడంటే ప్రభుత్వాన్ని నిందిస్తాము కాని ప్రేమవల్ల, భగ్నహృదయంతో తన పొరపాటును గ్రహించి, త్యాగభావంతో జీవితం చాలిస్తే ఎవరిని నిందిస్తాము ? విధి అని సరిపెట్టు కొంటాము "నిరంతర త్రయం" అనే శీర్షిక జీవితంలోని మూడు సత్యాలకు సూచనంగా పెట్టబడింది సత్యం, జ్ఞానం, ఆనందం ఈమూడింటిమధ్యనే మానవుడు జీవిస్తాడు ఈ మూడే స్థిరమైనవి

ఈ కథ ఒక మహత్తరమైన అనుభవం మరీ మహత్తరమైన అనుభవాన్ని ఎవరూ కళకూ ఉపయోగించుకో జాలరనీ అంటూనే బుచ్చిబాబు ఈ కథ వ్రాశాడు కథకుని వ్యక్తిత్వం వల్ల ఆ మహత్తరమైన అనుభవం ఒకగొప్ప కథగా తెలుగు సాహిత్యంలో అవతరించడానికి అవకాశం కలిగింది

ఇలాగే పరిశీలన చేస్తూపోతే ఈయనవి ఎన్నోకథలు ఉన్నవి "అడవికాచినవెన్నెల", "అజంతా", "టాస్కా", "మేడమెట్లు", "దేశం నాకిచ్చిన సందేశం", "దాగిలి మూతలు", "అరకులోయలో కూలిన శిఖరం", "నాసటన్ వ్రాసిన వ్రాత"—ఇవి ఈయన కథలలో కొన్ని శీర్షికలు

కథా రచనలో వ్యక్తుల చిత్రణంచేసే టప్పుడు, బుచ్చిబాబు ఇచ్చే ఉపమానాలు చాలా చిత్రంగా ఉంటాయి ఒక్కొక్కప్పుడవి మన నాగరిక సాంప్రదాయాలకి విరుద్ధంగా కూడా కన్పిస్తాయి అయినప్పటికీ ఈయన మనస్సుకు తట్టిన ఆలోచనను, భావాన్ని వెలిబుచ్చడానికి జంకడు ఉదాహరణకు "నన్నుగురించి కథ వ్రాయవూ" అన్న కథలో కుముదం వ్యక్తిలో ఆకర్షణీయమైంది ఎడతెగని యవ్వన మేమో అనిపిస్తుంది అంటూ ఆమె శరీరాన్ని గుర్రం పిల్ల కదలికలోని లావణ్యంతో పోల్చవచ్చు నంటాడు తన ఈ ఉపమానాన్ని తర్కంతో సమర్థించు కుంటూ "లేడి గంతులో శృంగారం వుంది, కాని బలంలేదు. కుక్కపిల్ల గంతులో కొంటెతనం వుంది కాని శక్తిలేదు మేకపిల్ల గంతులో వేగం వుందిగాని మృదుత్వం లేదు ఇవన్నీ గుర్రంపిల్ల అలిగినవాడు చేసే నాట్యంలో వుంటాయి" అంటాడు విచిత్రమైన తర్కం: అయినా కాదనలేము

వ్యక్తి వర్ణన చేసేప్పుడు మామ్ చమత్కారంగా ఓ పుటలో కళని, మరోచోట ముక్కుని, వొకప్పుడు చెలాకీని, మరొకప్పుడు కంఠాన్నీ మెరుపుల్లా ప్రదర్శించి చివరికి అతనూ మనం ఇంతటి అందమైన స్త్రీని కలుసుకునే భాగ్యం ఈ కథ మూలంగా కలిగిందనుకునే భ్రమ కలుగజేస్తాడు బుచ్చిబాబు ఈ విషయంలో ఒక్క అందాన్నేగాక ఆమె వివిధ అలంకరణలనుకూడా చూపెట్టి ఆవిడ అందంతోపాటు ఎటువంటి ఫ్యాషన్ మనిషోకూడా మనకు ప్రదర్శింపజేస్తాడు. ఉదాహరణకు "నిరంతర త్రయం" అనే కథలో ఒకచోట సుగుణను వర్ణిస్తూ "చేతికి ఎర్రరిబ్బన్ రిష్టువాచీ, రెండోచేతికి ఎర్రప్లాస్టిక్ గాజు, తలకి ఎర్ర

సిల్కు మఫ్లర్, జ్వాల ఆకారంలో ఎర్రబొట్టు, పల్చటి ఎర్రటి పెదవులు" అని చెబుతాడు. మరొకచోట ఆమెనే "సుగుణ స్నానంచేసి వొచ్చి, స్తంభానికి కాళ్ళు ఆనించి కూర్చుంది బోర్డర్‌లేని తెల్లచీర, తెల్ల వులెన్ మఫ్లర్ తలకి చుట్టుకుంది చెట్లఆకుల మధ్యనుంచి ఎండ కిరణాలుగాను నుదుటిమీద పడి, కనురెప్పల నీడల్ని. తీగలగా బుగ్గలమీదికి జారుతున్న దృశ్యం - కిరణం ఆమెగా అంతమైనట్లు నేనెప్పుడూ మరచిపోను" అని వ్రాశాడు క్షయ రోగయిన కరుణాకరాన్ని వర్ణిస్తూ "దట్టంగా పెరిగిన గడ్డం లోతు నూతిలో కన్పించిన ప్రతిబింబంలా నవ్వినప్పుడు పళ్లు దూరంగా మసగ్గా మెరుస్తున్నాయి కణతలకి అతుక్కుపోయిన చర్మంలోనుంచి ఆకుపచ్చ దారంలా వొంకర్లు తిరిగిన పచ్చనరాలు లేస్తూ పడుతూ కొట్టుకోడం, కళ్ళకింద ముడుతల్ని సహితం పీల్చుకొని కరిగించి అస్తి పంజరానికి అతికేసిన బుగ్గలపై చర్మం – శరీరం యంత్రంపై పొరలా, జీవితరహస్యాన్నీ, సృష్టిలో ఇంద్రజాలాన్నీ మన కళ్ళముందు ప్రదర్శించినట్లు అదిరిపడే స్మూకాలయం" అని చూపెట్టాడు. ఇదే కథలో టి బి ని గూర్చి చెప్పినమాటలు మరువరానివి "క్షయవ్యాధి దశలు– ప్రారంభం, ఔన్నత్యం, పరిమితి, పతనం వొక ప్రాచీనయుగం నాగరికత చరిత్ర లాంటిది దానికి యవ్వనంపైననే మోజు దానికి శారీరకానుభవం, కామం, ఆకలి, శృంగారం, వినోదం, సంతోషం, సంపద కావాలి. ప్రేమలా అది గ్రుడ్డిది వివక్షతలేకుండా మూర్ఖంగా వ్యక్తిని కామిస్తుంది ప్రేమలాగే ప్రాణాన్ని త్యాగంగా కోరుతుంది అనుభవంతో తీక్షణత తగ్గినట్లు వుండిపోతుంది పోయినట్లు పోయి వస్తుంది మనిషిలో రహస్య మందిరాలని కూకటివేళ్ళతో, జీవం ఆదిలో వేసిన పునాదుల్ని సహితం పెల్లగించి, ప్రతి అణువునూ తరచి చూచి, ఆవరించి, జీర్ణించి, పీడించి చంపేస్తుంది దానిష్టం ఒక్కొక్కప్పుడు 'పో అల్పుడా, నువునాకు తగవు, అన్నట్లుగా మహాశక్తిలాగా చెలగాటంతో కవ్వించి, వెక్కిరించి, వెన్నుమీద తాపుతన్ని, అధోలోకంలోకి అస్థిపంజరాన్ని గిరవాటెట్టి వెళ్ళిపోయి మరిరాదు టి బి శృంగార కావ్యం పురుషుడు దాని ఆటవస్తువు చావు బ్రతుకులు సంతానం"—ఎంత అనుభూతి, భావనా శక్తి కావాలి ఇలా వ్రాయడానికి ?

ఒకచోట "భాగ్యానికి, టెన్నిస్ ఆటకి ఏదో సంబంధం వున్నట్లనిపిస్తుంది" అంటాడీయన వ్యక్తుల్ని వర్ణించడంలో, ఉపమానా లివ్వడంలో, ఒక విషయాన్ని గూర్చిన తన ఆలోచనానీ, అనుభూతినీ వ్రాయడంలో, ఒకమాటను వయ్యారంగా, విలాసంగా ఆనెయ్యడంలో ఈయనతో మరి ఏ తెలుగుకథకుడూ సరితూగలేడంటే అతిశయోక్తికాదు ఇటువంటి విచిత్రమైన వర్ణనలు, ఉపమానాలు, Sentimental feelings ఈయన కథలనిండా కొల్లలుగా వున్నవి ఆ వర్ణనల్లో బుచ్చిబాబు touch తప్పకుండా ద్యోతకమవుతుంది వాటి వల్లనే ఈయన ఒక వ్యక్తిత్వం కలిగివున్నాడు

జీవితంపై ఒక దృక్పథంఏర్పరచుకోవడానికి ప్రయత్నించడం, సత్యాన్ని అన్వేషించడం, ఇవి రెండే ఏ రచనకైనా, ఏ రచయితకైనా గొప్ప విషయాలని బుచ్చిబాబు విశ్వాసమని మొదటే తెలుసుకున్నాము ఆ అన్వేషణలో ఈయనలో సహజంగా కొన్ని మార్పులు కలిగాయి. మొదట ఈయన ఫ్రాయిడ్ మనస్తత్వ శాస్త్రాన్ని బాగా పట్టించుకొనేవాడు, కాని ఇప్పుడు

దానిపై అంత పట్టింపులేదు మనుష్యులు కొన్ని సందర్భాలలో ఆ యా విధాలుగా ఎందుకు ప్రవర్తిస్తారో మనస్తత్వశాస్త్రం వివరిస్తుంది. కాని మానవ మనస్సుయొక్క ప్రాథమికమైన రహస్యాన్ని తెలుసుకోవడానికి ఆ శాస్త్రం పరిష్కారమార్గం సూచించలేదని ఈయన భావం. పైగా మరొక విషయంకూడా వుంది మనస్తత్వశాస్త్రమే సర్వస్వంగా ఎంచుకునేవారు ఒక పాత్రను పూర్తిగా విశ్లేషించడం కద్దు ఏ పాత్రనుకూడా పూర్తిగా విశ్లేషించి (analyse) చూప కూడదనీ దానివల్ల కళామూల్యం దెబ్బతినడమే గాక అలా ఒక వ్యక్తినిగూర్చి సర్వం తెలిసిపోతే అతనిపై మనకేమీ ఆసక్తి ఉండదని అంటాడీయన ఒకప్పుడు హేతువాదం, మానవవాదం ఈయన్ను ఆకర్షించాయి కాని ఇప్పుడీయనది ఒక కళావేత్తమతం అని చెప్పాలి మానవ జీవితంలోని వాస్తవాలను, విలువలను సహృదయంతో అర్థంచేసుకొని, బుద్ధితో పరిశీలించి, మానవ ఆత్మను సమున్నతస్థాయికి గొనిపోవడమే కళావేత్త ఆదర్శం రచయిత ఆదర్శాలను గూర్చి, భావాలను గూర్చి అంతగా ఆలోచించరాదు ఆ ఆదర్శాలను ఎంతవరకు ఆ రచయిత తన రచనల్లో వ్యక్తంచేశాడన్నదే పాఠకులు పరిశీలించాలంటాడు ఈయన గ్రుడ్డిగా ఒక సిద్ధాంతానికి కట్టుబడలేదు ప్రత్యేకంగా ఒక తాత్వికసూత్రాన్ని చెప్పి, ఇదే నా సిద్ధాంతమనీ, ఇది తప్ప మిగతా సిద్ధాంతాలన్నీ తప్పు అని విడివాదం చెయ్యడు ఆంగ్ల కవి కీట్సు చెప్పిన Negative Capability సిద్ధాంతంపై ఈయనకు కొంత నమ్మకముంది దీనినే Wise Passiveness అని షేక్స్‌పియర్ అన్నాడు ఈ సిద్ధాంతం ప్రకారం రచయితకు అభిమాన పాత్రలు, విరుద్ధపాత్రలు అంటూ ఏవీ ఉండకూడదు తన దృష్టినుంచి కాకుండా ఉన్నదున్నట్లే చిత్రించాలి అంటే రచయిత వ్యక్తిత్వం ఉండకూడదు తాను ఏమీ లేకుండానే ఇతర వ్యక్తులలోకి ప్రవేశించి వారి తత్వాలను, ఆదర్శాలను వ్యక్తంచెయ్యాలి అప్పుడే నిష్పాక్షిక పరిశీలనకు వీలుంటుంది బుచ్చిబాబు రచయితగా ఈ సిద్ధాంతంపై నమ్మకమున్నవాడు కాబట్టే ఒకచోట "పుట్టిననాటి నుండి చనిపొయ్యేవరకూ మంచిగా ఉండే వ్యక్తులు మనలో ఎవ్వరూ లేరు అజ్ఞానంలో, యౌవన చాపల్యంలో మనం తప్పటడుగులు వేస్తాం. పొరపాట్లుచేస్తాం అప్పుడప్పుడు బోర్లగిలపడుతాం లేచి సర్దుకొని మళ్ళీ బ్రదుకుసాగిస్తాం" అని వ్రాశాడు తన అభిప్రాయాలు, భావాలు ఇలావున్నా లోకంతో నాకేంపని అనుకోలేదు "నా ఆనందంకోసం నేను వ్రాసుకున్నాను, ఎవరికి అర్థంకాకపోయినా ఎవరు బాగులేదన్నా నాకు లెక్కలేదు అని నేను అనుకోను ఏ రచయితైనా అట్లా అన్నా అది నేను నమ్మను. నా సమకాలికులలో కొందరు పిన్నలకి పెద్దలకి నేను చెప్పదలచుకున్నవి అవగాహనకావడం, రుచించడం, సానుభూతితో వారు విమర్శించడం నాకు ఉత్సాహాన్నీ, సంతృప్తినీ కలిగించింది ఇది నా అదృష్టం" అని వ్రాసుకున్నాడీయన అయినా జీవితంపై ఒక నిర్ణీత దృక్పథానికి వచ్చాననీ, అదే తన లక్ష్యమనీ అనుకోడు పైగా సంస్కారం, కళలు, వేదాంతం— వీటి ప్రాబల్యం జీవితంలో ప్రవర్తనపై కనపడాలి సంస్కారం, కళ, తత్వం వీటిని అన్నింటినీ పరిపూర్ణంగా సాధించడంలో ఘనతలేదు శీలంలో, ప్రవర్తనలో వాటిని వ్యక్తంచెయ్యడంలోనే గొప్పతనం ఉందని ఈయన విశ్వాసం. రచయిత వ్యక్తిగతంగా ఈ ఉన్నతస్థితిని అందుకోగలిగినా లేక విఫలుడైనా ఇటువంటి ఆదర్శం ఉండడంమాత్రం ప్రశంసార్హమైనవిషయం. ఆ ఆదర్శం మనిషిని దేవతగా మలచడానికి విశ్వశ్రేయస్సుకూ దోహదమిస్తుంది. ★

# మబ్బుతున్కలు

శ్రీ అందె వెంకటరాజం

మండుటెండల బల్పు మాన్పి కావగ వేల్పు
ఱేడయు డంపిన తెల్లగొడుగు లనగ
ఆల చందురునిలోని యవ్వ యేకిన వాని
గూర్చియుంచిన దూది కుప్పలనగ
మెలమెల్లగా వింగి కొలనిలోపల పొంగి
తూగాడు రాయంచ తుటుము లనగ
పుడమికై జేజేల పడతులంపగ చాల
ముటిసి చిల్కిన వెన్నముద్దలనగ

జలజలని సౌరు మిన్నేఱు జాలువాఱ
వఱలు కెరటాల మవ్వంపు నురుగు లనగ
వింతవింతల కనులకు విందులగుచు
నలతి తెలిమబ్బు తున్కలు పొలిచె మింట.

జిల్లిబిల్లిగ మల్లెమొల్ల లల్లిన మాలి
కలషాలికల పోలికల ధరించె
పిల్లగాడ్పులకు వల్లల్లనాడెడు నచ్చ
రల పయ్యెదల నెయ్యములు వహించె
బాలభానుని పైడి పసలూని పులకించు
వెలి హిమంబుల క్రమం బలమికొనియె
శివగృహాకృతిగాగ చెలువు మీఱెడు వెండి
మల తండములనిండ మలచుకొనియె

పుష్యరాగాల దట్టంపు పొదలదాల్చె
పాలవెల్లి తరంగాల వరుసనందె
బలురకముల జెలంగగా బలురకముల
పొంత పొంతల చిన్నారి మొయిలుగములు.

ఒకచో జంతువితానముల్ నిలిచినట్లొప్పారె, చిత్రంబుగా
నొకచో మేడలు గట్టివైచె, విమలోద్యోగాన భాగీరథీ
సికతాసీమల నేర్చె నొక్కయెడ, ఉత్సేతాచలాగ్రంబులన్,
వికచశ్వేత సరోజషండముల గావించెన్ మరొక్కొక్కచోన్.

ఉదయాస్తమయంబుల ఇను
నెదిరింపన్ బైకిరాగ నెసగిన కినుకన్
విదళింప దొరగు నెత్తుటి
పదనున్ గొనెననగ నెఱ్ఱవాతెను మబ్బుల్

వెన్నెల వెడవెడ గాయగ
క్రొన్నెల చరమాద్రికొనల గులుకు మొయిళ్ళన్
వన్నెల వెదచల్లెడు నా
చిన్నెల సాక్షాత్కరించె శివు దయ్యారే!

జిలిబిలి మేఘమాలికలు చెన్నుగ మిన్కు మినుక్కులాడు చు
క్కలపయి వన్నగా బొలయ గన్పడె నింగి వెలంది యక్కునన్
పొలుపగు ప్రౌఢితోడ జరిపోతల బూవుల గూర్చ జిక్కనౌ
వలిపపుఁబయ్యెదన్ హొయలువాఱగ దాల్చి మెలంగునో యనన్.



కవిత

# వైమనస్యము

—శ్రీ మంద రామారెడ్డి

సుగాత్రి

ఈ తెలనాకు మీకు రుచియించదొ ! నా మరియాద చేతలో
నే తరుగయ్యెనో !! తెలుపనేరవి యే తగులాటమందొ, మీ
చేతము పొర్లిపోవునటు, చెప్పక చెప్పు మొగమ్ముతీరు, న
న్నీ తడబాటులోన బడ నీడిచి, నైజము దాచుకొందురా ?

నాకైన మీ వయః పరి
పాకఫల మ్మాహరించ పాలుపడంగన్
ఏ కాంత పుణ్యమో—మరి
యేకాంతపు జీవనమ్మునే వలచితిరో !!

మీ ప్రసన్నత్వమున్ మేలుకొల్పగ, యేడు
వారాల సొమ్ములు వరుస దిరిగె
ఇ యౌవనము 'రిత్తకయ్యెకా !' యని యెత్తి
పొడువ మానరు చెలుల్ పూట పూట
పొరుగక్కలకు మన పోడిమి, విచ్చ వి
చ్చులు క్రొత్త క్రొత్త ముచ్చటలకయ్యె
నా వంతుననె చూడనాయె, సంతసము, సం
బరము, జాగృతిలోని స్వప్నములుగ
తమ మనమ్ములు పతివిగా తనిసి, తనిసి;
కూర్మి పేర్మలు కొనగొని, కుడిచి, ముడిచి
మురిసి, మెరపెడి కన్నెలముందు యెట్లు
తిరుగుదానను ? లోకపు తీరు లివియె ?

తగియెన్ బిడ్డకు నల్లడున్, కొంత చింతాకంతయున్ ఇంట లే
దు గదా—అద్దె మదంబ శారదను ప్రొద్దుంబ్రొద్దు గోరున్ వరా
ల గడున్, నా యొడిలోన ఒక్క 'మొగ మొల్కన్, జూడగా నాపెకున్
మొగమున్ వాచెను, అవ్వ పేర్వలయునేమో పెద్దకాలానకున్ !

జాముల మీద జాములివి జారెను, వేగగనాయె, అయ్యో సా
మీ ! మరు మాటలాడుట, సమీపముసేయుట లేదుగా ? హరే
రామ ! ఇదెంత మీ మనసు రాయి ? కృశింతునె ! ఒంటి పక్షినై
ప్రేమ లతాంతముల్ పరిమళించెడి సౌహృద వందనమ్మనన్ ?

ఏ నింతలాడియు, బదులు
గా నోచనె యొక్కమాట ? కంటికి రెప్పన్
గానక రేయి గడచె, నా
పై నలిగితిరేమొ ! ప్రాణవల్లభ ! చెపుడా

కాలీనుడు

నవకోత్సేక వినిర్గత ప్రణయ ఘూర్ణాలోక సమ్మోహ నో
త్సవముల్, నిత్య విశేషముల్, సురభిళాస్థల్, ప్రాయికోన్మేషముల్,
యువ దాంపత్య విలాస జీవన రసాద్రోహిహల్; సరే ! కాని, అ
య్యవకాశమ్ములు అందరన్ వలచవద్దా ? ప్రాయ యోగంబునన్

ఒక నైయోగిక బాధ్యతాభర మహోద్యోగమ్ములో, తిండి తీ
రికలే సున్నలు, వెట్టిచాకిరి గదా ! రేయింబగల్, నీకు నా
కిక పొత్తెక్కడ ? నాయెడన్ దొసగు లేదే యింత, నీతాల్చు భ
ర్మ కలాపమ్ముల తోడు ! నమ్మగదవే ! ప్రత్యగ్రరాగోల్లసా !

'అలిగితిరంటి, వేమె సకియా ! అది యెవ్వరిపైన ? బిన, నా
అలుక యదెంత ? ఇల్లటపు టల్లుడనంగనె అత్త కంటికిన్
చులకన, నీవునైత మిటు చూడవె, నా కలగౌరవమ్ము, ఎం
గిలి దగమేసి, వి స్తరుల నెత్తెడి దాసుడు మేలు యింతకున్.

పొడిగాడ్పులకు మడి తడియారకుండ, ఏ
తాము ముప్పూట లెత్తంగవలయు,
పాదు పాదునకు నీర్వార జూచుటకునై
తిరిగిన బోదెనే తిరుగవలయు,
తలిరాకు దొడుగు మొక్కల ప్రక్క, మోసులె
త్తిన కల్పు నొకడనే తీయవలయు,
నడుము టింగురుమన, నడినెత్తి ప్రొద్దగు
వరకు, చింగుల జెక్కి వంగవలయు,

తోళ్ళు పరియవాయు రోహిణి యెండలో,
వంగి వంగి, వ్రాలి వ్రాలి, ఒడలు
బడలిపోయె, ఇట్టి నడుము వాల్చితి, సుంత
తెప్ప కంటి మీద గప్పనిమ్మ!

అత్తది పెత్తనమ్ము, యెదురాడుట కేమి యటుండనిమ్ము నో
రెత్తగ గుండె జేసికొనలేని పరాన్నపు వృత్తినాది—పై
నెత్తులు జిత్తులే మెరుగనేఁని కన్నెటికంపు కోరికల్
రిత్తలుగావె?— నీకిట మరేమగునే, అడియాసలన్ చెలీ!

చారు వయో విలాసము, విసర్గ వికాసము గప్పిపుచ్చ నీ
భూరి విభూషణాల పనిబూని గుణించి, సెబాసు దెల్పగా
తీరికలేదు నాకిట, నదే తెలవాంగవచ్చె, తోటలో
నారులు వోయగా వలెను, నాటులపై తడివేయగావలెన్



## ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘము, విజయవాడ.

# కార్యదర్శి నివేదిక

### హిందీ ప్రచార సమ్మేళనము, హైదరాబాదు.

౬, ౭ జులై ౧౯౫౬

ఈ సమ్మేళనమును రాష్ట్రపతి డాక్టరు రాజేంద్ర ప్రసాదుగారు ప్రారంభించుట హైదరాబాదు, ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారకులకు, విద్యార్థులకు, భాషాభిమానులకు ఆనందదాయకమైన విషయము దక్షిణ భారత హిందీ ప్రచారసభ అధ్యక్షులు సమ్మేళనమును ప్రారంభించుట ఆ సభ ప్రధాన కార్యదర్శి శ్రీ మోటూరి సత్యనారాయణగారు సమ్మేళనమునకు అధ్యక్షులుగా నుండుట మన అదృష్టము ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారసంఘము, విజయవాడ, హైదరాబాదు హిందీ ప్రచార సంఘముల సంయుక్త పర్యవేక్షణక్రింద ఈ సమ్మేళనము జరుగుచున్నది ఈ రెండుసంఘములు దక్షిణ భారత హిందీప్రచారసభ ప్రాంతీయశాఖలు అచిరకాలములోనే ఆంధ్ర ప్రదేశమునకు రాజధాని కానున్న హైదరాబాదు నగరములో యీ సమ్మేళనము జరుగుట ప్రాముఖ్యమగు విషయము

ఆంధ్రరాష్ట్రములో ఇదివరకో ౨౧ సమ్మేళనములు జరిగినవి ఆ సభలకు ప్రముఖ నాయకులు స్వర్గీయ శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు, శ్రీమతి డా॥ అనీ బిసెంట్ శ్రీ రామచంద్ర వామన్‌నాయక్, నాజీ సాహెబ్‌గార్లు అధ్యక్షత వహించిరి ఇంకనూ శ్రీయుతులు టంగుటూరి ప్రకాశం పంతులు, డా॥ పట్టాభి సీతారామయ్య, మాడభూషి అనంత శయనం అయ్యంగారు, గాడిచర్ల హరి సర్వోత్తమరావు, శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్, ఉన్నవ లక్ష్మీనారాయణపంతులు, కె సి రెడ్డి, బెజవాడ గోపాలరెడ్డి, దుగ్గిరాల బలరామ కృష్ణయ్య, అల్లూరి సత్యనారాయణరాజు, రొక్కం లక్ష్మీనరసింహందొర, సామీ వెంకటాచలం శ్రేష్ఠిగార్లు అధ్యక్షులుగానుండిరి ఈ సభలను పూజ్య వినోభా భావే, శ్రీ కాకా కాలేల్కరు, రాజపాల్ శ్రీశ్రీప్రకాశ, డా॥ శ్రీశ్రీమాలీ మొదలగు ప్రముఖులచే ప్రారంభోత్సవములు జరుపబడెను

గాంధిమహాత్ముని ఆదేశానుసారము దక్షిణ భారతములో హిందీ ప్రచారము 1918 లో ప్రారంభమైనది అప్పుడే ఆంధ్ర ప్రాంతములోకూడ హిందీ ప్రచారకార్యము ప్రారంభింపబడెను. నాటినుండి దక్షిణ భారత హిందీ ప్రచార సభ యాజమాన్యమున ఆంధ్రప్రాంతములో హిందీ ప్రచార కార్యము కొనసాగుచున్నది ౧౯౩౬ సం లో యీ రాష్ట్రములో హిందీ ప్రచార కార్యమును విస్తృతముగా, సుస్థిరముగా కొనసాగించుటకై ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచార సంఘము విజయవాడలో స్థాపింపబడెను యీ సంఘము ప్రారంభించిన తరువాత హిందీ విస్తృతముగా ఆంధ్రదేశములో వ్యాపించినది ప్రస్తుతము ఆంధ్రదేశములో పన్నెండు

వందల హిందీ శిక్షణకేంద్రా లున్నవి రెండువందల ఏబది పరీక్షా కేంద్రములున్నవి, ౨౫ వేల మంది భిన్న భిన్న పరీక్షలకు హాజరవుతున్నారు ౧,౫౦౦ ప్రమాణిత ప్రచారకులు భిన్న కేంద్రములలో పని చేయుచున్నారు వారివల్ల ౫౦ వేలమంది హిందీ అభ్యసించుచున్నారు సంఘ సంబద్ధమైన ౮౦ హిందీ ప్రేమీమండలులు వివిధ పట్టణములలో, పల్లెలలో హిందీ ప్రచారోద్యమమును సాగించుచున్నవి

హిందీ ప్రచార సంఘమును స్థాపించిన తరువాత సంఘ కార్యకలాపములు విభిన్న భాగములుగ సుసంఘటితపరచినది విజయవాడలోని సంఘ స్వంతభవనములో కార్యాలయము పరీక్ష, ప్రెస్, ప్రచురణ, విద్యాలయము, గ్రంథాలయము విభాగములుగ పనిచేయుచున్నది. ప్రస్తుతమున్న భవనములు చాలకున్నవి భవన నిర్మాణమునకై ఒకలక్ష ఏబదివేల రూపాయలకు ఒక ప్రణాళికను తయారుచేసి సహాయమునకై కేంద్ర, ఆంధ్ర ప్రభుత్వములకు పంపినాము దక్షిణ భారత హిందీ ప్రచారసభవారు భవన నిర్మాణమునకై యిరువది అయిదు వేల రూపాయలు మంజూరుచేసియున్నారు

ఈ సంఘ పక్షమున ఆంధ్ర ప్రాంతములోని పదకొండు జిల్లాలలో హిందీ ప్రచార కార్యము కొనసాగించుచున్నాము. హైదరాబాదు రాష్ట్రములోని తెలుగు జిల్లాలలో కూడ హిందీ ప్రచార కార్యము కొనసాగించుచుంటిమి ఈ ప్రచార కార్యము యొక్క బాహుళ్యము దృష్టిలో ఉంచుకొని ౧౯౫౧ సం లో హైదరాబాదు హిందీ ప్రచారసంఘము స్థాపింపబడెను అప్పటి నుండి యీ సంఘము హైదరాబాదు లోని అన్ని జిల్లాలలో ఎక్కువ సమర్థతతో హిందీ ప్రచార అభివృద్ధిని చేయుచున్నది

మహాత్మా గాంధీ ఆదేశానుసారము హిందీ ప్రచారము సాగించుచూ యథాశక్తి స్వరాజ్య ప్రాప్తికొరకు, ఐక్యతకు కృషి సలుపుచున్నాము, ఇందుకొఱకు యిప్పటి వరకు మాకు ప్రజల సహాయము లభించుచున్నది మేము ఎక్కువగా విభిన్న విభాగముల నుండి కూడ పై కార్యమునకు ధనమును సమకూర్చుటకు ప్రయత్నములు చేసియున్నాము. రాజకీయ పక్షములకు దూరముగా నుండి గత ౨౫-౩౦ సం లనుండి శ్రద్ధాసక్తులతో యీ కార్యక్రమమును సాగించుచున్నాము తత్ఫలితముగా దక్షిణ భారతదేశములో కొంతమంది హిందీ లేఖకులు, కవులు తయారై హిందీ - ప్రాంతీయ భాషలద్వారా సాహిత్య - సంస్కృతి సమన్వయమునకై కృషి చేయుచున్నారు

పరాధీన భారతదేశములో మేము ఈ ఉద్యమమును జన సహాయముతో స్వయం పోషకముగా సాగించినాము స్వరాజ్యము లభించిన పిమ్మట హిందీ ప్రచారాభివృద్ధికై సంఘము స్వాభావికముగా ప్రభుత్వ సహాయమును కోరియున్నది రాజ్యాంగము కూడ హిందీని రాజభాషగా అంగీకరించెను. కనుక ప్రభుత్వము ఇలాంటి సంస్థలతో కలసి హిందీ ప్రచార కార్యమున కెంతయో కృషిచేయవలసియున్నది ఈ సంఘ పక్షమున రాజ్యాంగ నిర్ణయమును సఫలీకృత మొనర్చుటకు యథాశక్తి ప్రయత్నించుచున్నాము ప్రభుత్వముకూడ ముందు మాకు యీ కార్యమునకు పూర్తి సహకారమివ్వగలదని ఆశించుచున్నాము.

ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘము సమర్పించిన హిందీ ప్రచార ప్రణాళికను ప్రభుత్వము కొంతవరకు అంగీకరించి ఆ ప్రణాళికను అమలుజరుపు కార్యమును ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘమునకు వప్పగించినదని తెలియజేయుట కెంతయో సంతసించుచున్నాము. ఈ ప్రణాళిక ప్రథమ పంచవర్ష ప్రణాళికలో చివరి సంవత్సరములో అంగీకరించినందువల్ల యీ ప్రణాళిక ననుసరించి పనిచేయుటకు మాకు ఆరు నెలలు మాత్రమే వ్యవధి లభించినది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో మా ప్రణాళికను ప్రభుత్వమువారు అంగీకరించి ఎక్కువ సేవ చేయగల అవకాశము కలిపించగలరని విశ్వసించుచున్నాము.

ఆంధ్ర ప్రభుత్వము క్రిందటి సంవత్సరము మొదటి ఫారమునుండి నాలుగవ ఫారము వరకు హిందీబోధన నిర్బంధ పఠనీయ విషయముగా చేసినది. కాని వారమునకు రెండు గంటలు హిందీబోధనకు ప్రత్యేకించినందువల్ల విద్యార్థులకు తగినంత జ్ఞానమును సంపాదించుటకు అవకాశము లేకుండెను. వారమునకు కనీసము నాలుగు గంటలైననూ హిందీ బోధనకు కేటాయించవలసినదిగా ప్రభుత్వమునకు విన్నవించియుంటిమి. మా యీ విన్నపములను యీ సంవత్సరము ప్రభుత్వము అంగీకరించి హైస్కూళ్లలో హిందీ బోధనకు తగిన ప్రోత్సాహమును ఒసంగుదురని ఆశించుచున్నాము.

ప్రభుత్వ, ప్రజల సహకారముతో, ప్రాంతీయ భాషల తోడ్పాటుతో రాజభాష అగు హిందీ అచిరకాలములోనే సర్వతోముఖాభివృద్ధిని పొందగలదని ఆశించుచున్నాము.



# తీర్మానములు

## తీర్మానము ౧

భారత దేశంలో భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన సిద్ధాంతము ననుసరించి ప్రస్తుతమున్న ఆంధ్రదేశము హైదరాబాదులోని తెలంగాణా ప్రాంతము ఏకం కానున్నవి గనుకనూ, తెలుగు భాష మాట్లాడే వారి రాజ్యమునకు హైదరాబాదు రాజధాని కానున్నది గనుకనూ, కొన్ని శతాబ్దములనుండి హైదరాబాదు భౌగోళికంగా, సాంస్కృతికంగా, ఐతిహాసికంగా సార్వదేశిక సంస్కృతికి కేంద్రంగా ఉన్నది గనుకనూ, ముందుముందు అదే విధంగా ఉండబోతున్నది గనుకనూ ఈ సమ్మేళనము తెలుగు మాట్లాడే ప్రాంతానికి సంబంధించిన హిందీ వ్యవహారముల నన్నింటినీ హైదరాబాదులో కేంద్రీకరించవలె ననియునూ, దక్షిణ భారత హిందీ ప్రచారసభకు శాఖలుగా పనిచేస్తున్న హైదరాబాదు హిందీ ప్రచారసంఘము, ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘము ఈ రెండింటినీ కలుపవలెననియునూ అభిప్రాయపడుచున్నది

హిందీ ప్రచారకార్యం యొక్క విస్తారమునూ, ప్రాధాన్యతనూ దృష్టిలో ఉంచుకొని- దానితోబాటు యావత్తు దక్షిణదేశం యొక్క అవసరాలకు అనుకూలమైన సాధన సమీకరణను దృష్టిలో పెట్టుకొని హైదరాబాదులో పెద్ద ఎత్తున హిందీ ప్రచార కార్యమును ప్రారంభించవలెనని ఈ సమ్మేళనం యొక్క అభిప్రాయము దానితో హిందీ ప్రచార కార్య ప్రభావము దక్షిణదేశంలోని నలుమూలలకు వ్యాపించగలదు హిందీ మరియు తదితర భాషల అవసరాలను గురించి సామూహికంగా, సమగ్రంగా ఆలోచించుటకును వాటి కార్యకలాపాలలో పరస్పర సహకారమును సాధించుటకును తగినపని హైదరాబాదులో ప్రారంభం కావలెను హిందీ, ఉర్దూ, తెలుగు, కన్నడము, మరాఠీ, సంస్కృతము, తదితర భాషలలోగల ఉన్నతిశీలములైన ప్రవృత్తుల సమన్వయ సమ్మేళనముల కనువగు రూపంలో హైదరాబాదులో ఒక కేంద్రము స్థాపించబడవలెను అందుకు తగిన ప్రణాళికలను అమలులోనికి తెచ్చుటకును, అవసరమైన సాధనాలను ఒకచోటికి చేర్చుటకును, ఆవశ్యకతను బట్టి హైదరాబాదు, ఆంధ్ర, కేంద్ర ప్రభుత్వపు మంత్రులతోనూ, ప్రతినిధులతోనూ కలసి చర్చించి ఆర్థికాది సహాయములను పొందుటకును, ఈ క్రింది

సభ్యులతో ఒక సంఘమును ఈ సమ్మేళనము నియమించుచున్నది మొదట హైదరాబాదు ముఖ్యమంత్రిని, తదితర మంత్రులను కలుసుకొని హైదరాబాదు నగరంలో మంచి . . . ఇరవై ఎకరాల భూమిని సంపాదించు ప్రయత్నం చేయవలెననీ, దానితోబాటు పైన చెప్పబడిన పనులను సాధించుటకు ఒక ప్రణాళికను తయారుచేయవలెననీ, ఆ ప్రణాళికను ప్రభుత్వ సహాయంతోనూ దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర, హైదరాబాదు హిందీ ప్రచార సంఘముల సహాయంతో . . . లోనికి తీసికొని రావలెననియును ఈ సమ్మేళనము ఆ ఉపసంఘమును కోరుచున్నది ఈ సంఘము తన ప్రయత్నముల పరిణామ స్వరూపమును ఆంధ్ర రాజ్యం ఏర్పడిన తరువాత రూపొందనున్న హిందీ ప్రచార సంఘమునకు సమర్పించవలెను

## ఉపసంఘ సభ్యులు

1 శ్రీ మోటూరి సత్యనారాయణగారు (అధ్యక్షులు)
2 శ్రీ డి శ్రీనివాసయ్యంగారు
3 శ్రీ శీర్ల బ్రహ్మయ్యగారు
4 శ్రీ ఉన్నవ రాజగోపాల కృష్ణయ్యగారు
5 శ్రీ జె వి నరసింగరావుగారు
6 శ్రీ రామకృష్ణ ధూత్ గారు
7 శ్రీ వేమూరి ఆంజనేయశర్మగారు (సమావేశకర్త)

## తీర్మానము ౨.

కేంద్ర సర్కారువారు సంఘ రాజ్య భాషయగు హిందీ ప్రచారమును పెంపొందించుటకుగాను నేటివరకును చేసినపనికి యీ సమ్మేళనము హృదయపూర్వకముగా వారిని అభినందించుచున్నది మరియు సార్వదేశిక దృష్టితో భాషలన్నిటిలోను ఉపయోగింపబడదగు శబ్దములన్నిటిని విద్వన్మండలుల ద్వారా సంగ్రహ మొనర్చుచున్నందులకును, అహిందీ ప్రాంతములలోని భిన్న భిన్న ప్రభుత్వములను ప్రోత్సహించి స్కూళ్ళలోను, కాలేజీలలోను హిందీబోధనను వృద్ధి పరచుటకు ప్రణాళికలు వేయుచున్నందులకును యీ సమ్మేళనము తన సంతోషమును వెలిబుచ్చుచు రాబోవు పంచవర్ష ప్రణాళికలో హిందీకి కూడ యథోచిత ప్రాధాన్య మీయవలసిన దనియు, అందులకు ఆర్థిక సహాయమును

పూర్తిగా జేయవలసినదనియు యీ సమ్మేళనము ప్రభుత్వమును ప్రార్థించు చున్నది.

హిందీ ప్రచారము మహత్తర మైనదగుటవలన అతి శీఘ్రముగా జరుగు టకును, ప్రభుత్వేతర సంస్థలనుండి లభించిన సహాయమువల్ల దానిని అత్యధి కముగ జన రంజకము చేయుటకును, ఆ యా ప్రాంతములలో పనిచేయుచున్న ప్రభుత్వేతర ప్రచార సంస్థలకు పంచవర్ష ప్రణాళికలోని హిందీశాఖకు సంబం ధించిన కార్యములను అప్పగించవలెను

## తీర్మానము ౩.

స్వతంత్ర భారతదేశములో భిన్న భిన్న రంగములలో జరుగుచున్న కార్యము యొక్క విస్తృతిని, ప్రాధాన్యమునుబట్టి చూచినయెడల ఇంగ్లీషు భాషా ప్రాధాన్యము క్రమ క్రమముగా తగ్గిపోవుటయు, ప్రాంతీయ భాషల ఉపయోగము పెరుగుచుండుటయు, ప్రస్తుతము ఇంగ్లీషుభాషకు ఉన్న స్థానము ప్రాంతీయ భాషలతోపాటు అతి శీఘ్రకాలములో సార్వదేశిక భాషయగు హిందీకి లభింపనుండుటయు నిర్వివాద విషయము ఈ విధముగ సార్వదేశిక భాషయగు, హిందీ ప్రాంతీయ భాషలు ప్రతి ప్రాంతములోను విస్తరించి వృద్ధి పొందగలవు ఇట్టిస్థితిలో హిందీ భాషా పరిచయము ఫలానా శాఖవారికి ఫలాని వర్గమువారికి, ఫలాని తరగతి వారికి అవసరములేదని చెప్పుట కష్టమే కాకుండా అసంభవము అందువలన హిందీబోధన హైస్కూళ్ళలో మొదటి ఫారమునుండి ప్రారంభింపబడవలయును హిందీని ఎస్ ఎస్ ఎల్ సి లో పరీక్షా విషయముగా చేయవలెననియు, మూడవఫారము వరకు చదివిన విద్యార్థికి సామాన్యమైన హిందీభాషా పరిచయము కలుగుటకును, ఎస్ ఎస్. ఎల్ సి పరీక్షనిచ్చిన విద్యార్థికి దక్షిణ భారత హిందీ ప్రచార సభవారి రాష్ట్రభాష పరీక్షతో సమానమైన వ్యవహార జ్ఞానము కలుగుటకును అవకాశములు ఏర్పాటు చేయవలెననియు, యీ సమ్మేళనము దక్షిణ భారతములోని ప్రభు త్వములన్నిటిని, ముఖ్యముగా ఆంధ్ర ప్రభుత్వమును ప్రార్థించుచున్నది

## తీర్మానము ౪.

ఈ నాడు భాషపై నాధారపడి జరుగుచున్న పనులన్నియు అనగా ప్రభుత్వ వ్యవహారము లన్నియు రాజ్య పునర్విభజ నానంతరం ఆ యా ప్రాదే

శిక భాషలలో జరుగ గలవని యీ సమ్మేళనము విశ్వసించుచున్నది. ప్రాంతములలో ప్రాంతీయభాషలు రాజభాషలు, కేంద్రములలో హిందీ రాజభాషగ ఉండగలవు కనుక ప్రాంతీయ ప్రభుత్వోద్యోగులు, కేంద్ర ప్రభుత్వోద్యోగులు రెండు భాషలను నేర్చుకొనుట అవసరము హిందీని కేవలము నిర్బంధము చేయుట వలననే ఆ భాషలో మంచి పరిచయము కలుగదు ఆ భాషాభివృద్ధికిగాను అనుకూల వాతావరణము కలిగించుటయు, విశేషముగా ఆ భాషయందు కృషి సల్పుటయు మిక్కిలి ప్రధానములు ఇంగ్లీషు భాషా కాలములో నున్నట్లు కేవలము హిందీ సాహిత్య పరిచయము సంపాదించుటవలన మాత్రమే హిందీ నేర్చుకున్నట్లుకాదు ప్రాంతీయభాషనే బోధనా భాషగా చేసుకున్న విశ్వవిద్యాలయములను యీ సమ్మేళనము అభినందించుచూ అట్లు జరిగిన ప్రగతిశీల నిర్ణయములకు సంతోషమును వెలిబుచ్చుచున్నది ఆ హిందీ ప్రాంతములలోని విశ్వవిద్యాలయముల వారు ప్రాంతీయభాషతోపాటు హిందీనికూడ బోధనా భాషగాచేసి మహావిద్యాలయములకు అంగీకరించి వాటికి సహాయము చేయవలసినదని యీ సమ్మేళనము ఆ విశ్వవిద్యాలయముల వారిని వేడుకొనుచున్నది జనులు అఖిల భారతీయ ప్రజాకార్యములలో పాల్గొని దేశసేవచేయుటకు గాను సార్వదేశిక భాషయైన హిందీని విశ్వవిద్యాలయములలో వైకల్పిక బోధనా భాషగా ఉంచవచ్చునని యీ సమ్మేళనము అభిప్రాయపడుచున్నది కనుక వైకల్పిక బోధనా భాషను గురించిన యీ తీర్మానముపైన హైదరాబాదు, ఆంధ్ర, శ్రీ వెంకటేశ్వర, మద్రాసు, మైసూరు, కర్ణాటక, అన్నామలై, తిరువాన్కూరు విశ్వవిద్యాలయముల వారు ఆలోచింపవలసినదని కోరబడుచున్నారు అట్లు చేయుటవలన అఖిల భారతీయ సేవా కార్యములు చేయుటకు భారతీయ విద్యార్థులందరు ఇతరులతో పోటీలో సమానముగా నిలువగలరు

## తీర్మానము ౫.

ఈ సమ్మేళనము ఆంధ్ర విశ్వవిద్యాలయాధికారులను యం. ఏ వరకు హిందీని ప్రవేశ పెట్టవలసినదిగాను, హిందీలో యం ఏ పరీక్ష జరుపవలసినదిగాను కోరుచున్నది



*హిందీ ప్రచార సమ్మేళనము :*

# సింహావలోకనము

జులై 7, 8 తేదీలు అది హైదరాబాదులోని ఎగ్జిబిషన్ క్లబ్బు. ఎగ్జిబిషన్ ఆవరణమంతా విద్యుద్దీపాలతో, త్రివర్ణ పతాకాలతో అలంకరించబడింది హిందీ ప్రచార సమ్మేళనం ఆ రెండు రోజులూ ఆ ఆవరణంలో జరిగింది సమ్మేళన నిర్వహణకు ఆంధ్ర, హైదరాబాదు హిందీ ప్రచార సంఘాలు రెండూ సంయుక్త యాజమాన్యాన్ని వహించినవి రాష్ట్రపతి శ్రీ రాజేంద్ర ప్రసాద్ సమ్మేళనం ప్రారంభించారు శ్రీ మోటూరి సత్యనారాయణగారు అధ్యక్షత వహించారు

దాదాపు మూడునెలల క్రితమే రాష్ట్రపతి ఈ సమ్మేళన ప్రారంభానికి అనుమతించారు వారు హైదరాబాదు దయచేసిన సమయం అనుకూలంగా ఉండడం వలన జులై 7, 8 తేదీలు అందుకు నిర్ణయించబడ్డవి

ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘంవారు ప్రారంభం నుండి ఈ సమ్మేళనం విషయంలో తగిన శ్రద్ధ చేసుకున్నారు వారి కోరిక ననుసరించి హైదరాబాదు హిందీప్రచారసంఘ కార్యవర్గంవారు సమ్మేళనాన్ని నడిపించే బాధ్యతను తమ మీద పెట్టుకొన్నారు ఆహ్వాన సంఘాన్ని ఏర్పాటుచేశారు గౌ డాక్టరు చెన్నారెడ్డిగారు ఆహ్వానసంఘాధ్యక్షులు గౌ డాక్టరు మేల్ కోటే, గౌ డాక్టరు ఏ బి నాగేశ్వరరావు, నవాబ్ జైన్‌యార్ జంగ్ బహాద్దరుగారలు ఉపాధ్యక్షులు, బంకట్‌లాల్ బద్రూకాగారు కోశాధ్యక్షులు, శ్రీ ఉన్నవ రాజగోపాలకృష్ణయ్యా, వేమూరి ఆంజనేయశర్మగారలు కార్యదర్శులు హైదరాబాదు పురప్రముఖులు చాలా మంది ఆహ్వానసంఘంలో సభ్యులుగా ఉన్నారు హిందీ ప్రచారోద్యమం సాంస్కృతికోద్యమం ప్రాంతీయ భాషల సాహచర్యంతో ఆ ఉద్యమం ముందుకు నడవవలసి ఉన్నది దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఆ ఉద్దేశ్యంతోనే పనిచేస్తున్నది అందువలన సమ్మేళన కార్యక్రమాన్ని రూపొందించడంలో ఆహ్వాన సంఘంవారు ప్రత్యేకమైన శ్రద్ధను తీసుకొన్నారు హైదరాబాదు రాజ్యంలోని హిందీ, ఉర్దు, తెలుగు, మరాఠీ, కన్నడ భాషలనూ, దేవభాష సంస్కృతాన్ని జోడించి మొత్తం ఆరుభాషలలో కార్యక్రమాలను ఏర్పాటు

చేశారు ఆ యా కార్యక్రమాల నిర్వహణకు వేరువేరుగా సమావేశ కర్తలు నియమించబడ్డారు వారందరూ సంపూర్ణంగా ఆహ్వానసంఘానికి తోడ్పడ్డారు

కార్యక్రమాలలో ప్రధానమైన సమ్మేళనంతో బాటు ఒక సాహిత్య చిత్రకళా ప్రదర్శనము, ఐదు భాషలలో కవి సమ్మేళనము, ఐదు భాషలలోని నవలా సాహిత్యానికి సంబంధించిన సాహితీ సమ్మేళనము. ఆరు భాషలలో ఏకాంక నాటికా ప్రదర్శనమూ చేర్చబడ్డవి ఇన్ని భాషలకు సంబంధించిన ఇన్ని అంశాలు చేర్చబడ్డా అన్ని అంశాలూ ఎంతో జాగరూకతతో నడిపింపబడ్డవి సమావేశ కర్తలు చేసిన కృషి సర్వధా ప్రశంసనీయము

సాహిత్య చిత్రకళా ప్రదర్శనానికి ఆరుగురు సమావేశకర్తలు ఏర్పడ్డారు చిత్రకళకు సంబంధించిన విషయాలను గవర్నమెంటు ఆర్ట్సు కాలేజి ప్రధానాచార్యులు శ్రీ విశ్వనాథ ముఖర్జిగారు చూసుకొన్నారు సాహిత్య ప్రదర్శనానికి ఐదుగురు ఐదు భాషలకు వేరు వేరు సమావేశ కర్తలు నియమితులైనారు హిందీకి శ్రీ మధుసూదన చతుర్వేది ఎం ఏ, ఉర్దూకు శ్రీ అబ్దుల్ కాదర్ సర్వరీ ఎం ఏ, తెలుగుకు శ్రీ బి రామరాజు ఎం ఏ, మరాఠీకి శ్రీ ఆర్ యం జోషి ఎం ఏ కన్నడమునకు శ్రీ మాన్వి నరసింగరావు ఎం.ఏ. సమావేశ కర్తలు

చిత్రకళాప్రదర్శనంలో వాల్గొన్న ఉత్తమ చిత్రకళాకారులకు బహుమతు లొసంగబడ్డవి శ్రీ సేతు మాధవరావు, మజరుల్లా సాహబ్, విశ్వనాథ ముఖర్జీ గారలు నిర్ణాయకులుగా పనిచేశారు

సాహిత్య ప్రదర్శనం ప్రత్యేక దృష్టితో ఏర్పాటు చేయబడింది ప్రతి భాషా సాహిత్యాన్ని, దాన్ని యుగాలుగా విభజించి, ఆ యా యుగాలలో ప్రముఖ రచయితలు, వారి ఒక్కొక్క ప్రముఖ కృతీ ఎంచుకోబడ్డవి ప్రతీ పుస్తకం యొక్క ప్రాముఖ్యతను తెలియజేసే కార్డు హిందీలో తయారుచేయబడి, పుస్తకంతో ప్రదర్శింపబడ్డవి అంటే ఇతర భాషలవారికి అరవై డెబ్బయి పుస్తకాలను చూడగానే ఆ యా సాహిత్యాల స్వరూపజ్ఞానం కలుగుతుంది అన్నమాట ఈ ప్రదర్శనాన్ని విజ్ఞులు చాలామంది ప్రశంసించారు గౌరవనీయులైన శ్రీ బూరుగుల రామకృష్ణారావు గారు ఈ ప్రదర్శనాన్ని 8 వ తేదీ ఉదయం ప్రారంభించారు ఉత్తమ చిత్ర కళా కారులకు గౌరవనీయులైన శ్రీ కె వి రంగారెడ్డిగారు బహుమతి ప్రదానం గావించారు.

ఇక సాహితీ సమ్మేళనం ఈ కార్యక్రమం 8వ తేదీ ఉదయం, సాయంత్రం గూడా జరిగింది. హైదరాబాదు విద్యాశాఖ కార్యదర్శి శ్రీ సేతు మాధవ రావుగారు అధ్యక్షత వహించారు ఐదు భాషలలోని నవలా సాహిత్యం ఆనాటి చర్చనీయాంశం. శ్రీమతి రఫియా సుల్తానా ఎం ఏ , శ్రీ ఆర్ యం. జోషి ఎం ఏ, శ్రీ రామనిరంజన పాండే ఎం ఏ , శ్రీ వారణాసి రామమూర్తి ఎం ఏ, శ్రీ సిద్దయ్య పురాణిక్ బి ఏ , బి ఎల్ గారలు ఉర్దూ, మరాఠీ, హిందీ, తెలుగు, కన్నడ నవలా సాహిత్యములను గురించి వ్యాసాలను వ్రాసి చదివారు. వ్యాసాలు ప్రజల మన్ననలను బడసినవి కొద్ది రోజుల్లోనే ఆ వ్యాసాలను పుస్తక రూపంలో ప్రచురించడానికి గూడా నిర్ణయం జరిగింది

8 వ తేదీ సాయంత్రం కవిసమ్మేళనం ఇది ఒక మనోహర స్వప్నం ఐదుభాషలకు చెందిన పది మంది కవులు సమ్మేళనంలో పాల్గొన్నారు సుప్రసిద్ధ కన్నడ కవి శ్రీ సిద్దయ్య పురాణిక్ గారు అధ్యక్షత వహించారు ప్రతి కవితా ఖండికకూ ముందు హిందీ అనువాదం చదవబడింది. దాశరథి, నారాయణరెడ్డి గారలు తెలుగు కవితాఖండికలను, వసంతరావు తులజాపూర్ కర్, పింగళీకర్ లు మరాఠీ కవితలను, హేమంత కులకర్ణి, సిద్దయ్య పురాణిక్ గారలు కన్నడ కవితలనూ, జిగర్ మురాదాబాదీ గారలు ఉర్దూ కవితలనూ గానం చేశారు. ఈ సమ్మేళనంలో జిగర్ మురాదాబాదీ పాల్గొనడం ఒక గొప్ప సంఘటన శ్రీ హమీదుద్దీన్ షాహిద్ సంచాలకత్వంలో కవి సమ్మేళనం ప్రేక్షకుల మన్ననల బడసింది

ఇక ఏకాంక నాటికలు హైదరాబాదు హిందీ ప్రచారసంఘం ఇదివరలో సాంస్కృతిక వారోత్సవాన్నీ, ఏకాంక నాటికల ఉత్సవాన్నీ, జానపద గీతోత్సవాన్నీ జరిపించింది ఆ అనుభవాన్ని పురస్కరించుకొని ప్రచారసమ్మేళన సందర్భంలో ఈ నాటికా ప్రదర్శనోత్సవాన్ని కార్యక్రమంలో చేర్చడం జరిగింది. సంస్కృత నాటికను గూడా ఈసారి అదనంగా చేర్చి మొత్తం ఆరుభాషలలో నాటికలను ప్రదర్శించడం జరిగింది గౌరవనీయులైన శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారు ఈ ఉత్సవాన్ని ప్రారంభించారు ఈ ఉత్సవం 7 వ తేదీ రాత్రి 9 గం కు ప్రారంభమయింది. తెలుగు నాటిక స్వార్థము, మరాఠీ నాటిక రఘూచే లగ్న. హిందీ నాటిక పంచాయత్ మూడూ మొదటిరోజు ప్రదర్శించబడ్డవి శ్రీ రామాచార్యులు, వసంతరావు గోడ్సే, రాధాకృష్ణ జోషీలు వరుసగా తెలుగు,మరాఠీ, హిందీ నాటికలకు సమావేశ కర్తలు. 8 వ తేదీ రాత్రి గం. 7-20 నుండి

చేశారు. ఆ యా కార్యక్రమాల నిర్వహణకు వేరువేరుగా సమావేశ కర్తలు నియమించబడ్డారు. వారందరూ సంపూర్ణంగా ఆహ్వానసంఘానికి తోడ్పడ్డారు.

కార్యక్రమాలలో ప్రధానమైన సమ్మేళనంతో బాటు ఒక సాహిత్య చిత్రకళా ప్రదర్శనము, ఐదు భాషలలో కవి సమ్మేళనము, ఐదు భాషలలోని నవలా సాహిత్యానికి సంబంధించిన సాహితీ సమ్మేళనము, ఆరు భాషలలో ఏకాంక నాటికా ప్రదర్శనమూ చేర్చబడ్డవి. ఇన్ని భాషలకు సంబంధించిన ఇన్ని అంశాలు చేర్చబడ్డా అన్ని అంశాలూ ఎంతో జాగరూకతతో నడిపింపబడ్డవి సమావేశ కర్తలు చేసిన కృషి సర్వథా ప్రశంసనీయము.

సాహిత్య చిత్రకళా ప్రదర్శనానికి ఆరుగురు సమావేశకర్తలు ఏర్పడ్డారు చిత్రకళకు సంబంధించిన విషయాలను గవర్నమెంటు ఆర్ట్సు కాలేజి ప్రధానాచార్యులు శ్రీ బిశ్వనాథ ముఖర్జీగారు చూసుకొన్నారు సాహిత్య ప్రదర్శనానికి ఐదుగురు ఐదు భాషలకు వేరు వేరు సమావేశ కర్తలు నియమితులైనారు హిందీకి శ్రీ మధుసూదన చతుర్వేది ఎం ఏ, ఉర్దూకు శ్రీ అబ్దుల్ కాదర్ సర్వరీ ఎం ఏ., తెలుగుకు శ్రీ బి రామరాజు ఎం ఏ, మరాఠీకి శ్రీ ఆర్. యం జోషి ఎం ఏ కన్నడమునకు శ్రీ మాన్వి నరసింగరావు ఎం.ఏ. సమావేశ కర్తలు

చిత్రకళా ప్రదర్శనంలో పాల్గొన్న ఉత్తమ చిత్రకళా కారులకు బహుమతులొసంగబడ్డవి శ్రీ సేతు మాధవరావు, మజరుల్లా సాహెబ్, బిశ్వనాథ ముఖర్జీ గారలు నిర్ణాయకులుగా పనిచేశారు

సాహిత్య ప్రదర్శనం ప్రత్యేక దృష్టితో ఏర్పాటు చేయబడింది ప్రతి భాషా సాహిత్యాన్నీ, దాన్ని యుగాలుగా విభజించి, ఆ యా యుగాలలో ప్రముఖ రచయితలు, వారి ఒక్కొక్క ప్రముఖ కృతీ ఎంచుకోబడ్డవి. ప్రతి పుస్తకం యొక్క ప్రాముఖ్యతను తెలియజేసే కార్డు హిందీలో తయారుచేయబడి, పుస్తకంతో ప్రదర్శింపబడ్డవి అంటే ఇతర భాషలవారికి అరవై డెబ్బయి పుస్తకాలను చూడగానే ఆ యా సాహిత్యాల స్వరూపజ్ఞానం కలుగుతుంది అన్నమాట ఈ ప్రదర్శనాన్ని విజ్ఞులు చాలామంది ప్రశంసించారు గౌరవనీయులైన శ్రీ బూరుగుల రామకృష్ణారావు గారు ఈ ప్రదర్శనాన్ని 8 వ తేదీ ఉదయం ప్రారంభించారు. ఉత్తమ చిత్ర కళా కారులకు గౌరవనీయులైన శ్రీ కె. వి. రంగారెడ్డిగారు బహుమతి ప్రదానం గావించారు.

ఇక సాహితీ ఘమ్మేళనం. ఈ కార్యక్రమం 8వ తేదీ ఉదయం, సాయంత్రం గూడా జరిగింది. హైదరాబాదు విద్యాశాఖ కార్యదర్శి శ్రీ సేతు మాధవ రావుగారు అధ్యక్షత వహించారు ఐదు భాషలలోని నవలా సాహిత్యం ఆనాటి చర్చనీయాంశం. శ్రీమతి రఫియా సుల్తానా ఎం ఏ, శ్రీ ఆర్ యం. జోషి ఎం ఏ, శ్రీ రామనిరంజన పాండే ఎం ఏ, శ్రీ వారణాసి రామమూర్తి ఎం ఏ, శ్రీ సిద్దయ్య పురాణిక్ బి ఏ, బి ఎల్ గారలు ఉర్దూ, మరాఠీ, హిందీ, తెలుగు, కన్నడ నవలా సాహిత్యములను గురించి వ్యాసాలను వ్రాసి చదివారు. వ్యాసాలు ప్రజల మన్ననలను బడసినవి. కొద్ది రోజుల్లోనే ఆ వ్యాసాలను పుస్తక రూపంలో ప్రచురించడానికి గూడా నిర్ణయం జరిగింది.

8 వ తేదీ సాయంత్రం కవిసమ్మేళనం ఇది ఒక మనోహర స్వప్నం ఐదుభాషలకు చెందిన పది మంది కవులు సమ్మేళనంలో పాల్గొన్నారు సుప్రసిద్ధ కన్నడ కవి శ్రీ సిద్దయ్య పురాణిక్ గారు అధ్యక్షత వహించారు ప్రతి కవితా ఖండికకూ ముందు హిందీ అనువాదం చదవబడింది. దాశరథి, నారాయణరెడ్డి గారలు తెలుగు కవితాఖండికలను, వసంతరావు తులజాపూర్ కర్, పింగళీకర్ లు మరాఠీ కవితలను, హేమంత కులకర్ణి, సిద్దయ్య పురాణిక్ గారలు కన్నడ కవితలనూ, జిగర్ మురాదాబాదీ గారలు ఉర్దూ కవితలనూ గానం చేశారు. ఈ సమ్మేళనంలో జిగర్ మురాదాబాదీ పాల్గొనడం ఒక గొప్ప సంఘటన శ్రీ హమీదుద్దీన్ షాహిద్ సంచాలకత్వంలో కవి సమ్మేళనం ప్రేక్షకుల మన్ననల బడసింది

ఇక ఏకాంక నాటికలు. హైదరాబాదు హిందీ ప్రచారసంఘం ఇదివరలో సాంస్కృతిక వారోత్సవాన్నీ, ఏకాంక నాటికల ఉత్సవాన్నీ, జానపద గీతోత్సవాన్నీ జరిపించింది ఆ అనుభవాన్ని పురస్కరించుకొని ప్రచారసమ్మేళన సందర్భంలో ఈ నాటికా ప్రదర్శనోత్సవాన్ని కార్యక్రమంలో చేర్పడం జరిగింది. సంస్కృత నాటికను గూడా ఈసారి అదనంగా చేర్చి మొత్తం ఆరుభాషలలో నాటికలను ప్రదర్శించడం జరిగింది. గౌరవనీయులైన శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారు ఈ ఉత్సవాన్ని ప్రారంభించారు. ఈ ఉత్సవం 7 వ తేదీ రాత్రి 9 గం కు ప్రారంభమయింది. తెలుగు నాటిక స్వార్థము, మరాఠీ నాటిక రఘూచే లగ్న, హిందీ నాటిక పంచాయత్ మూడూ మొదటిరోజు ప్రదర్శించబడ్డవి శ్రీరామాచార్యులు, వసంతరావు గోడ్సే, రాధాకృష్ణ జోషీలు వరుసగా తెలుగు, మరాఠీ, హిందీ నాటికలకు సమావేశ కర్తలు. 8 వ తేదీ రాత్రి గం. 7-20 నుండి

సంస్కృతము, ఉర్దూ, కన్నడ నాటికలు ప్రదర్శించబడ్డవి. రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్ సంస్కృత ఉర్దూ నాటికలను చూచి చాలా ఆనందించారు భాసుని మధ్యమ వ్యాయోగం సంస్కృతంలోనూ, జంగ్ కే బాద్, బీగరు బరుత్తారే ఉర్దూ కన్నడములలోనూ ప్రదర్శింపబడ్డవి డాక్టర్ ఆర్యేంద్ర శర్మ, హమీదుద్దీన్ షాహిద్ సుబీఖావి ముగ్గురూ వరుసగా ఈ నాటికలకు సమావేశక ర్తలు ఉర్దూ, సంస్కృత నాటకాలు ప్రత్యేక ప్రాముఖ్యతను వహించినవి ఉర్దూ నాటికలో కెప్టెన్ పాత్ర ధరించినవారికి శ్రీ చెన్నారెడ్డిగారు రు 100 లు బహుమతిని యిచ్చారు సంస్కృత ప్రాధ్యాపకులు సంస్కృత నాటకంలో పాల్గొన్నారు, స్త్రీ పాత్రలను అన్ని నాటికలలోనూ స్త్రీలే ధరించారు ఈ నాటికా ప్రదర్శనం హైదరాబాదు పౌరులలో ఒక నూతన సంచలనాన్ని కలిగించింది ఒక మధుర వాతావరణాన్ని సృష్టించింది తత్ఫలితంగా హైదరాబాదు హిందీ ప్రచార సంఘంవారు హైదరాబాదు నాట్యకళా సంగమ్ అనే పేరుతో ఒక సంస్థను నిర్మించి, భారతీయ రాజ్యాంగచట్టంలోని 14 భాషలకు ఆ సంస్థలో స్థానాన్ని కల్పించుటకు పూనుకొన్నారు హిందీ ప్రచారోద్యమ లక్ష్యాన్ని మాటలద్వారా గాక చేతల ద్వారా చూపించడానికి సమ్మేళనంలో ఏర్పాటుచేయబడిన కార్యక్రమాలు ఎంతగానో ఉపయోగించినవి

ప్రధానమైన సమ్మేళనాన్ని గురించి రెండు మాటలు 7 వ తేదీ సాయంత్రం సరిగా గం 6 లకు సమ్మేళనం వందేమాతరం గీతంతో ప్రారంభమైంది ఆంధ్ర గవర్నరు శ్రీ సి యం త్రివేదీగారు ఈ సమ్మేళనానికి దయ చేయడం ప్రత్యేక ప్రాముఖ్యతను వహించింది ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ చెన్నారెడ్డిగారు తమ ఉపన్యాసాన్ని హిందీలో చదివి సుందర వాతావరణాన్ని సృష్టించారు రాష్ట్రపతి ప్రారంభోపన్యాసం అతి ప్రధానమైనది దక్షిణ భారత హిందీ ప్రచారసభ అధ్యక్షులుగా ఉండడంవలన దక్షిణదేశంలో దక్షిణ భారత హిందీ ప్రచార సభవారు చేస్తున్న పనుల నన్నింటినీ వారు ఎరుగుదురు గనుక సభ సేవను వారు ఎంతగానో కొనియాడినారు ముఖ్యంగా మోటూరి సత్యనారాయణగారి సేవనుగురించి రాష్ట్రపతిగారు చేసినప్రశంస ఆంధ్ర, హైద్రాబాదు రాష్ట్రంలలోని హిందీసేవకులనందరినీ పులకితులను చేసింది 38 సంవత్సరాలుగా హిందీ కార్యక ర్తలు చేస్తున్న సేవను — సత్యనారాయణగారి సేవను - రాష్ట్రపతి గు ర్తించడం హిందీ ప్రచారోద్యమానికి కొ త్తశ క్తిని చేకూర్చగలదు తరువాత శ్రీ సత్యనారాయణగారు అధ్యక్షోపన్యాసం చేశారు. ఆ ఉపన్యాసం

శ్రోతల ప్రత్యేక ప్రశంసను పాత్రమయింది సంధియుగములో - హైదరాబాదు నగరంలో - మారిన దేశపరిస్థితులను దృష్టిలో పెట్టుకొని శ్రీ సత్యనారాయణ గారు హిందీ సమస్యలను కూలంకషంగా చర్చించారు. హైదరాబాదు - ఆంధ్ర హిందీ ప్రచారసంఘ కార్యదర్శులు తమ కార్యనివేదికలను చదివి వినిపించారు డాక్టర్ మేల్కోటేగారు సందేశాలను చదివి వినిపించారు హైదరాబాదు హిందీ ప్రచార సంఘాధ్యక్షులు శ్రీ స్వామి రామానందతీర్థగారు ధన్య వాదాలను సమర్పించారు జనగణమన గీతంతో సమ్మేళనం మొదటి సమావేశం సమాప్త మయింది శ్రీ జైన్‌యార్‌జంగ్ బహద్దర్‌గారు అతిథులను ఏ విధంగా అభ్యుత్థానం చేయాలో, ఎవరిని ఏ విధంగా కూర్చొన బెట్టాలో అన్నీ స్వయంగా చూసినారు ఈ సమ్మేళనానికి దాదాపు 250 మంది వరకు ఆంధ్ర, హైదరా బాదు రాష్ట్రాలనుండి ప్రతినిధులు హాజరైనారు ప్రతినిధులకు ఎగ్జిబిషన్ ఆవరణ లోనే వసతి సౌకర్యం సమకూర్చబడినది నియో మైసూరు కేఫ్‌లో భోజన వస తులు సమకూర్చబడినవి 8 వ తేదీ సాయంత్రం గం 3 లకు హిందీ సమ్మేళనం రెండవసమావేశం జరిగింది శ్రీ సత్యనారాయణగారు అధ్యక్షత వహించారు మొత్తం 5 తీర్మానములు చేయబడ్డవి తీర్మానాలలో మొదటి తీర్మానం చాలా ముఖ్యమైనది ఆ తీర్మానాన్ని రామకృష్ణహూత్‌గారు ప్రతిపాదించారు శ్రీని వాసయ్యంగారు బలపరచారు హైద్రాబాదు - ఆంధ్ర హిందీ ప్రచారసంఘము లను ఏకం చేయవలెననీ, భవిష్యత్తులో ఏర్పడనున్న ఆంధ్రరాజ్యంలో హిందీ ప్రవృత్తులను నడిపించే ముఖ్యకేంద్రం హైదరాబాదు కావలెననీ ఆ తీర్మానం బోధిస్తున్నది రెండవది ఒకపెద్ద సాంస్కృతిక కేంద్రాన్ని హైదరాబాదులో స్థాపించుటకు ఈ తీర్మానం ద్వారా పునాదులు ఏర్పడ్డవి పాఠశాలల్లో హిందీ శిక్షణ, కేంద్ర ప్రభుత్వ హిందీ కార్యకలాపాలు, బోధనా భాషలుగా హిందీ ప్రాంతీయ భాషలస్థానము మొదలగునవి తీర్మానాలలో చర్చించబడ్డవి హిందీ ప్రచార చరిత్రలో ఈ సమ్మేళనం ప్రత్యేకతను వహిస్తున్నది

హైదరాబాదు ప్రభుత్వంవారు ఈ సమ్మేళనాన్ని జరిపించుకొనుటకు రు 1000-0-0 లు విరాళంగా ప్రసాదించారు ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచారక సంఘంవారు రు. 2000-0-0 లు విరాళంగా యిచ్చారు దానితో ఆర్థికంగా ఆహ్వానసంఘంవారి బరువు కొంతవరకు తీరిపోయింది హైదరా బాదు ప్రభుత్వం హిందీ యెడల చూపిస్తున్న ఉదారతకు ఇది ఒక ఉదాహరణ అని చెప్పవచ్చును. ఈ సమ్మేళనం పేరుతో దాదాపు వందమంది ఏపేరుతో

నైతేనేమి దివారాత్రములు నిరంతర కృషి చేశారు పత్రికా విలేఖరులు గూడా ఎక్కువగా సహకరించారు ముఖ్యంగా ఈ సమ్మేళనంలో ప్రతినిధుల ప్రత్యేక ప్రశంసకు పాత్రులైన వ్యక్తులు ముగ్గురున్నారు వారు శ్రీ రామకృష్ణ ధూత్, బిర్థిచంద్ చౌధరి, శ్రీ శంకర్‌జీ అమితోత్సాహంతో ఈ ముగ్గురూ ఆహ్వాన సంఘానికి ఎనలేని సహాయం చేశారు ఆహ్వానసంఘాధ్యక్షులు పూర్తి కార్యకలాపములను సక్రమంగా జరిగేటట్లు చూచుకొంటూ ఏలోటు లేకుండా సమ్మేళనం జయప్రదంగా జరుగుటకు ప్రత్యేక శ్రద్ధను వహించారు భోజన ఉపసంఘ సభ్యులు శ్రీ కల్వ సూర్యనారాయణగుప్త, రోకర్సీలాల్ కపాడియా గారలు, స్వయం సేవకుల ఉపసంఘ సభ్యులు మధుసూదన చతుర్వేదీ, తూము రంగారావుగారలు, సభా వేదికను సుందరంగా అలంకరించుటకు తోడ్పడిన శ్రీ కె వేంకటాచార్యులు గారల కృషి ప్రశంసనీయము తీర్మానాలను తయారుచేయుటకు ఆంధ్ర - హైదరాబాదు హిందీ ప్రచార సంఘముల సంయుక్త కార్యవర్గ సమావేశములు జరిగినవి ఆసమావేశములలో పాల్గొన్న సభ్యులెల్లరు ప్రశంసనీయులు అసలు ఈ సమ్మేళనానికి ప్రాతిపదిక రూపంలో ఉండి సర్వ విధాలా కృషిచేసిన శ్రీ ఉన్నవ రాజగోపాల కృష్ణయ్యగారు, ఆహ్వాన సంఘము ఏర్పడిన తరువాత సమ్మేళనాన్ని జయప్రదంగా నడిపించుటకు పనిచేసిన శ్రీ ఆంజనేయశర్మగార్ల కృషి శ్లాఘాపాత్రము

ఈ సమ్మేళన ఫలితంగా కొత్త వాతావరణం ఏర్పడి హైదరాబాదు, ఆంధ్ర రాష్ట్రములలో రాజభాషా ప్రచారం విరివిగా జరగగలదని ఆశించవచ్చును





త్రైమాసిక హిందీ శిక్షణ విద్యాలయ సమావర్తనోత్సవము 1956.



సికిందరాబాదులో విశారద విద్యాలయ ప్రారంభము



హిందీ ప్రచారక విద్యాలయము – విద్యార్థులు, విద్యార్థినులు

# హైదరాబాదు హిందీ ప్రచార సంఘము

# కార్యదర్శి నివేదిక

*౭, ౮ జులై ౧౯౫౬.*

హిందీ ప్రచార సమ్మేళన సందర్భంలో హైదరాబాదు హిందీ ప్రచార సంఘ కార్యవర్గ పక్షమున కార్యదర్శి నివేదికను సమర్పించుటకు సంతసముగ నున్నది 1951 నుండి హైదరాబాదు హిందీ ప్రచార సంఘము దక్షిణ భారత హిందీ ప్రచార సభకు శాఖగ నుండి పనిజేయుచున్నది 1923 సంవత్సరము నుండియే హైదరాబాదు రాజ్యంలో దక్షిణ భారత హిందీ ప్రచారసభ పనిజేయ ప్రారంభించినది. ఆనాడు పరీక్షా కేంద్రములు ప్రారంభమై పలువురు హిందీ విద్యార్థులు పరీక్షలకు హాజరగుచుండిరి కాని ఆనాటి ప్రభుత్వము హిందీ ప్రచార కార్యమును సక్రమముగ జరుగనీయలేదు అయినను నిరుత్సాహపడక హిందీ కార్యకర్తలు పనిజేయుచునే యుండిరి మహాత్మాజీ దక్షిణ భారత హిందీ ప్రచార సభను ప్రారంభించినారను విషయము మీకు తెలియనిది గాదు హిందీ స్వరూపమును పురస్కరించుకొని మన దేశంలో జరిగిన వాదవివాదము లలో ఈ సంస్థ మహాత్మాజీ మార్గమును అనుసరించినది ఆ కారణము వలన హైదరాబాదులోని కొంతమంది కార్యకర్తలు ఈ సంస్థను వదలివేసిరి స్వాతంత్ర్యము లభించిన తరువాత హైదరాబాదు రాష్ట్రము భారతదేశమున లీనమాయెను. హైదరాబాదులోని ప్రముఖులగు నాయకుల సలహా సంప్రతింపులతో 1952 వ సంవత్సరమున హైదరాబాదు హిందీ ప్రచారసంఘము స్థాపించబడి ఒక అడ్ హాక్ కమిటీ నిర్మించబడినది శ్రీ స్వామీ రామానందతీర్థ గారు అధ్యక్షులుగను, శ్రీ డాక్టర్ మేల్ కోటే, శ్రీ డాక్టరు చెన్నారెడ్డి గారలు ఉపాధ్యక్షులుగను, శ్రీ ఆంజనేయశర్మ కార్యదర్శిగను నియమింపబడిరి కార్యవర్గమునకు ఈ క్రింది సభ్యులు ఎన్నుకొనబడిరి

సభ్యులు, సర్వశ్రీ దేవీసింగ్ చౌహాన్, ఆర్ యం జోషి, యస్ ఆర్. దేశపాండే, బొమ్మకంటి సత్యనారాయణరావు, జె వి నరసింగరావు, పల్లెర్ల హనుమంతరావు, వినాయక పితాంభగవాన్ దాస్ చారంరాజ్ కర్, పంపనగౌడ పాటీల్, చంద్రశేఖర పాటీల్, జె కె ప్రాణేశాచార్య, రామకృష్ణధూత్, పండిత్ నరేంద్ర, బంకట్ లాల్ బద్రూకా, యం బి గౌతమ్, పర్చా రంగారావు, శ్రీమతి ప్రఫుల్లాతాయి దేశముఖ్ గారలు

ఈ సంఘము నాలుగైదు సంవత్సరముల లోపల తగినంత అభివృద్ధిని సాధించినది. దక్షిణ భారత హిందీ ప్రచారసభవారి పరీక్షలలో హైదరాబాదు రాజ్యము నుండి నాలుగైదువేల మంది విద్యార్థులు హాజరగుచున్నారు 1951 నుండి వరంగల్లు, సికిందరాబాదు, ఖమ్మంమెట్టు, జనగామ కేంద్రములలో విశారద విద్యాలయములు నడుపబడెను కొంతమంది విద్యార్థులకు ఉపకార వేతన మొసంగబడెను ఆ విద్యాలయములలో 100 మంది ఉపాధ్యాయులు తయారయి ప్రభుత్వ పాఠశాలలలోను, జనసామాన్యంలోను హిందీ ప్రచారమును చేయుచున్నారు హిందీ ఉపాధ్యాయులకు ప్రత్యేక శిక్షణ నొసంగుటకు హైదరాబాదులో హిందీ ప్రచారక విద్యాలయము 1951నుండి నడచుచున్నది స్టేటులో 32 హిందీ ప్రేమీమండలులు ఏర్పడి హిందీ ప్రచారమును గావించుచున్నవి మరాఠ్వాడాకు గాను సేలూలోను, కర్ణాటకప్రాంతమునకు గుల్బర్గాలోను ప్రాంతీయ కార్యాలయములు స్థాపించబడినవి

హైదరాబాదులోని కేంద్ర కార్యాలయమున హిందీ గ్రంథాలయము నడుపబడుచున్నది ఆ గ్రంథాలయమున వివిధ భాషలకు సంబంధించిన పుస్తకములు 2000 వరకు గలవు వాచనాలయమునకు 50 పత్రికలు తెప్పించబడుచున్నవి సంఘపక్షమున 15 మంది వైతనిక ప్రచారకులు, 20 మంది సహాయక ప్రచారకులు పనిచేయుచున్నారు అహిందీ ప్రాంతములలో పనిజేయు హిందీ కార్యకర్తల జ్ఞానాభివృద్ధికి గాను ప్రతి సంవత్సరము హిందీ ప్రచారక శిక్షణ శిబిరము నడుపబడుచున్నది ఖమ్మంమెట్టు, వరంగల్లు, మహబూబునగరం జిల్లాలలో జిల్లా హిందీ ప్రచార సంఘములు, జనగామ తాలూకాలో జనగామ హిందీ ప్రచారసంఘము ఏర్పడి పనిచేయుచున్నవి భారతదేశములోని విభిన్న భాషల సాహిత్యమును తెలుగు, కన్నడ, మహారాష్ట్రసోదరులకు అందజేయుటకు స్రవంతి పత్రికను నడుపుటకు ప్రణాళిక సిద్ధంచేయబడినది ప్రస్తుతం తెలుగులో స్రవంతి పత్రిక ప్రారంభింపబడినది కన్నడ, మహారాష్ట్ర భాషలలో స్రవంతిని ప్రారంభించుటను ప్రయత్నము జరుగుచున్నది సాంస్కృతిక సమన్వయమును దృష్టిలో నుంచుకొని సంఘపక్షమున అప్పుడపుడు సాంస్కృతికోత్సవములు, సాహిత్య గోష్ఠులు, నాటక సమ్మేళనములు నడుపబడుచున్నవి 1954 వ సంవత్సరమున అఖిల హైదరాబాదు హిందీ ప్రచార సమ్మేళన సందర్భమున జానపద గీతోత్సవము నడుపబడినది